మ. అమితధ్వాంతతమాలవల్లిలవనవ్యాపారపారీణదా
త్రము సౌగంధికషండకుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రమనిర్వాణఘృణీకుంచికయు నాఁగం బెంపున న్నీకళా
రమణీయత్వముచూడ నొప్పెసఁగుఁ జంద్రా! రోహిణీవల్లభా!

మ. చరమక్ష్మాధరచారుసింహముఖదంష్ట్రాకోటియో నాఁగ నం
బరశార్దూలనఖంబు నాఁగఁ దిమిరేభప్రస్ఫురద్గర్వసం
హరణక్రూరతరాంకుశంబనఁగ నుద్యల్లీల మీరేఖ ని
త్యరుచిన్ బోల్పఁగఁ బెంపగున్ విదియచంద్రా! రోహిణీవల్లభా!

మ. పాలకయ్యంబులఁగల్గుముద్దుటలుకన్ బుష్పాయుధారాతి క్రొ
క్కులఁదీర్పన్ దలమీఁదఁగానవగు నీక్రుమ్మెన్ను పుణ్యాంగనా
తిలకంబై నభవానిపాదనఖపంక్తిం జెంద డెందంబులోఁ
దలఁతా చుక్కలతోడిమక్కువలు చంద్రా! రోహిణీవల్లభా!

మ. రతినాథుండనుమాయజోగి చదలం త్రైలోక్యవశ్యాంజనం
బతియత్నంబునఁగూర్చి మౌక్తికమయంబైయున్నపాత్రంబునన్
మతకం బేర్పడఁబెట్టిదాఁచెనన నీమధ్యంబునన్ మచ్చ సం
తతమున్ గన్నులపండువై వెలయుఁ జంద్రా! రోహిణీవల్లభా!

—త్రిపురాంతకుఁడు.

# భాద్రపద ప్రసక్తి

హరి రాధాకృష్ణమూర్తి గారు

వారిదవారణేంద్రఘనవాహ్యమునెక్కి తటిల్లతాధ్వజం
బోరగదాల్చి దిక్తటము లూపు ఘనస్వనమంగళధ్వనుల్
వారగ గ్రీష్మభూవిభుని పాతము దెల్పుచు వచ్చునిన్ను గ
న్నారగ గాంచ రుద్రమ యనందలపించెదుగా నభస్యమా!

పూనిగృహాంగణంబులను బొందుగ ముగ్గిడి సంతమాత్రనే
యేనుగుమోమువానిని గణేశుని పూజలొనర్తురో జనుల్
ధీనుతుఁ నాగజాస్యుని ధృతిం గనజాలిననిన్ను శంభు స
న్మానితగాఁదలంచెదరు మంగళతో సమయాట మాసమా!

పంటవలంతి నెల్లెపుడు బాయక సేవలఁజేయు కర్షకుం
డింటిని వీడిరానియటులీవు జలంబులనిచ్చి కాచె దా
పంటల సత్కృపానిధివి భాగముగోరవు నిన్నుఁబోలువా
రుంటను గాదె లోకమిది యొప్పెడు నింతనైన మాసమా!

ఉల్లము పల్లవించుకద యొప్పులకుప్పగునట్టి రోహిణీ
వల్లభు గాంచినన్ బ్రియమువాయగఁ జేసితి వానియందు మా
కెల్లర కింత తొందరిల కెన్నడువచ్చునో యాశ్వినమ్ము నీ
పెల్లగు గర్వమేమగునో బీరము శ్రేయమె పెద్దవారికిన్.

భద్రములకెల్ల, బదమని
భాద్రపదము నాగ నిన్ను బలికెద రార్యుల్
భద్రంబులేవి? సౌఖ్య
చ్ఛిద్రంబులు పైత్రుకపువి శేషములున్నన్.




## ప్రపంచ రాజకీయములు: స్త్రీలపలుకుబడి

ప్రపంచరాజకీయములందు స్త్రీలకుపలుకుబడి ఇప్పుడున్నంత నిశితముగా ఇదివఱకెన్నడును ఉండలేదనుట సత్యదూరముకాదు. నేడు రాజకీయమునందును, వర్తకమునందును ప్రపంచప్రఖ్యాతిగాంచిన నాయకమహాశయులు తమఔన్నత్యమునకై స్త్రీజనములకు ఎక్కువగ ఋణపడియున్నారమని ఎలుగెత్తి చాటుచున్నారు. సాధారణపౌరులజీవితములందును స్త్రీలపలుకుబడి విశేషముగనున్నదని చెప్పబనిలేదు. ఈవిషయమెఱింగిన ప్రతిభాశాలిగావుననే అమెరికాసంయుక్తరాష్ట్రములఅధ్యక్షుడు హూవరుమహాశయుడు ఇంటింట తననామము వినదించుటకుగాను సౌందర్యపోషణమునకై స్త్రీలు వెలకుతీయువస్తువులపై అమ్మకపుపన్ను (Sales tax) తీసివేయుచు శాసించినాడు. పాశ్చాత్యస్త్రీలు సౌందర్యపరిపోషణమునకై వాడు సబ్బులు, మొగముమెఱుగులు మొదలగునవి మనము విలాసవస్తువులుగ భావింతుము. వానికొఱకై వారు వెచ్చించుధనము అపారము. అట్టివస్తువులపై అమ్మకపుపన్ను తీసివైచుట అర్థశాస్త్రవేత్తలకు సమ్మతముకానిది. అయినను హూవరుమహాశయుడు తీసివైచినాడు. ఇందలి చిదంబరరహస్యమేమి? అమెరికా సంయుక్తరాష్ట్రములఅధ్యక్షుని ఎన్నికలకు హూవరు తిరిగి అభ్యర్థియైయున్నాడు. ఈసౌందర్యపరిపోషకవస్తువులపై అమ్మకపుపన్నుతీసివైచుటచే స్త్రీలు సంతోషించి హూవరుఅభ్యర్థిత్వమును సమర్థింతురు. స్త్రీలు సమర్థించుటయనగా వారికివారు ఓటుచేయుటయేగాక తమతమ మగవారిచేగూడ వారు తమపలుకుబడినుపయోగించి హూవరుకు ఓటుచేయింపగలరు. స్త్రీలపలుకుబడి నేటి రాజకీయములందు ఎంత నిశితముగానున్నదో, వారిసాయమును రాజకీయవేత్తలెట్లు అర్థించుచున్నారో హూవరుయొక్క ఈచేతచే సువిదితమగుచున్నది.

నాగరికశిఖరముననున్న సంయుక్తరాష్ట్రములఅధ్యక్షుడు హూవరు స్త్రీలపలుకుబడికి ఇట్లు యోగ్యతాపత్రమిచ్చుచున్నాడు. రవియస్తమింపని విశాలాంగ్లసామ్రాజ్య

భారవహుడు మేగ్డొనాల్డుమంత్రిమాణిక్యకు ప్రపంచరాజకీయములందు స్త్రీలప్రవేశమును గూర్చి ఏమని చెప్పుచున్నాడో ఇక చూతుము: "తమకుగల పరిజ్ఞానమును పూర్తిగ వినియోగమునకు తెచ్చుటలో స్త్రీలే సమర్థులని నాఅనుభవమునుబట్టి నేను నొక్కి చెప్పగలను. ఛాన్సలరు ఆఫ్ది ఎక్స్చెకర్ ఉద్యోగమున స్త్రీలు నిరుపమలు. మగవారమగు మేము మంత్రులమై డౌనింగువీథిలోని 10—వ నెంబరుగల ఈపార్లమెంటుఆఫీసుగదియందు ఈమూడు వత్సరములును కూర్చుండక మాకుబదులు స్త్రీలే కూర్చుండియుండుచో రాజకీయమున ఈ విపరీతములు, విక్రాంతులు లేకుండియుండునని నేను నిరాఘాటముగ చెప్పగలను." చూచితిరా? మేగ్డొనాల్డువాక్యములు! స్త్రీలపలుకుబడికి ఇంతకంటెనిదర్శనము ఏమికావలయును?

ఈనడుమజరిగిన ఆయుధవిసర్జనసభలో వివిధదేశములనుండివచ్చిన పురుషప్రతినిధులు ఏతీరున మెలంగిరో ఎల్లరకు తెలిసినవిషయమే. ఆసభలో ప్రథమమునప్రసంగించినస్త్రీ మేరీ ఎడిగ్మ్యాన్ కన్య. ఆమెఉపన్యాసము నిండుసభలో సభ్యులను నివ్వెఱపొందించినది. స్త్రీల అంతర్జాతీయసంఘమువారి ఆయుధవిసర్జనోపసంఘమునకు ఆమె అధ్యక్షురాలు. ఆమె ఇట్లు చెప్పినది: "అంతర్జాతీయప్రఖ్యాతి చెందిన పదునైదుస్త్రీసంఘములకు నేను ప్రతినిధురాలను. ఈపదునైదుస్త్రీసంఘములకును ప్రపంచమునందలి ఏబదియారు వివిధదేశములందు శాఖలుగలవు. ఈశాఖలన్నిటియందును మొత్తమున నలుబదియైదుమిలియన్లస్త్రీలు సభ్యురాండ్రుగనున్నారు. ఎనిమిదిమిలియన్ల స్త్రీలసంతకములతో విరాజిల్లుచున్న ఈవిజ్ఞప్తిని ఈసభవారికి సమర్పించుచున్నాను. ఈవిజ్ఞప్తియందలి ప్రతిఒక్కసంతకమును మన నేటి నాగరికత మూలముట్టముగనశింపకుండ చేతనైనంతవఱకు నిరోధింపకాంక్షించు స్త్రీవ్యక్తి హస్తమునుండి ఉద్ధారితమైనదిగ మీరు నమ్మవలయును. మనమందరమును యుద్ధమేఘముల ఛాయలో ప్రొద్దులుపుచ్చుచున్నాము. స్త్రీలమగు మేము శాంతిసూర్యుని ఉదయమును అర్థించుచున్నాము. ప్రజాసంఘమును శాంతిసూర్యునినే ఆరాధించుచున్నది. భయము, ఆశ అను మేఘములు ఆశాంతిసూర్యుని కప్పివేయుచున్నవి. యుద్ధమనబడు నాశనదేవత నిరాఘాటవిహారమునకొఱకు మేము తెంపులేనిత్యాగమును చూపవలసినవారమగుచున్నారము. అయినను ప్రపంచశాంతినిగోరుటలో మాస్త్రీసంఘముయొక్కలాభము ఒక్కటే మాదృష్టిలోలేదు. రానున్నతరమువారిక్షేమమునుగురించియు మేము విచారింతుము. మేము స్త్రీలము అనగా మాతృస్వరూపులము. గడచిన సంగ్రామసంక్షోభముచే మానసములందు కలిగినదుఃఖము ఇంకను అడగారలేదు. మఱియొకటి అట్టియుద్ధముకలుగుచో మాసంతానమునకు సంభవింపగల అపారనష్టమునుగూర్చియే మేము అహర్నిశలు భయపడుచున్నారము. ఆభయముచేత మేమిక్కడకువచ్చి శాంతిని అర్థించుచున్నారము. మాసంతానము నిరర్థకముగ విలుప్తమైపోవుట మేము చూడలేము. ప్రజాసంఘము ఈసభపై దృష్టినిగిడించియున్నది. అది శాంతిని అర్థించుచున్నది. ఈయబడుగాకయనికోరెదము." ఆయుధవిసర్జన

సమావేశమువలన వరిముల్లువాసియేని లాభము ప్రపంచమునకు కలుగుచో అది ఆసమావేశమునకువచ్చిన స్త్రీలపలుకుబడిమూలముననే ఘటిల్లినదని చెప్పవలసియుండునని విశ్వవిఖ్యాతి గాంచిన పత్రికలుచాటినవి. "ప్రతిఘటించుట ఎఱుగరుకాని పరిపాలించుటకు పెట్టినదిపేరు. అన్వేషణ లేకపోవచ్చునుకాని అమర్చిపెట్టుటలో సాటిలేనివారు." అని స్త్రీలనుగూర్చి రస్కినుమహాశయుడు పలికియున్నాడు. ఆవాక్యములయొక్క సత్యమును నేటి ప్రపంచచరిత్ర వ్యక్తీకరించుచున్నది. భావికాలమున ప్రపంచరాజకీయములందు స్త్రీలపలుకుబడి కోటిగుణితము కాగలదనిచెప్పుటకు జోస్యమక్కఱలేదు.

# మల్లమ్మ దేవి తుదిపలుకు

వడ్లమాని అప్పారావుగారు

వసుపుపారాణితో పడుచులుండెడుకోట
మిసిమియల్లుండ్రచే మెరయుకోట,
వెలమవీరులకోటి చెలగియాడెడుకోట
పెండ్లిమట్టాలతో విరియుకోట,
మృగరాజశౌర్యమ్ము తెగటార్పగలకోట
పాపయ్యదృష్టిచే మనినకోట,
పుణ్యవీరాంగనాభూరిప్రభావమ్ము
లస్తమింపక నిత్య మలరుకోట,
ఇపుడు శాత్రవకఠినుడా యీనృపాలు
క్రౌర్యకౌటిల్యదుర్ణయకలితమైన
ముట్టడికిలొంగి బూడిదప్రోవులయ్యె
కటకటా! మీరు దోకదేని కలుగదేల?

* * *

కోటసంరక్షించు కులదేవతకు నేడు
మోకాళ్ళువిరిగిన ముదిమివచ్చె,
వసుపుకుంకమ్ముతో పాపయ్యదయ సేయు
వధయమీవాటితో నస్తమించె,
వెలమవీరులకేని వీర్యాంశ మీనాడు
వెంబడునోయినశక్తి మొనలడాగె
పైక ఫెళార్భటులతో కలనైనపోరాడు
సైన్యమ్ము లీవేళ సమసిపోయె,
ఇదియె సమయమ్ముగా పెంచి యీనృపాలు
డెదురెవరులేని వీటిలో నదురులేక
వచ్చిపడినా డయో! మగవారలేరు
చేయరానట్టి పనికిసంసిద్ధుడగుచు.

* * *

గాఢనిద్రావస్థ కాదుసుమ్మీ యిద్ది
పరిణయోత్సవమగ్నమార్గమమ్ము,
రిపులపెండాడగాలేని వీరులుకారు
ఆజిలోదిగని సింహములుతప్ప,
కరవాలపాణులై కయ్యమాడకకారు
ధర్మయుద్ధము సేయు ధన్యతములు,
అశ్రుధారకు లొంగు నాడువారలుకారు
వీరపుత్రులకన్న వెలమవారు
అట్టిమా వారిగెల్చిన యశమునీవు
నిలచిపోవును జనులకన్నీటిప్రోల
పాటపాడక, మెరయక, పగిలిపోయి
కానలో జారు వెన్నెలకణమువోలె.

* * *

కత్తిని చేతపూని చిర
కాలము రాఘవరామచంద్ర! నా
యుత్తమవంశజాతుడు మ
హోన్నతశౌర్యనిధానమౌచు, న
న్నెత్తి యశమ్ములోజొనిపి
యీనృపకోటిని శిక్ష సేయ, నా
చిత్తము నేలపైవిడిచి
వీరులుపోరెడుచోటి కేగదక.

# కాలనిర్ణీతం

శ్రీమతి యు. సత్యబాలసుశీలాదేవిగారు

......ఆమె తనచిన్నిచంద్రుణ్ణి పోగొట్టుకొని చాలారోజులయింది. అయినా మిసిమిచిందుతూండె తెల్లనిసొట్టబుగ్గలలేతనవ్వు, చిన్నిచేతుల చల్లని కౌగిలింత, వొళ్లుమరిపించే—ఆముఖచంద్రుడి ముద్దులమురిపెము తలుచుకుంటే ఆమె తడియారిపోయిన పేదగుండెలు కుమిలిపొయ్యేవి. "నాచిట్టిచంద్రుణ్ణి ఎలా మరచిపొయ్యేది? భగవంతుడా!" అనుకుంటే ఆమెకళ్లు కెంపువర్ణంగా జలపూరిత ఘటాలయిపొయ్యేవి. ఆదుఃఖావేగంలోనే ఆమెపరవశయై కళ్లుమూసుకునేది. ఆవిస్మృతావస్థలోనే ఆమెకోస్వప్నం.

చంద్రుడు ఆడుకుంటూ, ఆడుకుంటూ అమ్మను వెతుక్కుంటూవచ్చేసి "అమ్మా! నన్ను విడిచిపెట్టేశావా" అన్నట్టు జాలిచూపులుచూస్తూ చేతులందించేడు. అంతులేని హృదయావేగంతో దరిగానలేనిదరిద్రుడు ధనపుమూటను వలె బిడ్డను వక్షానికదిమేసుకుని తనివితీర ముద్దులాడుతోంది. మాతాశిశువుల ప్రేమపథపర్యవసానప్రదర్శనం కాబోలు! చంద్రకుమారు డామాతృమూర్తిలో నిశ్శేషంగా లీనమయ్యేడు.

మరికొన్ని నెలల కామె పసిబిడ్డతల్లి. ఈప్రేమామృతఝురిలో ఆదుఃఖనిలం సంపూర్ణార్ద్రమైపోయింది. వొళ్ళోఉన్నపిల్లాణ్ణి పలుకరించి, పలుకరించి తన్మయత్మం పొందుతోంది. తీర్చిదిద్దినట్టున్న పిల్లాడి నల్లనికనుబొమలు చేత్తోసవరిస్తూ దగ్గరగానవ్వుతూ నించోనున్న భర్తకుచూపిస్తూ 'చూడండి! సమంగా చంద్రుడి ముఖమే! అచ్చుగుద్దినట్టే. ఆకళ్ళూ, నొసలూ, ......'అంటూ మాతృమమకారంతో మందహాసంచేసింది.

మాతృమూర్తీ! చిరకాలమువఱకల్లే అమృతహాస మొసర్పుము!
దుఃఖమా! మరియిచ్చట నీశక్తిపడీ!
సుఖమా! నీనిలవరమేది?
కాలమా! నీనిర్ణీతమేమి?

# స్వానుభవం

కె. కుటుంబరావుగారు

౧

"ఏంరా, బాబూ? అంతాకులాసా?" అన్నాను చదువుతూన్న వార్తాపత్రిక మడిచిబల్లమీద పెట్టి.

బాబు కుర్చీ నాకుదగ్గిరగా ఈడ్చుకుని కూర్చుంటూ "ఆ" అన్నాడు.

"కమలం కులాసా? దాన్నికూడా తీసుకురాక పోయినావూ? ఎప్పుడో నీపెళ్లికి చూడటం! సంసారం రుచిస్తున్నదా? బ్రహ్మచర్యమే బాగుందనిపిస్తున్నదా?"

బాబు పరధ్యానంగా నాప్రశ్నలమతో నేసి "ఒక్క మాటడుగుతాను. చెప్పు, బాబాయి!" అన్నాడు.

"అడుగు."

బాబుకుబుద్ధి తెలిసినప్పటినించీ నే నేతల్లీతండ్రీనూ. ఇంతకాలం నేను వాడికి పినతండ్రి నైనా సరిగా లేను. మేమిద్దరం స్నేహితులంగా ఉంటూవచ్చాం. ఒక్క అనుభవంలో తప్ప తతిమ్మా విషయాలన్నిట్లో మేమిద్దరం సమానంగా ఉండేవారం. ఉద్యోగం వచ్చినప్పటినించీ వాడు నాదగ్గిరఉండటం పడ్డదికాదు. ఇప్పుడు భార్యకూడావచ్చింది. ఎంతో కాలంకాలేదు; నెల రోజులైంది.

వాడు ప్రశ్నలువెయ్యటం నేను తోచినట్టు సమాధానాలు చెప్పటం మొదటినించీ ఉన్నదే.

"అతిగా భార్యాభ్రమకలవాణ్ణేమంటారు?" అది వాడిప్రశ్న.

నేను ఆలోచించి "కొత్తగా సంసారంలో దిగిన వాడియందు అది మంచిచిహ్నమనే చెప్పాలి" అన్నాను.

"కాదు! కాదు! భార్యనువదిలి ఒక్క క్షణంఉండ లేడనుకో! ఒక్కక్షణం భార్యఅవతలికిపోతే ఊపి రాడదనుకో!"

"అంత అన్యాయంగా ఉందా?" అన్నాను.

"చెబితే నమ్మవు! నేను బాగా ఆలోచించాను, బాబాయి! నాకు నీమీదప్రేమలేదా? నిన్నువదిలి ఉండలేదా?"

"అయితే ఇప్పుడు దాన్ని వదిలిఉండలేదా?"

"ఉన్నాను! కాని..." బాబుకొద్దిగా తికమక పడ్డాడు భావాన్ని తెలియచెయ్యటానికి. "ఒక్కొక సమయంలో నన్ను నేను విమర్శించుకోగలను. అటువంటిసమయంలో నన్ను, నాభయాన్ని, భ్రమనుచూస్తే నాకు చాలా ఎగతాళిగాఉంటుంది. కాని ఇప్పుడు ఒంటరిగాకూర్చుని ఒక్కనిమిషం దాని సంగతి ఆలోచిస్తే ఇక్కడ నాకు ఒక్కక్షణంఉండబుద్ధికాదు. నే నీవూరువద్దామని ఎన్నిరోజులనించీ ప్రయత్నం! ఇక ఒకరోజుకూడా ఆలస్యంచేసేటందుకు వీలులేక వచ్చానన్నమాట!"

"ఆ! దానికేమిటి? అది కూడా దిక్కులేని పిల్ల కావటంచేత దానిబాధ్యతఅంతా నీదే కనక నీకు దాని విషయం అంతశ్రద్ధఉండటం తప్పులేదు" అని తేల్చేశాను. కాని బాబుమాత్రం వంగలేదు.

"భగవంతు డున్నాడనేనమ్మకంమీద నాకష్టసుఖాలుకూడా నేనెన్నడూ లెక్క చెయ్యలేదు. నా భార్యవిషయం వచ్చేసరికి నాకు ఆభగవంతుడియందు నమ్మకం ఏమయిపోతుందో! మొన్న ఒకరాత్రి అది బావిదగ్గిరికిపోయింది, బాబాయి! నేనేదో చదువుకుంటూకూడా తోడుపోదామని సగంలేచాను. నాకే అసహ్యంవేసింది. ఏమిటీపిచ్చి అనిపించింది. వెళ్ళలేదు. చదవటం మొదలుపెట్టాను. నాకొక్కముక్క అర్థమైతేనా? ఇట్లా చదవాలని ఒక్కనిమిషం ప్రయత్నంచేశానేమో! నాకాఒక్కనిమిషం పదినిమిషాల మాదిరిగాఉంది. చీకట్లో పురుగూపుట్రాఉంటుందని భయం! దొడ్లోఏదొంగాదైనాదాగున్నాడని భయం! ఎన్నడూ ఏభయంఎరగను! ఈకొద్దిరోజుల్లో నేనుపిరికివెధవనైపోయినాను, బాబాయి. లేచివెళ్ళకపోతే

ఇంకాపాడు ఆలోచనలు వచ్చేటట్టు కనిపించింది. వెంట నేలేచి బాబిదగ్గిరికి వెళ్ళాననుకో! ఏమంటావు?" బాబు దీనంగా నవ్వాడు.

నాకీసంగతి చెప్పి నాచేత కోప్పడించుకోవాలని బాబు ప్రయత్నం. నేనాపని చేసేదాకా వాడికి తృప్తి ఉండదు. నేనుకొద్దిగా కోపంగొంతు పెట్టాను.

"ఎంతఆపేక్షఅయినా ఉండనీ! అంతచాదస్తం పనికిరాదుసుమా! మగవాడికి భార్య సమస్తమూ కావటానికి వీలులేదు. మగవాడికాలం మూడువంతులు బయటా ఒకవంతు ఇంట్లోనూ గడుస్తుంది. కాలం యావత్తూ ఇంట్లోగడపటంవల్లా, పురుషుల్లో ఎక్కువ తిరగక పోవటంవల్లా మగవాడు చవటఅయిపోతాడు. లేకపోతే కీచకుడు భీముడిచేతులోచావనా? ఇటువంటివన్నీ అలవాట్లు. మనోనిగ్రహంచేత వశంకానిది లేదు. ఇప్పుడు నీకు నీభార్యయందుగలప్రేమ ఆడతనంతో కూడుకున్నది. దానికి నిగ్రహం తోడవుతే గాని రాణించదు. నీభార్య నిన్నివిధంగా ప్రేమిస్తే దానిలో తప్పులేదు. అది స్త్రీ సహజమైనది. దానిలో పురుషార్థంలేదు. తెలిసిందా?"

బాబు తలవంచుకుని నేచెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు. నా డీవిధంగా నాయందు భయభక్తులు తెచ్చిపెట్టుమంటే చూసినప్పుడల్లా ప్రేమకూడా తెచ్చిపెట్టుకున్నదేనా అని ఒక్కక్షణం అనుమానం కలుగుతూంటుంది నాకు!

"నాకు కొంచెంటూరింగుపని తగిలింది, బాబాయి!" అన్నాడు బాబు మెల్లిగా—అప్పుడే చివాట్లుతిన్నవాడి గొంతుతో! "నేనెల్లుండి వెళ్ళిపోవాలి. ఒకనెల రోజులు పనిఉంటుంది. దాన్ని రేపుతెచ్చి ఇక్కడ విడిచిపోతాను."

"మంచిది."

౨

కమలం చాలాబుద్ధిమంతురాలు. "ముగ్ధ"అంటారు చూడండి! ఆజాతిది. ముగ్ధలయందున్న విశేషం ఏమిటంటే ఇతరస్త్రీలకన్న అబలలుగా కనిపిస్తారు. చూసినవారికల్లా దగ్గిరతీసి సంరక్షించాలనిపిస్తుంది. కొంతమంది ఆడవాళ్ళనుచూస్తే ఈభావం ఎంతమాత్రం కలగదని చెప్ప నవసరంలేదు!

బాబు కమలాన్ని వెయ్యికళ్ళ కనిపెట్టిఉన్నాడంటే ఆశ్చర్యంఏమిటి? అది మాఇంట అడుగుపెట్టిన క్షణంనించీ దానిసౌకర్యం నేను స్వయంగా కనుక్కుంటూవచ్చాను. బాబు టూరింగుమీద వెళ్ళిపోయినాడు.

రెండుమూడురోజులు గడిచింది. ఒకరోజురాత్రి నాభార్య కమలానికి శరీరంలో సరిగాలేదని చెప్పింది. నా కమితదిగులు పుట్టింది. బాబుకన్న నాకెక్కువ అనుభవంఉండి ఏంప్రయోజనం నేనుకూడా వాడిమోస్తరుగా ప్రవర్తిస్తే? "ఫర్వాలేదులే! రేపుతగ్గిపోతుంది"అన్నాను నాభార్యతో.

మర్నాటికి తగ్గలేదు. నాభార్య నాతో తిరిగి దాని శరీరంసంగతి ఎత్తింది. లక్షణాలు కనుక్కున్నాను. సరిగా భోజనంచెయ్యదట, పరధ్యానంగాఉంటూ వచ్చింది. "బాబుకోసం దిగులుపడ్డదేమో!"అన్నాను. ఆలోచించినకొద్దీ ఈకారణం చాలాసమంజసంగా కనిపించింది.

అయిదోరోజున కమలం మంచానపడ్డది. ఆరోజున వాంతులూ, తలనొప్పి, నూటనాలుగుడిగ్రీల జ్వరమూ మొదలయినై. నాకు కాళ్ళాడలేదు. డాక్టరువచ్చి చూసి విషజ్వరమన్నాడు, నాలుగురోజులకిందనే తన్ను పిలవవలసిందన్నాడు, అజాగ్రత్తకు ఫలంఅనుభవించాలిసొస్తే తనతప్పేమీ ఉండదన్నాడు. ఏదో మందిచ్చాడు.

నా కారోజు భోజనంరుచించలేదు. కమలం మంచానపడ్డది—నాఅప్రయోజకత్వంవల్ల. ఎందువల్లనో కమలాన్ని భర్తకు తిరిగి నప్పగించలేనని నాకు అధైర్యంకలిగిపోయింది! కావాలని చేతులార చేశాం. బాబు మొహం ఎట్లాచూడటం?—అప్పుడు!

ప్రతిరోజూ వాడిదగ్గిరనించి ఉత్తరంవస్తూనేఉంది. రోజుకోఊరినించి. ప్రతిఉత్తరంలోనూ కమలంసం

గతి అడుగుతూ నే ఉన్నాడు. ఈరోజు వచ్చిన ఉత్తరం చూసేసరికి నాకు గుండె నీరయింది. ఒకరోజున్న ఊళ్ళో ఒకరోజుండక పోవటం చేత వాడికి ఉత్తరం రాయటం కష్టం. అసలు చేరక పోదు. రెండురోజు లాలస్యం అవుతుంది. కమలం జబ్బు సంగతి రాయాలని కూర్చున్నాను. నాకు చెయ్యి ఆడలేదు; మానేశాను.

ఆ రాత్రి నాకెంత సేపటికీ నిద్రపట్టలేదు. ఎన్ని సార్లో నిద్రపట్టటం ఏదో చప్పుడై బాబు వచ్చాడని ఉలికిపడి లేవటం జరిగింది. నా శరీరంలో కూడా సరిగా లేదు మొత్తానికి! కమలం బతకరాదా? నేను పోతాను! ఇంత అధైర్యం నాకెందుకా అన్న ఆలోచన కూడా రాలేదు. కమలం బతకదని నా చెవిలో ఎవరో పదే పదే చెబుతున్నారు!

నాకు కాలమానం లేకుండా పోయింది. పగలు రాత్రి భేదం లేదు. నేనదివరకు చూస్తున్న వస్తువులు కొత్తగా కనిపించటం మొదలు పెట్టినై. ఆ భేదం స్పష్టంగా చెప్ప లేను—బహుశా అప్పుడంత శ్రద్ధగా గమనించక పోవటం చేత నేమో. నాకు తెలిసినదల్లా ఒక్క విషయం కమలం కుంగిపోతున్నది. ఇంకా ఇరవై అయిదు రోజుల్లో బాబు వచ్చి భార్యను చూపించమంటాడు! వాడు వచ్చేసరికి నేను కూడా పోయి ఉంటే! అప్పుడు వాడేమవుతాడు?

నా ఆత్మ కమలం పడుకున్న మంచం చుట్టూ తిరుగు తున్నది. లేక నే నే తిరుగుతున్నానో? ఎన్ని సార్లు చూసినా కమలం నిశ్చలంగా కదలకుండా పడుకుని ఉంటుంది. ఒక్క రవ్వ చలనం లేదు. ఇప్పటికే పోయిం దేమో? పోతే అందరూ ఎందుకేడవరు? నాతో ఎం దుకు చెప్పరు? పిచ్చివాళ్ళు! ఇంకా కనుక్కోలేదు. వాళ్ళు కనుక్కునేవరకూ నేను చెప్పను! నిజం ఎంత కాలం దాగుతుంది?

ఎంతో కాలం దాగలేదు! ఒకసారి నేను కమలాన్ని చూడవచ్చేసరికి కమలం మీద ఒక గుడ్డ కప్పి ఉంది. ఎవరూ ఏడవటం లేదు. నాకెందుకో ఆశ్చర్యంగా లేదు!

బాబుకు రమ్మని టెలిగ్రాం ఇవ్వాలి. ఎవరితోనో చెప్పాను టెలిగ్రాం ఇవ్వమని. ఎన్నో రోజులు గడిచి నట్టున్నది నాకు. ఇంకా బాబు రాడేమి? కమలం ఉన్న చోటికి వెళ్లాను. శవాన్ని తీసేశారు.

ఈ పనులన్నీ, పాపం, ఎవరో నాకు చేసిపెడు తున్నారు. లేకపోతే నేను చెసుకోగలనా? ఎవరిని చూచినా, ఏ వస్తువును చూచినా కళాహీనంగా ఉంది! కమలం పోవటం వల్ల నేమో?

బాబు వస్తాడు. నాకు భయం లేదు. జరిగిన సంగతి చెబుతాను. అప్పుడప్పుడు ఎరగని వాళ్లెవరో వచ్చి నా వంక చిత్రంగా చూసి పోతూంటారు. మరి పిచ్చివాణ్ణి చేసేశారు నన్ను. కోపం వస్తే నేమనిషిని కాదు!

బాబు వచ్చాడు. ఏమీ మాట్లాడకుండా నాకెదు రుగా వచ్చి నిలబడ్డాడు. నా వంక ఎందుకట్లా చూస్తాడు? "కమలం ఏది?" అన్నాడు బాబు. ఏది? నేను బలహీనంగా నవ్వాను. "నీకింకా తెలియదా?" అన్నాను. "తెలుసును!" అన్నాడు. "ఇంకేం!" అన్నాను నిర్లక్ష్యంగా.

"కమలాన్ని ఎక్కడో దాచి,—పోయిందని చెప్తూ తావా?" అన్నాడు బాబు పళ్లు బిగబట్టి. ఆమాట ఎందుకో వినడు! చచ్చిపోయింది! చచ్చి! చచ్చి! నేను చెబుతాను కమలం ఏమయిపోయిందో—నన్నడిగితే.

బాబు మాట్లాడకుండా లోపలికి వెళ్లాడు. వాడడు గుల చప్పుడు వినిపిస్తున్నది—కాస్సేపు హాలులో, కాస్సేపు నాగదిలో; చివరకు కమలం పూర్వం ఉన్న గదిలో చప్పుడాగిపోయింది.

కొంతసేపు నిశ్శబ్దం. తరవాత బాబు ఆగదిలోనే అటూ ఇటూ పచారు ప్రారంభించాడు. ఎంతసేపటికీ ఆ అడుగుల చప్పుడాగదేం? ఒక గంట కాదు! పదిగం టలు కాదు! ఎంతసేపా పచారు! నాకు తలతిరిగిపోతు న్నది. ఒక్కసారి "ఆపు!" అని కేక వేశాను బిగ్గరగా. తిరిగి నిశ్శబ్దం.

ఈ నిశ్శబ్దం భరించటం కష్టంగా ఉంది. ఏ చప్పుడూ కాదేమి ప్రారబ్ధం?

గతి అడుగుతూనే ఉన్నాడు. ఈరోజు వచ్చిన ఉత్తరం చూసేసరికి నాకు గుండె నీరయింది. ఒకరోజున్న ఊళ్ళో ఒకరోజుండక పోవటంచేత వాడికి ఉత్తరం రాయటం కష్టం. అసలు చేరకపోదు. రెండురోజులాలస్యం అవుతుంది. కమలం జబ్బు సంగతి రాయాలని కూర్చున్నాను. నాకు చెయ్యి ఆడలేదు; మానేశాను.

ఆ రాత్రి నాకెంత సేపటికీ నిద్రపట్టలేదు. ఎన్ని సార్లో నిద్రపట్టటం ఏదో చప్పుడై బాబు వచ్చాడని ఉలికిపడి లేవటం జరిగింది. నాశరీరంలో కూడా సరిగా లేదు మొత్తానికి! కమలం బతక రాదా? నేను పోతాను! ఇంత అధైర్యం నాకెందుకా అన్న ఆలోచన కూడా రాలేదు. కమలం బతకదని నా చెవిలో ఎవరో పదే పదే చెబుతున్నారు!

నాకు కాలమానం లేకుండా పోయింది. పగలు రాత్రి భేదం లేదు. నేనదివరకు చూస్తున్న వస్తువులు కొత్తగా కనిపించటం మొదలు పెట్టినై. ఆ భేదం స్పష్టంగా చెప్పలేను—బహుశా అప్పుడంత శ్రద్ధగా గమనించక పోవటం చేత నేమో. నాకు తెలిసినదల్లా ఒక్కటే విషయం కమలం కుంగిపోతున్నది. ఇంకా ఇరవై అయిదు రోజుల్లో బాబు వచ్చి భార్యను చూపించమంటాడు! వాడు వచ్చేసరికి నేను కూడా పోయి ఉంటే! అప్పుడు వాడేమవుతాడు?

నా ఆత్మ కమలం పడుకున్న మంచం చుట్టూ తిరుగుతున్నది. లేక నేనే తిరుగుతున్నానో? ఎన్ని సార్లు చూసినా కమలం నిశ్చలంగా కదలకుండా పడుకుని ఉంటుంది. ఒక్క రవ్వ చలనం లేదు. ఇప్పటికే పోయిందేమో? పోతే అందరూ ఎందుకేడవరు? నాతో ఎందుకు చెప్పరు? పిచ్చివాళ్ళు! ఇంకా కనుక్కోలేదు. వాళ్ళు కనుక్కునే వరకూ నేను చెప్పను! నిజం ఎంత కాలం దాగుతుంది?

ఎంతో కాలం దాగలేదు! ఒకసారి నేను కమలాన్ని చూడవచ్చేసరికి కమలం మీద ఒక గుడ్డ కప్పి ఉంది. ఎవరూ ఏడవటం లేదు. నాకెందుకో ఆశ్చర్యంగా లేదు!

బాబుకు రమ్మని టెలిగ్రాం ఇవ్వాలి. ఎవరితోనో చెప్పాను టెలిగ్రాం ఇవ్వమని. ఎన్నో రోజులు గడిచినట్టున్నది నాకు. ఇంకా బాబు రాడేమి? కమలం ఉన్నచోటికి వెళ్లాను. శవాన్ని తీసేశారు.

ఈ పనులన్నీ, పాపం, ఎవరో నాకు చేసిపెడుతున్నారు. లేకపోతే నేను చేసుకోగలనా? ఎవరిని చూచినా, ఏ వస్తువును చూచినా కళాహీనంగా ఉంది! కమలం పోవటం వల్లనేమో?

బాబు వస్తాడు. నాకు భయం లేదు. జరిగిన సంగతి చెబుతాను. అప్పుడప్పుడు ఎరగని వాళ్ళెవరో వచ్చి నా వంక చిత్రంగా చూసిపోతూంటారు. మరి పిచ్చివాణ్ణి చేసేశారు నన్ను. కోపం వస్తే నేమనిషిని కాదు!

బాబు వచ్చాడు. ఏమీ మాట్లాడకుండా నాకెదురుగా వచ్చి నిలబడ్డాడు. నా వంక ఎందుకట్లా చూస్తాడు? "కమలం ఏది?" అన్నాడు బాబు. ఏది? నేను బలహీనంగా నవ్వాను. "నీకింకా తెలియదా?" అన్నాను. "తెలుసును!" అన్నాడు. "ఇంకేం!" అన్నాను నిర్లక్ష్యంగా.

"కమలాన్ని ఎక్కడో దాచి,-పోయిందని చెప్పతావా?" అన్నాడు బాబు పళ్ళు బిగబట్టి. ఆ మాట ఎందుకో వినడు! చచ్చిపోయింది! చచ్చి! చచ్చి! నేను చెబుతాను కమలం ఏమయిపోయిందో-నన్నడిగితే.

బాబు మాట్లాడకుండా లోపలికి వెళ్లాడు. వాడడుగుల చప్పుడు వినిపిస్తున్నది—కాస్సేపు హాలులో, కాస్సేపు నా గదిలో; చివరకు కమలం పూర్వం ఉన్న గదిలో చప్పుడాగిపోయింది.

కొంతసేపు నిశ్శబ్దం. తరవాత బాబు ఆ గదిలోనే అటూ ఇటూ పచారు ప్రారంభించాడు. ఎంతసేపటికీ ఆ అడుగుల చప్పుడాగదేం? ఒక గంట కాదు! పది గంటలు కాదు! ఎంతసేపా పచారు! నాకు తల తిరిగిపోతున్నది. ఒక్కసారి "ఆపు!" అని కేక వేశాను బిగ్గరగా. తిరిగి నిశ్శబ్దం.

ఈ నిశ్శబ్దం భరించటం కష్టంగా ఉంది. ఏ చప్పుడూ కాదేమి ప్రారబ్ధం?

అప్పుడప్పుడూ మాటలువినబడ్తై. మనిషి కనబడడు. ఎవరో మందంటారు. ఎందుకుమందు? కమలం కాస్తాపోయినతరవాత! ఎవరా పిచ్చిఅనేది? నాకేనాపిచ్చి? వళ్లుతెలిసిమాట్లాడు.

ఎంతకాలంజరిగిందో తెలియదు. నేను నాగదిలో కూర్చున్నాను. అక్కడికి ఎప్పుడువచ్చానో ఎట్లా వచ్చానో జ్ఞాపకంలేదు. నాగదికి పడమటగాఉంది "దాని" గది. ఆగదిలోనించి నాగదికి వాకిలిఉంది. ఆవాకిలి మెల్లిగా తెరిచి బాబు నాదగ్గరికివచ్చాడు.

"బాబాయ్!"

"ఏంరా, బాబూ?"

"ఇప్పు డది ఇటురాలా?"

"ఎవరు?"

"కమలం."

బాబుకు మతిపోయింది. పాపం, మనం తొందర పడరాదు. "నాకు కనపడలేదురా, నాయనా!"

"ఇప్పు డిటువచ్చింది, బాబాయి!"

"ఎక్కడినించి?"

"ఆగదిలోనించి. ఇంతకుముందు నేను నిద్రపోతున్నాను. నేను లేచేసరికి కమలం ఎదురుగానిలబడ్డది, బాబాయి! నేనుపిలిస్తే పలక్కుండావచ్చేసింది. కమలం నాతో ఎందుకుమాట్లాడదు? బాబాయి!"

"బహుశా! మాట్లాడాలన్నా మాట్లాడలేదేమో?" అన్నాను.

"అంటావా?" అన్నాడు బాబు ఆలోచిస్తూ. "కమలం ఎక్కడుందో చెప్పవూ? నీకన్నీ తెలుసు, బాబాయి! నీకు తెలీనిదిలేదు. కమలంఏది? నీకప్ప చెప్పిపోతినే దాన్ని! దాన్నివదిలిపెట్టి నేనుండలేనని నీకు తెల్దూ?

నేను మాట్లాడలేదు. ఏమిమాట్లాడను?

తిరిగి కొంతకాలానికి–మర్నాడుదయమే నేమో!– బాబు నాగదిలోనికివచ్చాడు.

"బాబాయ్!"

"ఊఁ!"

"కమలం మాట్లాడింది. చాలసేపు నాదగ్గర కూర్చుంది. పాపం, నువ్వు దాచావనుకున్నాను. నువ్వు దాచలేదుట. కమలంచెప్పింది. నాదగ్గరకే వస్తానన్నది, బాబాయి. కొంతకాలం ఆగమన్నది."

బాబు ఈశుభవార్త నాకుచెప్పి గదిలోకి తిరిగి వెళ్లిపోయినాడు. ఇట్లా చాలాసార్లయింది. బాబు కమలం బతికివచ్చినట్టే సంతోషించాడు. ఎప్పుడూ కమలం వాడికి కనిపిస్తూనేఉండేది. ఎవడేపిచ్చి వాడి కానందమంటే ఇదేకాబోలు!

ఒకరోజు నేను నాగదిలో నేపడుకున్నాను. నాకు నిద్ర మెలుకువవచ్చేసరికి ఎక్కడో మాటలు వినపడ్డాయి. గది ఉత్తరపువైపువాకిలి వరండామీదికి ఉంది. ఆవాకిలి ఆసమయంలో ఓరగా తెరిచిఉంది. నేను చూస్తుండగానే కమలం అటునించి ఇటువెళ్లింది వాకిలిముందుగా. నాఆశ్చర్యం చెప్పటానికిలేదు. వెంట నేలేచి బయటికి పరిగెత్తాను.

దూరంగా మాయింటిముందు చాలామంది—అందరూ అరవవాళ్లే—కలకలంగా మాట్లాడుకున్నారు. నేను లేవగానే నేవిన్నది వాళ్లసందడే! అదుగో అగుంపులో కమలం!

"ఎవరండీమీరు?" అన్నాను వారిదగ్గరికిపోయి.

"మాది దచ్చాది" అన్నాడు గుంపుపెద్ద.

"ఏంపనిమీదవచ్చారు?"

"ఈకుర్రదానికి పెళ్లి చెయ్యవలా అని ఉండి వచ్చాం." కమలాన్ని చూపించాడాయన. చూసిన కొద్దీ ఆయనమొహం ఎరిగినమొహంగా ఉంది. మనిషినిపోలినమనిషి ఉంటాడు!

"ఈపిల్ల ఎవరు?"

"మాపిల్ల!" అన్నాడాయన గర్వంగా.

"ఎవరికిస్తారు?"

"ఎవ్వరుదుడ్డిస్తే వారు!"

"ఎంత?"

"రెండువేలు రుపా!"

"నేనిస్తాను. నాకిచ్చేసిపొండి."

అరవాయన—ఆయన పుణ్యమా అని— వెంటనే వస్తు ఉన్నాడు! ఆయన డబ్బు ఆయనకు పారేశాను. ఆయనా ఆయన బలగం వెంటనే నిష్క్రమించారు. కమలం మాత్రం నా పక్కనే నిలబడి ఉంది. దానివంక తిరిగాను. తీరా చూస్తే ఆపిల్ల కమలం మోస్తరుగా లేదు. ఆ అరవవాడు గారడీవాడుగా ఉండాలి! ఏమిటో చిత్రం! నేను చూసినకొద్దీ ఆపిల్ల రూపం మారిపోవటం మొదలు పెట్టింది. చివరకు నా కళ్ల ఎదటనే అంతర్ధానమయిందా పిల్ల! తరవాత నాకు వళ్లు తెలియదు!

3

...నేను తిరిగి మనుష్యప్రపంచంలో పడేసరికి ఆ అరవవాయన మాటలు నా చెవిని పడ్డయి.

"ఇక ఫరవాలేదు లెండి!" అంటున్నాడాయన నిబరతోనే.

నేను కళ్లు తెరిచి చూశాను. నామంచం దగ్గిరగా కుర్చీమీద డాక్టరు వరదాచారిఅయ్యంగారు కూర్చున్నాడు. దూరంగా ఇంత మొహం చేసుకుని నా భార్యా, కమలం నిలబడ్డారు.

"ఓహో, కామేశ్వర్రావుగారు! గుడ్ మార్నింగ్! ఎలా ఉంటుంది?"

"బలహీనంగా ఉన్నది" అన్నాను మెల్లిగా.

"ఓ మరి బలంగా ఉండు నేమి? ఎన్నాళ్లకు కళ్లు తెరిచినారయ్యా! నువ్వు మొత్తంమీద మంచి అదృష్టవంతుడు!" అన్నాడు డాక్టరు ఉత్సాహంతో. "...నేను వస్తానమ్మా! మళ్లీ సాయంత్రం వచ్చి చూస్తాను. ఇక ఫర్వాలేదు లెండి!......వస్తానండి, కామేశ్వర్రావు గారు. ఎక్కువగా మాట్లాడకండి. అసలే వొద్దు! తెలిసయిందా?"

డాక్టరు వెళ్లిపోయినతరువాత నా భార్య దగ్గిరికి వచ్చి మీద చెయ్యి వేసి, "ఎట్లా ఉంది?" అన్నది జాలిగా.

"ఇప్పుడు హాయిగా ఉంది" అన్నాను.

నాకు నిజంగా హాయిగా ఉందికూడాను! అప్పుడు ఏడుగంటలయిందేమో పొద్దున. ఏవారమో, ఏనెలో ఏమీ తెలియదు.

పదిగంటలకు కమలం ఉత్తరం పట్టుకుని నాదగ్గిరికి వచ్చింది.

"ఏమిటమ్మా?" అన్నాను.

"ఇవాళ మీ అబ్బాయి వస్తారు. తిరగటం అయిపోయిందట."

"ఎప్పుడు వస్తాడు?"

"సాయంత్రం ఆరుగంటలకు."

"సరేలే!"

అనుకున్న ప్రకారం రాత్రి దీపాలు పెట్టేవేళకు బాబు వచ్చాడు. వచ్చీ రావటంతోటే నామంచం మీద కూర్చుని. "పాపం, ఎంత జబ్బుపడ్డావు, బాబాయి!" అన్నాడు.

"ఇవ్వాళ్లకు సరిగా పాతికరోజులు రా, అబ్బాయి!" అన్నది నా భార్య.

"పాపం ఎట్లా ప్రారంభమయింది?"

"నువ్వు వెళ్లిన తరవాత కమలం కాస్త జబ్బుపడ్డది. డాక్టరు వచ్చి చూసి విషజ్వరమన్నాడు. ఆరాత్రి మీ బాబాయికి జ్వరం ప్రారంభమయింది. శరీరం కాగిపోయింది. తెల్లవారేవరకూ మాకు తెలియకపోవలిసిందే! కాస్త జ్వరంవస్తే ఆయనకు వెర్రిమాటలు మాట్లాడటం అలవాటు. పైత్యశరీరం! ఆరాత్రల్లా కమలం జబ్బుసంగతి కలవరించారు. ఇక దానికి జ్వరం నయం కాదనేనా, దాన్ని నీకు వప్పగించలేమనేనా, జ్వరం దానికి నయమై తనకు రారాదా అనేనా, ఒకటికాదు! అది మొదలు నిన్నటివరకూ ఆయనకు వళ్లు తెలియదు. ఈ రెండుమూడురోజులనించీ పిచ్చిమాట లేమీ లేవు. అంతవరకూ ఆయన చేసిన గోలేనా! అంతా చెప్పటానికి ఒక్క రోజు చాలదు."

నేనంతా వింటూ మాట్లాడకుండా ఊరుకున్నాను.

"అయినా ఒకటడుగుతా! అంత వళ్లు తెలియని జ్వరంలో కూడా దాన్ని గురించి కలవరించేవాడివి నన్నెందుకొప్పుడాలి? బాబాయి! నీవంటివాణ్ణికాను నేను?" అన్నాడు బాబు నవ్వుతూ.

పిచ్చివాడు! నేను దానికోసం పడ్డ తపనంతా వాడికెట్లా అర్థమౌతుంది?

# ఆగంతుకి

జనమంచి రామేశ్వరరావుగారు

అమావాస్యగడచింది. నిశాకాంత చుక్కపువ్వుల నీలిదోవతికప్పుకుంది. ఆమె శిఖలో తురిమికున్న నెలవంక విదియనాటి అంధకారంలో తొడసూపింది. మెరపుసేపులో, నెలవంకనుపోలివున్న నానెచ్చెలిక్రిందిఅధరం, స్మృతికివచ్చింది. నెలవంక కాసేపులో మాసిపోయింది కాని నానెచ్చెలిపెదవివంక, అల్లాగే నిల్చింది నామనోదృష్టిలో!

* * * *

ఆరోజులుతల్చుకుంటే అబ్బా! ఒళ్లు జల్లుమంటుంది. కళ్ళనీటితళతళలో చూపుమసకవుతుంది. ఒకమోస్తరు వేదనాభారంతో శరీరం బరువెక్కుతుంది. అసలు బ్రతుకే శూన్యంగావుంది. దానిపై సఆదెబ్బ!-నెచ్చెలి మృత్యుగ్రస్తమవశం.-సమస్తజగతి జడమూ శూన్యమూ అనిపించింది. ఎంతోదట్టంగా పట్టింది, చీకటిముసురు, నన్ను. నల్లమందు చిదుపల్లాకొయ్యవచ్చును ఆఅంధకారాన్ని. అటువంటి కారు రాత్రిల్లో పుల్లచీమలు కుట్టినట్టయింది బ్రతుక్కి. హృదయంలో నొవ్వ తొడవగాపడ్డకష్టాలపుళ్ళన్నీ సలుపుపెట్టాయి. దానితోటి అదిబాధ ఆపుకోలేక చిందులు త్రొక్కింది.

* * * *

పరమేశ్వరుడు నాప్రేమనంతా అతనిలోనే నిక్షిప్తముచేశాడు. నా హృదయ మతన్నే కాని మరొకళ్ళనెరుగదు. అతను గతించాడు. రసప్లావితమైన ప్రేమ రాగాలుతీసింది. ఘనీభవించి రోదించింది. భోరుభోరున గొల్లెత్తింది. హృదయంలో సుగుసుల్లు త్రొక్కుతూ అశ్రుస్రవంతిక ప్రళయభీకరంగా పొంగిపొరలింది. ఆప్తులు, బంధువులూ వారి సాంత్వనభాషణములతో నావరదకట్టిపారుఫదికి, ఆనకట్ట వేయబోయినారు. "ఛట్!" అని చీకాకుపడ్డాను. వాళ్ళనుండి బైటబడ్డాను. ఒక్కవెలుగు రేకైనా తొంగిచూడని చీకటింటిలోకూర్చుని వెక్కసపుమూల్గులతో దుఃఖాన్ని దునిమి చెండాడాను. "ఛా! యిదేమిటి!" అనుకున్నాను. నాప్రేమ మృత్యుదేవత చేసిన అపచారమునకు ఎదురొడ్డాలి కాని దానికి లొంగిపోయి అశ్రుఅభిషేకాలతో ప్రణయార్ద్రగీతాలతో ప్రియునామం రుద్రాక్షుల త్రిప్పుచూ పూజించడం కూడదనిపించింది.

లేచాను. తలుపులు దభేలున చప్పుడు చేస్తూ బార్లాతీసేశాను.

* * * *

ఏముఖంచూచినా మృత్యుఆరాధన చేస్తున్నట్లే కనబడింది. చేతనాచేతనాభేదం అపరిగ్రాహ్యమయింది. అంతా సజీవమే! అంతా సమృత్యువే! క్షణక్షణమూ ఈవిశ్వమంతా ఆమహామృత్యుమూర్తి చెరగులోనికే యాత్రసాగిస్తూన్నట్టనిపించింది. ఏమిటి? నాప్రేమను లాక్కోవాలని యత్నించిన మృత్యువుకి నేను నాఅరుంతద వేదనామూల్య మణిహారం గళాంకితమివ్వాలా?

* * * *

మృత్యూ! నాహృదయమణిని మబ్బుల్లో దాచి మాయింపచేయ చూస్తావా? అది

తారలా తమస్వినీకుహారంలో కూడ మెరుస్తుందని తెలియదు కాబోలు! నీకు ధైర్యం లేదు. పట్టిపిరికిపందవి. రాత్రేరావాలీ? పగలు రాకూడదూ? నావెనకే పిల్లిఅడుగులు వేస్తూవచ్చి నేను కళ్ళుమూసుకొని నిద్రపోతున్నానో లేదో కనిపెట్టి అదను చూసుకుని నాప్రేమను హరింపచూస్తావూ? ఓహో! నీదెంతటి ధైర్యం! ఎంతటిసాహసం!

ఓమృత్యూ! నీకేధైర్యముంటే నాఎదుట పడు. నాప్రేమమూర్తిని ఎత్తుకపోవడానికి వచ్చానని చెప్పు!

అంతేకాని, నీకుకూడ ఎందుకీనైచ్య చౌర్యబుద్ధి? ప్రపంచంలో నీతిపరుల మనుకునే నీపూజకులైన ఈమానవోత్తములంతా పిత్రీల్లాంటి చోరీలకూ, టుంబ్రీల్లాంటి కూనీలకూ న్యాయస్థానాల స్థాపించి నేరాలమోపి తీర్పులు దిద్దడమెందుకు? నీవు చేస్తూండే ఈచీకటిదోపిడీలతో పోలిస్తే ఆనేరాలన్నీ ఎంతటివి!

* * * *

ఈలోకాన్నంతనూ నీచీకటిగూడులోనే పెట్టుకొని కూడ, నీవు కారురాత్రికోనలనే నీస్వైరవిహారం సాగించాలీ? కాస్తవెలుగు రేకలు విచ్చుతూన్నప్పుడు రావడానికి నీకెందు కంతిభయం? నీనల్లకళ్ళల్లోకి ప్రేమవెలుగులు చొరనివ్వవు కాబోలు?. అవును! మాప్రేమ కిరణాలు నీకళ్ళల్లోనికి ఒక్కసారి చొరనిచ్చావా వాటిలో పువ్వులేస్తాయి. అంత నువ్వు అంధురాలవై ఏమూలనో కూర్చోవాలి బకధ్యానంచేస్తూ. అప్పుడు యింక నీకన్నం పారదులే! మేమే నీయందు కనికరముంచి ఏదోయింత భుక్తికిపారెయ్యాలి.

* * * *

మృత్యూ! మృతకళేబరాలనే సుమీ నీవు చివరకు దొంగలాడేది! ఏదో గొప్పగా ప్రేమనూ ఆత్మలనూ హరిద్దామని వస్తావు, చివరకు జ్వాలాదందహ్యమానమైన మాంసము కలగూడు మనిషి ముఖానికి పూసుకొని పోతావు. ప్రేమ నీముఖానికి మసే పూస్తుందిలే. అంతే నీయెడచూపేగౌరవం! అదే నీకిచ్చే ఉపహారం!

* * * *

ఎందుకు మృత్యూ! ప్రేమను నీసంచిలో ఇముడ్చుకున్నాననుకొని మనిషిని కూడ మాయింపచేయ చూస్తావు? నీసంచిలో యిమిడేదికాదు సుమీప్రేమ. సంచిబరువు చూసుకొని అదంతా దోపిడీ చేసుకొని వచ్చిన ప్రేమబరువని కులుకుతున్నావూ? అదంతా మాబ్రతుకుబరువేసుమీ!

ఎంతో భీకరాట్టహాసంచేస్తూ అకాలంలో దోపిడీలు కొట్టి గులకరాళ్ళ నాసంచికెత్తుకొని మూపుకాయలుకాయ మోసుకొని వచ్చావు?

గులకరాళ్ళకోసం రాత్రికన్నాలెందుకు? ఎప్పుడుపడితే అప్పుడేవాటిని ఏరుకోవచ్చునే? నీకు అడ్డుతవిలే వారెవరుంటారు? ఎన్ని మోసుకపోతే నిన్నెవరేమంటారు?

* * * *

మృత్యూ! నామాట విని నీఓటమి ఒప్పుకో! భువి వేకువజామునుండీ ప్రతిరేయీ

సాగిస్తూన్న నీయాత్రలవల్ల ఏమిసాధించావు? మృత్తికతప్ప! యుగయుగాలనుండీ దోపిడీ చేసి సంపాదించిన పుర్రెలూ ఎముకలగుట్టలూ బూడిదపోగులూ నీగుహాలో చుట్టూ పెట్టుకొని మృత్యుఘోష సల్పుకుంటూ కూర్చో!

నీ కెదురుగా నే మానుజ్వలమూర్తులు అమృతగళాల నెత్తి వైతరిణీఝరీశ్రుతితో కలిపి ప్రేమోత్సాహగరిమతో నీనిష్ఫల చౌర్యానికి శిక్షగా మోహనగీతాలు పాడుతాయి. గానోర్మిలత్రిజగత్తులనూ తేల్చుతూ నృత్యకేళి సల్పుతూంటాయి.

* * * *

## కుక్కుటరోదనము

శ్రీమతి పట్టిసపు సీతమ్మగారు

రూపభేదంబెకాని వేరొంటుగావు
ప్రాణములు నీకు నాకు నన్యాయముగను
కలహామునుగూర్చి మాకు కత్తులనుగట్టి
చంపనుంకించె దిది పౌరుషంబె? శూద్ర!
ఇలనుదొరికినయట్టి గింజలనుదినుచుఁ
బొట్టఁబోషించుకొను మమ్ము బట్టఁబెట్టి
కపటివై పెంచుటది యిందుకా? రవంత
జాలియనుమాట నీకు లేదేల శూద్ర!
నావలన నీకు నెద్దియైనా యపకృతి
సుంతకలిగెడునా? అట్టిచో వధింప
తగుదు. నుపకారమే చేయుదాన. వేళ
చెప్పి లేపుచునున్న దానీను గాన?
ఈవు పాలమేగువేళ వీక్షించిరేయి
'కొక్కొరోకో'యటంచు మేల్కొల్పుచుందు
మొద్దునిద్దురలో మునిగిపోయియున్న
నిన్ను లేపుదు రెవరింక నన్నుచంప?
కటకటా! చాటునను చిట్టుగంపలోన
నోరులెరుఁగకుండ గ్రుడ్డుల నుంచుకొన్న
నెప్పుడో కన్నుమరపించి యెత్తువాని
తస్కరింతువు నీకేమి దాపరించె
కసుపునిండున కాలునిండెడున నాదు
చిన్నిగ్రుడ్లనుతినిన ఛీ! ఛీ! కిరాత.

నోరులేమి మావలె నేర్వ నేరగాని
గర్భశోకమిద్దరకు నొక్కటియెగాదె?
ఇంతమాత్ర మూహింప వదేమి నీకు
జ్ఞానమున్నట్టిఫలమిదేనా? కిరాత!
వత్సరాదిని సంక్రాంతిపండువులను
వేడుకయటంచు మాకు కల్పించి పోరు
నోడిపోయితివంచు నీవుడికియుడికి
రెండుకాళులబిగదన్ని రెపరెపమని
కొట్టుకొనుచుండ పీకను బట్టినులిమి
వట్టిబలవంతముగ చంపివైతు వకట!
పాతకమటంచు భయమేది? ఘాతుకుండ!
గ్రామదేవతజాతరలందుబట్టి
బలియనుచు నొకయేటున జెలువకరము
ప్రాణమెట్లొప్పునో చెప్ప రాదుగాని
మమ్ముజంప మీకోర్కె సంపన్నమగున?
నాడు పాణిని వ్యాకరణమ్ము చేయ
బూని మాదుకూతను మొట్టమొదటవినియే
దానినే హ్రస్వదీర్ఘప్లుతములటంచు
గ్రంథమున నిబద్ధముచేసె గాదె? యట్టి
మమ్ముచంపి తినెదు న్యాయమయ్యె నీకు?
"ఆత్మవత్సర్వభూతాని" యనుట వినవె?

# సత్ప్రవర్తనులకే శిక్ష

శ్రీమతి శిరుగూరి రత్నమ్మగారు

౧

విజేజాన్‌పురమందుగల డిస్ట్రిక్ట్ ఇంజనీయరగు శివసింహునియందు చాలమంచిగుణములుండెను. కాని అతనియొక్క న్యాయప్రవర్తనయే ఆయనకు ఒక్కొక్కసారి శత్రువగుచుండెను. శివసింహుడు శాంతిప్రియుడు. మిగుల ఓర్పుగలవాడు. ఆకారణములవలన మిగిలినకచేరీయందుగల ఉద్యోగస్థులకు అతడు శత్రువయ్యెను. అతనిశాంతగుణమే తనవశములోగల సేవకులనుగూడ సోమరులను భయములేనివారినిగా చేసెను.

ప్రాతఃకాలమున శివసింహుడు ఒకవంతెనను చూచుటకై వెడలదలంచెను. కాని గుర్రపుసైసు ఇంకను నిద్రనుండి లేవలేదు. రాత్రి శివసింహుడు వానితో అయిదుగంటలు కాకమునుపే బండితయారుగానుండమని ఎంతయొ చెప్పియుండెను. కాని ఎంతయొ ప్రొద్దెక్కినది. ఇంకను వాడులేవనేలేదు.

శివసింహుడు ఎంతయొసేపునిల్చుని సైసుకొరకువేచియుండి విసిగి ఒకకుర్చీలో కూర్చుండెను. చిట్టచివరకు ఎట్లో సైసు మేల్కొనెను. కాని నౌకరులింకనూ రాలేదు. ఒకనౌకరు టపాతీసుకొనుటకు వెళ్ళియుండెను. మార్గమధ్యమున ఒకదేవాలయమువద్ద ప్రసాదముకొరకు నిల్చునిపోయెను. ఇంకొకరు 'ఓవరుసీరియరు'ను పిలుచుటకు వెళ్ళిత్రోవలో గంజాయిపీల్చుచు కూర్చుండెను. ఎండఎక్కువగుచుండెను. అప్పుడు శివసింహుడు విసుగుకొనుచూ తనభార్యయగు రమాదేవిదగ్గరకువెడలి "రమా! ఎంతప్రొద్దెక్కినదో చూచితివా? ఇంతవరకూ ఒక్క పరిచారకుడును రాలేదు. నాకు ఈనవుకరులవలన ప్రాణము విసిగిపోవుచున్నది."

అతనిభార్యగోడపైపుజాదుచు "నీచులకు చనువొసంగిన ఏమగును?" అని అనెను.

శివసింహుడు మరింతకోపముతో "అట్లయిన ఏమిచేయుమందువు? వారిని వురిదీయుమందువా?"

౨

ఇంజనీయరువద్ద మోటారుగాని, ఫీటనుగానిలేవు. అతని కొకఎక్కాబండికలదు. దానితోనే అతడు తృప్తిచెందుచుండెను. పరిచారికాజనము ఎక్కాబండిని విమానమని చెప్పుచుందురు. ఊరిలోజనులందరు దానిని విమానమని చెప్పుటకంటె ఎద్దుబండిఅని చెప్పిన ఎంతయొ ఒప్పియుండునని అనుచుందురు. ఈమాదిరిగా శివసింహుడు తనవ్యవహారములన్నియు మితవ్యయముతోనే చేయుచుండువాడు. ఆయనకు ఇద్దరన్నదమ్ములు అలహాబాదులో చదువుకొనుచుండిరి. తల్లి కాశీనివాసముచేయుచుండెను. ఒకవితంతుసోదరినిగూడ శివసింహుడే పోషింపవలసివచ్చెను. ఈ పరివారముకాకుండ కొంతమంది బీదబాలురకుకూడ ఆయనఅన్నము పెట్టుచుండెను. ఈకారణములవలన శివసింహునివద్ద నెలాఖరగుసరికి ఒకరాగిపైసాఅయిననూ వుండునదికాదు. ఆయనబట్టలు చాలవిలువ తక్కువగలవే! కాని ఆయన ఎన్నికష్టములు పడుచున్ననూ లాభమును దగ్గరకురానిచ్చువాడు కాదు. తనస్నేహితులందరు ఆయనను ఒకదేవతగా భావించుచుందురు.

శివసింహునియొక్క ఈసత్ప్రవర్తన అతనికేమియు హానికలిగించకున్నను అతనిక్రిందివారికిమిగుల హానికారకమైయుండెను. చివరకు రమాదేవికూడ అప్పుడప్పుడుఅతనిపై విసుగుకొనుచుండెడిది.

ఒకనాటిసాయంకాలమున శివసింహుడు ఆఫీసునుండి ఇంటికివచ్చెను. రమాదేవియాతనితో "లోకమంతయూ మీసత్ప్రవర్తనను నిందించుచుండెను. మీకు దీనివలననేమిప్రయోజనము?" అనెను.

శివ:— ప్రపంచమంతయూ నెట్లనుకొనినను సరియే! పైనభగవంతుడు చూచుచున్నాడు.

రమా:— నేను మీతో వాదించుటకు చెప్పుచుండుటలేదు. మీ ఈసత్ప్రవర్తన తక్కినవారలకు ఎట్లు కష్టదాయి అగుచున్నదో మీరొకసారి యోచించిచూడుడు. మీకు చేతినిండుగ జీతముదొరకుచున్నది. మీరు

కొండప వారిని చేయిచాచి అడుగనక్కరలేదు. కాని స్వల్పవేతనములపొందు గుమస్తాలు, సేవకులు తమజీవనములెట్లు గడపుకొనగలరు? వారలకుగూడా పిల్లలుగలరు. వార లెట్లువివాహాదికము లొనర్పగలరు? ఇప్పుడే రామదీనునియొక్క భార్యవచ్చి ఏడ్చిఏడ్చివెళ్ళినది. పిల్ల పెద్దదైనదట. పెండ్లిచేయవలయును. బ్రాహ్మణజాతి. అనేకమగుఖర్చులు. పాపము. వాళ్ళెక్కడనుండి తెచ్చిపెట్టగలరు? ఆమెఏడ్చినఏడ్పు ఎవరికితగులును?

శివ:—ఇదియంతయు నిజమే! కాని లంచములు పుచ్చుకొనుట శివసింహునికి చాల అనంగీకారముగు పని. నీవు చెప్పినదియు నిజమే! కాని నేనేమిచేయగలను? నావశములో ఏమున్నది? నానియమములను ఎట్లు ఉల్లంఘింపగలను? వారి జీతములు ఎక్కువచేయుట నావశములో ఉన్నట్లయిన తప్పక ఎక్కువచేసియుందును. కాని నేను దోపిడిచేసి వారలచేగూడ దోపిడిచేయించనా?

రమాదేవి వ్యంగపూర్వకముగా "అయితే ఈఉసురు ఎవరిమీదవచ్చి పడుతుంది?" అన్నది.

శివసింహుడు ఒకనిట్టూర్పువిడచి "ఎవరైతే ఆదాయముకంటె వ్యయము ఎక్కువగాచేయుచున్నారో వారలమీదనే పడుచున్నది. బీదవారలయియుండియు ఏలపెద్ద పెద్దకుటుంబములవారితో వివాహాది సంబంధము లొనరింపుచుండవలెను? నాకైనుయొక్క భార్య మెడయందు వెండితో నింపుకొనవలెనని కోరిన అది ఎవరిది తప్పు? ఈ అనవసరవ్యయములకన్నిటికి నేనా ఉత్తరదాతను?

3

పూవులతోటకు తేనెటీగలకు ఎంతసంబంధమున్నదో అంతసంబంధము ఇంజనీయరుకును కంట్రాక్టుదారులకుగలదు. పూవులనుండి తేనెనుఈగలు ఎట్లునిరాటంకముగా గ్రహింపగలవో అట్లే ఇంజనీయరులును గ్రహింపగలరు. ఈమధురసమును కమీషనని చెప్పుదురు. లంచమునకు, కమీషనుకు చాలా భేదమున్నది. లంచము ఇహలోకపరలోకములకు సర్వనాశనము చేయును. లంచముతీసికొనినవారిని దొంగలనియు, చెడ్డపేరు గలవారనియు చెప్పుదురు. కాని కమీషను మనోహరమైన ఉద్యానవనమువంటిది. అచట మనుష్యులయొక్క గాని భగవంతునియొక్క కాని భయములేదు. కమీషనువైపు చెడ్డపేరు కండ్లెత్తిఅయిన చూడజాలదు. ఇట్లయి నప్పటికి శివసింహుడు తనయొక్క ఉజ్వలమైన చరిత్రను ఈకళంకమునుండి దూరముగానుంచెను.

మార్చినెల గడచుచుండెను. చీఫ్ఇంజనీయరుజిల్లాలో తనిఖీచేయుటకు వచ్చుచుండెను. కాని ఇంకను కొన్నిభవనములు తయారుకాలేదు. రోడ్లన్నియుపాడైయుండెను. కంట్రాక్టుదారులు పనిని ప్రారంభింపనే లేదు. శివసింహుడు ప్రతిరోజు కంట్రాక్టుదారులకు కఠినముగా ఆజ్ఞాపించుచుండెను. కాని ఫలమేమియు అగుపడకుండెను.

ఒకరోజున శివసింహుడందరిని పిలిపించి ఇట్లుచెప్పెను: "నేను ఈజిల్లానుండి చెడ్డపేరుసంపాదించి వెళ్ళవలెననిమీరందరూ కోరుచున్నారా? నేను మీఎడల ఎవ్వరియందునను చెడ్డగాప్రవర్తించలేదే! నేనే మీకు నష్టముకలిగించవలెననికోరిన మీకు కంట్రాక్టుకుఇవ్వక నేనే స్వయముగ కూలీలనుపెట్టి చేయించుకొనగలను. కాని మీకు నష్టముకలిగించవలెనని నాకోరిక కాదు. సరియే! మంచిది. మీకు నష్టము కలిగించనందుకు నాకేశిక్ష కలుగుచున్నది."

కంట్రాక్టుదారులందరు ఏమియుజబాబియ్యక తలలువంచుకొని నిల్చుండి కొంచెముసేపటికి సెలవుదీసికొనిపోయిరి. మార్గములో వారిట్లు మాట్లాడుకొనసాగిరి.

గోపాలదాసు—ఇప్పుడు సంగతంత బోధపడుతుంది.

షహాబాజఖాన్—ఏదో ఒకప్రకారంగా ఈయన ఇచ్చటనుండి పోవలయును.

చున్నీలాలు—నాకు చీఫ్ ఇంజనీయరుగారితో చాలస్నేహము. నేను వారిదగ్గర పనిచేసితిని. వారు ఆయనను ఇప్పుడు బాగాచివాట్లుపెట్టగలరు.

ఇంతలో ముసలివాడగు హరిదాసు ఇట్లుచెప్పెను: "మిత్రులారా! స్వార్థమునంగతి యట్లుంచుడు. శివసింహుడు దేవతకాని మనుష్యుడుకాడు. అతను దేవతయేకానియెడల సంవత్సరమునకు పదివేలరూపాయిల కమీషను వదులుకొనునా? ఇన్నిరూపాయిలను చిల్లపెంకులవలె తుచ్ఛమని తలచుట సహజమగుసంగతియా? ఇక మనమా! ఒకగ్రుడ్డిగవ్వకొఱకు మనసమ్మకం అమ్ముకొనుచున్నాము. ఈసజ్జనుడు మనదగ్గరనుండి ఒక చిల్లిగవ్వఅయిన కోరుటలేదు. ఎన్నికష్టములువచ్చి నప్పటికి తననీతిపథమునుండి విచలితుడుకాలేదు. అతనితో మనము నీచముగాను, కుటిలముగాను ప్రవర్తించుచున్నాము."

వహీబాజ్—ఈతనొకగొప్పదేవదూతయని చెప్పుటకు ఏమియు సర్వ్యంతరములేదు.

చున్నీలాలు—నీవు చెప్పినది సరియే! కాని ఏమిచేయగలము? సత్ప్రవర్తనవలన పనిలేదు. ఈప్రపంచము కపటము, మోసము వీనితో నిండియున్నది.

గోపాలదాస్—అతను అట్లున్యాయముగా ప్రవర్తించవలెనని కోరితే ఉద్యోగమెందుకు చేయవలెను? తమయొక్క ప్రవర్తనను న్యాయముగా ఉంచుకొనవలెనని ఎవరికి తెలియదు? తను అట్లున్నయెడల రెండవ వారికి ఎంతఇబ్బంది కలుగునో ఆలోచించవద్దా? ఎవడైతే తాను తినుచు, ఒకరికి పెట్టునో అటువంటి వాడే మనకుకావలెను. ఎవడైతే ఒకరూపాయిఅయినా కమీషను తీసికొంటాడో వాడే తక్కినవారికికూడా సదుపాయముచేసినవాడు. ఈమహాశయునివద్ద అటువంటిది ఏమిటిఉన్నది? మీఇష్టమువచ్చినట్లు మీరు చేయుడు. నేను మాత్ర మతనిదగ్గర నిర్వహించలేను.

వహీబాజ్—మంచివాడుగను, నిర్మలమైన మనస్సుగలవాడుగను ఉండుట మంచిదే! కాని అమంచితనము రెండవవారి ప్రాణములుతీయుటా?

ప్రతివారును వృద్ధహరిదాసుమాటలయందు నిరాదరమును, గోపాలదాసునియందు ఆదరమునుచూపిరి. నిర్మలమైన ఆత్మకలవారియందు నిజముయొక్క ప్రకాశము మిణుగురుపురుగువంటిది.

## ४

శివసింహునికి ఒకకుమార్తెకలదు. ఆమెయొక్క వివాహము ఒకవకీలుకుమారునితో నిశ్చయమయ్యెను. పిల్లవాడు చాలబుద్ధిమంతుడు. మంచిసంప్రదాయమైన కుటుంబమునకు చెందినవాడు. శివసింహుడు చాలతోజులక్రిందటనే ఎంతయో కష్టముమీద వివాహము నిశ్చయముచేసెను. కేవలము వరదక్షిణయే ఇంకను నిశ్చయముకాలేదు. మొదట వకీలు జిల్లాఇంజనీయరుగారితో వరదక్షిణగురించి నిశ్చయము చేసుకోవడము వృథాఅని అనుకొనెను. కాని క్రమముగా ఇంజనీయరుగారి సంసారస్థితి తెలసెను: అప్పుడతను శివసింహునితో వరదక్షిణ నిశ్చయము చేసుకొనవలయునని తలంచి వరశుల్కమునుగురించి ఇంజనీయరుకు జాబువ్రాసెను. దానిని చూడగనే శివసింహుడు ఒక పెద్దనిట్టూర్పువిడిచెను. అతనియొక్క ఆశలన్నియు మట్టితోకలసిపోయెను. వికలుడై గదియందిట్టట్లు పచారుచేయసాగెను. తరువాత కొంచెమునేపటికి లేచి ఆఉత్తరము చేతితోపట్టుకొని వెళ్ళి రమాదేవికి చూపించవలంచెను. కాని అచట ఆమె సహానుభూతి చూపించదుకదాయని అనుకొనెను.

శివసింహుడు స్వాభావికముగా మిక్కిలి దయకలవాడు. కోమలహృదయులు ఆపదలయందు స్థిరముగా నుండజాలరు. అతను విచారముతో నిండినమనస్సుతో ఒకకుర్చీలోకూలబడి ఇట్లాఆలోచించుకొనసాగెను. "నేను ఎటువంటి పాపముచేసితిని? నాకిట్టిఫలము ఏలకలుగుచున్నది? ఎన్నియోసంవత్సరములు పరిశ్రమచేసి

చేసినిశ్చయించిన వివాహము ఒక్కక్షణములో భగ్నమయ్యెను. వారడిగిన కట్నమిచ్చుటకు నాకు వశము కాదు. నేను దాని నొసంగజాలను. నాలుగువైపులను అంధకారముగానున్నది. ఎవరును నాకు సాయము చేయువారు లేరు." శివసింహుని కండ్లు జలపూరితములయ్యెను.

ఎదుట బల్లమీద కంట్రాక్టుదారులయొక్క బిల్లులుండెను. అవి ఎన్నియో వారములనుండి అట్లేపడియుండెను. శివసింహుడు వానిని విప్పిఅయినను చూడలేదు. నేడు ఈచింత, నిరాశ అవస్థలో అతను వానిని సతృష్ణనయనములతో చూడసాగెను.

"కొంచెము పరిశ్రమచేసిన ఈకష్టములన్నియు దూరమైపోవును. నవుకరులు, గుమాస్తాలు నాయొక్క సమ్మతిపై ఆధారపడి సమస్తమొనరించెదరు. నేను పెదవికదప నక్కరలేదు. నేను లజ్జింప నక్కరలేదు." అంత వాతడు బిల్లులనెత్తి ఎంత ఆదాయమైనదో కూడసాగెను. కాని వెంటనే వాని ఆత్మ వానిని మేల్కొల్పెను. "అయ్యో! నేనెట్టి భ్రమలోపడితిని. నాజన్మమంతయు గడించిన ఈనిర్లోభమును కేవలము కొంచెము ధనముకొరకు అర్పించెదనా? నేను నాసహచరులఎదుట గర్వముతో తలయెత్తి తిరుగుచుంటినే! చలనహీనులకటాసీనులకు నాసోదరులు ఎందుకల్లనైతే నన్ను కన్నెత్తి చూడజాలరో, ఆ నేను నాగౌరవమును, మాన్యతను నాసంపూర్ణ ఆత్మికసంపత్తిని పది,అయిదువేల రూపాయిలకొరకు అర్పింతునా? అట్లెన్నటికిని కాజాలదు. ఛీ! ఛీ!! అటువంటిది మనమున యోచించుట గూడ మిగులపాపము.

శివసింహు డాబిల్లులనెత్తి బల్లక్రింద బడవైచి కాలితో త్రొక్కెను. అప్పుడు విజయముపొందిన శివునివలె లోపలకు వెడలెను.

౫

పెద్దఇంజనీయరు సరియగు సమయమునకు షవేషజాన్ పురమునకు వచ్చెను. అతనితో గూడా శివసింహుని దౌర్భాగ్యముకూడా వచ్చినట్లయ్యెను. జిల్లాలోపని అంతయూ సగముసగముగా నుండిపోయెను. ఒక సేవకుని దొర "ఏమి పనిఅంతా ఇట్లున్నది?" అని అడిగెను.

"హుజూర్! ఏమనిచెప్పను? పని ఎట్లు పూర్తికాగలదు? ఇంజనీయరుగారు కంట్రాక్టుదారులనన్నాల కష్టపెట్టుచున్నారు. పెద్దగుమస్తా ఆఫీసులెక్కలు తప్పులు తప్పులుగా నుండుట చూచినాడు. ఆయన సరిగా పని చూచుటలేదు." అని అతడు చెప్పెను.

ఇంతలో జిల్లాలోని కంట్రాక్టుదారులు ఒక విలువగల పూలసజ్జను దెచ్చి పెద్దఇంజనీయరుకు బహుమతి చేసి ఇట్లుచెప్పిరి: "హుజూర్! మీరు గుండువేశి చంపినను సరియే! కాని శివసింహుని అన్యాయము సహింపజాలకున్నాము. చెప్పడంమట్టుకు కమీషను పుచ్చుకొననని అందురు. కాని మాప్రాణములు తీయుచున్నారు." దొర తన తవఖాపుస్తకములో ఇట్లువ్రాసెను. "శివసింహుడు చాలా సత్యమైకమైనమనిషి. అతని యొక్క చరిత్రకూడ ఉజ్వలమైనదే! కాని అతను ఇంతగొప్పజిల్లాలో పనిచేయుటకు అసమర్థుడు."

దానియొక్క ఫలమేమైనదంటే అతను అచటనుండి చిన్నిజిల్లాకు మార్చబడెను. అతనియొక్క పదోదాకూడా తగ్గింపబడెను.

శివసింహుని యొక్క స్నేహితులు ఒక గొప్పవిందుఉత్సవము చేసిరి. ఆఉత్సవమందు శివసింహుని యొక్క ధర్మనిష్ఠనుగురించి చాలా ప్రశంసించిరి. సభాపతి కన్నీళ్ళతో ఇట్లు చెప్పెను. "శివసింహుని వియోగదుఃఖము మనలను ఎల్లప్పుడు వేధించును. ఈచింతమానదు. ఈగాయము ఎప్పటికీ మానదు."

ప్రయాణం నిశ్చయమయ్యెను. ఉత్సవమునుండి ఇంటికిరాగానే వానియొక్క ముఖము మలినముగా నుండుట రమాదేవి చూచెను. ఆమె అతనితో మాటిమాటికి "పెద్దఇంజనీయరుకు ఏమైనబహుమతీఇయ్యకుం

అతని 'బట్లరు'కు ఏమైనా ఇనాముఇండు. హెడ్డుక్లార్కుకు విందొసంగుడు." అని చెప్పుచుండెను. కాని శివసింహుడు ఒకటిగూడ వినుపించుకొనలేదు.

ఎప్పుడైతే రమాదేవి ఇతనియొక్క హోదాతగ్గుటయూ బదిలీయూ వినెనో అప్పుడామె భర్త కెంతయో బోధించెను. కాని ఈసమయమందు కూడ శివసింహు డుదాసీనుడుగా నుండుటచూచి ఆమె ఇక సహింపలేకపోయెను. అతనిని ఇట్లుఅడిగెను. "ఏమిఅట్లు ఉదాసీనులుగా నుంటిరి?"

"ఏమి చెయ్యమంటివి? నవ్వమంటివా?"

"ఆ! నవ్వక ఇంకేమి చేయుదురు? ఎవరైతే గుడ్డిగవ్వకొరకు ఆత్మభ్రష్టత్వము చేశిరో, ఎవరురూపాయిలకొరకు తమ ధర్మమును నష్టపరచిరో వారికి ఇట్టి నష్టము కలిగిన వారేడ్వవలయును. ఇది చెడుప్రవర్తనకు శిక్షకాదు. సత్ప్రవర్తనకే శిక్ష! దీనిని ఆనందముతోనే యనుభవింపవలయును."

ఇట్లుచెప్పి రమాదేవి తనభర్తవైపు చూచెను. వాని నేత్రములలో నిజమగు అనురాగము కనిపించెను. శివసింహుడు అనురాగపూరితహృదయముతో రమాదేవిని ఆలింగనమొనర్చుకొని "ప్రియా! రమా! నాకు నీయొక్క ఈయొక్క సాహానుభూతియే కావలెను. నేనీదండనను సంతోషముగా ననుభవించెదను." అనెను.

(అనువాదము)

## భాగ్యరేఖ

సీరిపి ఆంజనేయులు గారు

నియతిమెయిఁ బదునాఱువన్నియలు గడవఁ దూయుమానానఁ గ్రొంగ్రొత్తయాపదలును
బుటముపయిఁ బెక్కుపుటములుపొదలు గొలిపి నాపదలలో నమేయంపుటామయములు
రాపుకులమేల్మెఱుంగు దుఱంగలింపఁ
గనకముఁ గరంచు లోహకారుని తెఱంగు,
తొల్త లేవడిమున్నిటఁ దోఁగఁ జేసి,
కడిఁది దైన్యాగ్నిఁ బయిఁబయిఁ గ్రాఁచికాఁచి
వెలయు, ననిశంబునలయించి వెతల నొంచి,
జనక! నీదయాగరిమాతిశయము, నాకు
బోధసేయుచునుంటి వపూర్వఘణితి;
నేమి నాభాగ్యరేఖయో! యెఱుఁగరాదు.

## అశ్రువులు

కస్తూరి రాజామాణిక్యము గారు, [సారస్వతసమాజము]

ఇది తమోనీలయామిని;—ఈతమస్సు
తెలుపడకెడి చలిగాలితఱగలందు;
కలతవెలుగులలో తారకలులయించు;
ప్రాముకొన్నది గంభీరమధురశాంతి
అక్కటకట!
ఊరకే జలధారల హోరుమనుచు
ఏడ్చి, యేడిచి, అలసిపోయినది బ్రతుకు—
శ్రావణవినీల జలధరస్వామివోలె.
కడచిపోయినరోజులు కదపి, కదపి,
కష్టగాథల నంతస్సు కలచి, కలచి,
స్మృతిపథమ్మున ఆఱనిచిచ్చులుమిసి,
ఇదియెదోకాని, లోన దహించుకొనును;
భగ్నహృదయుని నిఱుపేదబ్రతుకులోన
ఈమహాబాధ నిదురలేచినది నేడు—
కలవరములేని యీనిశాగర్భమందు
అలసినిద్రిలి యెచటనో అణగియున్న
హృదయదుఃఖాల నెవరోయి రేపినారు?—

# విశ్వప్రణయము

రచయిత్రి

శ్రీమతి సి. లక్ష్మీ గారు

అది అర్ధరాత్రి. నిండు పున్నమ వెన్నెల. ఆకాశమునిండా చుక్కలు. జాబిల్లి కలకల నవ్వుతున్నాడు.

క్రింద కలువకన్నెకూడా వికసించి నవ్వుతున్నాది. మందమారుతముతో సుగంధపరిమళాన్ని కలిపి, విశ్వరాగాలతో పాడుతూ, నిశ్చలప్రేమను వెదజల్లుతూఉంది.

చంద్రుడు ఆనందమయుడై పోయాడు. సప్తమస్వర్గసుఖం అనుభవించాడు. సంతోషం కలశపూర్ణమయిపోయింది. గట్టుతెగింది. కనుగొనల నుండి ఆనందబాష్పాలుజారాయి.

కలువ ధన్యురాలైంది. నిశ్చల, స్వచ్ఛ, నిర్మలప్రేమకు పారితోషికంగలిగింది. ఈమె జీవితమం దొకజ్యోతి ప్రకాశించింది.

ఆజ్యోతి పవిత్రమయి. అమలప్రణయసవనపు హవిర్భాగము. ఆనందసరోవరాంతరతామర. నితాంతసౌఖ్యనిలయిని.

అట్టిజ్యోతిలో కలువ లీనమయింది. మరెందును గానరాలేదు. ఆపవిత్రదేహ మీపాపభువి వసించునా?

జ్యోతి చంద్రునిజేరినది. కలువ జాబిల్లిగర్భమున నిమిడినది. అందుకే ఆనలుపుమచ్చ.

# ఆధునికాంధ్రనారీవికసనహేతువులు

మాగంటి బాపినీడుగారు, బి. యస్., యం. యస్. సి.

## వీరేశలింగము

ఆంధ్రుల ఆధునికచరిత్ర వ్రాయవలసివచ్చినపుడు, ప్రథమతాంబూలం వీరేశలింగంగారికే ముట్టును. ఆంధ్రాభివృద్ధికి దోడ్పడినవారి స్మారకచిహ్నము ఆంధ్రరాష్ట్రమేర్పడగానే ఆలోచించినపుడు వీరేశలింగం సువర్ణవిగ్రహము ఆంధ్రరాజధానియొక్క ముఖ్యపట్టణమునందు నెలకొల్పబడును. కారణము ఆయన యుగపురుషుడు. ఆంధ్రప్రాక్తనవైభవము, ప్రస్తుతప్రతిభ ఈమహనీయునియందు మూర్తీభవించినవి. 20-వ శతాబ్దచరిత్రను 19-వ శతాబ్దమునుంచి, పునాదువేసి గోడకట్టి ఇప్పటిమహాసౌధము నిర్మించి మనకప్పగించి తనయుగపురుషనిర్మాణబాధ్యత నిర్వహించి అస్తమించెను. స్త్రీస్వాతంత్ర్యమునకు, హక్కులకు, స్త్రీవిద్యకు, దీనవితంతువుల రక్షణకు, సంఘసంస్కరణమునకు, స్త్రీవికాసమునకు తన తనువును, ధనమును అర్పించెను. తన సతి రాజ్యలక్ష్మమ్మను సోదరీమణులసేవకై తరిఫీదుచేసి తాను నిర్మించినపురమందిరసమీపమున రాజమహేంద్రవరమున రాజ్యలక్ష్మివిలాససభ నెలకొల్పి స్త్రీలకు సభపెట్టించెను. నెమ్మదిగా స్త్రీలలో ప్రబోధముగల్గెను. ఆత్మవిశ్వాసము, హక్కులజ్ఞానముగల్గి దేశమునందు స్త్రీసమాజములను, స్త్రీలసభలను, స్వాతంత్ర్యాభిలాష వెలిబుచ్చుటకు గావలసిన ధైర్యమునకుతగిన వాతావరణమేర్పడెను. కాలేజీలో పండితుడుగుటచే సంస్కారణాభిమానులగు ఉత్సాహశిష్యకోటిని సంపాదించెను. గురువుగారికి సర్వవిధముల సహాయముచేయుటయేగాక తమ స్వగృహములందు యౌవనభార్యలకు, అక్కచెల్లెండ్రకు తగిన ప్రోత్సాహమిచ్చి స్త్రీజనోద్ధారణకు బాగుగదోడ్పడిరి. ఈయుగపురుషుని సేవాప్రచారము తెలిసికొనగోరువారు వారి స్వీయచరిత్రను, సంపుటములను చదువవలయును.

## బండారు అచ్చమాంబ

అబలాసచ్చరిత్రమాల. ముప్పదియేండ్లక్రిందట స్త్రీలు వ్రాసిన గ్రంథములసంఖ్య బహుకొద్ది. స్త్రీల చరిత్రలుగాని స్త్రీలకుత్సాహముగల్గించి ప్రబోధము పుట్టించునవిగాని అసలేలేకుండెను. ప్రసిద్ధాంధ్రుడగు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారిసోదరి విదుషి శ్రీమతి బండారు అచ్చమాంబగారు 1901 సం॥ సుప్రసిద్ధగ్రంథరాజమగు అబలాసచ్చరిత్రరత్నమాలను ఆంధ్రనారీమణుల హస్తములందుపెట్టి స్త్రీలోకమునకు మహోపకారమొనర్చెను. ఆదర్శస్త్రీరత్నముల పవిత్రజీవితచరిత్రపఠనము ప్రజలలో నూతనఉద్బోధన నుద్భవింపజేసి ఉత్తమమానసికపరివర్తనమునకు ప్రథమకారణమయ్యెను. స్త్రీలలో నూతనోత్సాహముపుట్టి సంచలనము, సంచారముచేసి ఆత్మవిశ్వాసమునకు దోడ్పడెను. 1901 సం॥ మచిలీపట్టణమునకు వచ్చి స్త్రీలసభచేసి ఆపేరున స్త్రీసమాజము స్థాపించెను.

## స్త్రీసమాజములు-గ్రంథములు-పత్రికలు

ప్రతిపట్టణమునందును స్త్రీసభలు, స్త్రీసమాజములు బయలుదేరెను. గుంటూరులో స్త్రీసనాతనధర్మమండలి, ఏలూరులో స్త్రీప్రార్థనాసమాజము, రాజమహేంద్రవరము కాకినాడ బెజవాడలలో స్త్రీసమాజములు నెలకొల్పబడెను. స్త్రీలలో సులభశైలిని గ్రంథములు వ్రాయువారు, సభలలో ధారాళముగ నుపన్యసించగల స్త్రీలు అనేకమంది బయలుదేరిరి. ఆంధ్రస్త్రీలు వ్రాసిన గ్రంథములపట్టిక నొకపరిచూచిన 1900 సం॥ పిమ్మట స్త్రీలలో నెట్టికవితిలకలు, పద్యములల్లగల పండితురాండ్రు, స్వాతంత్ర్యాగ్నిరగుల్పగల వీరాంగనలు బయలుదేరిరో తెలియగలదు. కోటికలపూడి సీతమ్మగారు 1903-లో వ్రాసిన యుపన్యాసమాలిక ఉన్నతస్త్రీవిద్య మొదలుగాగల గ్రంథములు వారి

సంఘసేవ తనసోదరీమణుల యభివృద్ధికి దోడ్పడెను. స్త్రీలకు ప్రత్యేకపత్రికావసర మేర్పడెను. సత్తిరాజు సీతారామయ్యగారి 'హిందూసుందరి'; పులుగుర్తలక్ష్మీనరసమ్మగారి 'సావిత్రి' ఆకాలమందు వారియభ్యుదయమునకు మిక్కిలి దోడ్పడెను. హిందూసుందరిలో సత్తిరాజు సీతారామయ్యగారి విశేషశ్రమకోర్చి స్త్రీల నానేకుల వ్యాసములు వ్రాయుటకు ప్రోత్సాహపరచి, ఆంధ్రనారీమణుల కృతజ్ఞతకు బాత్రుడయ్యెను. కొంతకాలము పిమ్మట మొసలికంటి రామాబాయమ్మగారు సంపాదకత్వమువహించిరి. ఇప్పు డిది కాకినాడలో విద్యార్థినీసమాజపక్షమున వెలువడుచున్నది. సావిత్రియను పత్రిక నొకదానిని పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు స్థాపించి తమ సహజసామర్థ్యముతోను, పట్టుదలతోను స్త్రీసత్వములకు బోరాడి స్త్రీగౌరవము గాపాడెను. "జనానా మేగజీన్" అను మరియొకపత్రికను ఓరుగంటి కమలమ్మగారు సంపాదకత్వమువహించినడపిరి. స్త్రీల యభివృద్ధికి దోడ్పడిన వారలలో కొటికలపూడి సీతమ్మగారు, బాలాంత్రపు శేషమ్మగారు, మొసలికంటి రామాయమ్మగారు, పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు, మోటపల్లి రాజాబాయమ్మగారు, గుండు అచ్చమాంబగారు, కందుకూరి రాజ్యలక్ష్మమ్మగారు ముఖ్యులు

### శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు

ఉన్నత ఆదర్శములచే విద్యార్థులనాకర్షించి స్త్రీలకంటికన్నీరొలికిన సిరియుంటనుండదను సిద్ధాంతసత్యమును యౌవనహృదయములందు నాటి అనాధబాలికలకాశ్రయమిచ్చి సంఘసంస్కారము వ్యాపింపజేసి ఆంధ్రనారీపికసమాజమునకు దోడ్పడెను.

### బ్రహ్మసమాజము

ఆంధ్రదేశమున బ్రహ్మసమాజప్రభావము ఆంధ్రాభ్యుదయమునకు మిక్కిలిదోడ్పడెను. యుగపురుషుడు వీరేశలింగము, నాయుడుగార్లును మొదలగు ఆంధ్రదేశ మండలి సుప్రసిద్ధసంస్కర్తలందరు బ్రహ్మసమాజిక సిద్ధాంతములలో పెరిగినవారే. దేశరాజు పెదబాపయ్య, ముట్నూరి కృష్ణారావు, పల్లారి సూర్యనారాయణ, కాశీశ్వరరావు, పున్నవ లక్ష్మీనారాయణ, పట్టాభి సీతారామయ్య మున్నగువార్లందరు ఆవాతావరణమున దగుల్కొనినవారే. బిపినచంద్రపాలుగారు బ్రహ్మసమాజప్రచారకుడుగా మొదట మన రాజధానికివచ్చి ప్రబోధము బుట్టించెను. కలకత్తా సాధారణసమాజపక్షమున ప్రతిసంవత్సరము బాబూ హేమచంద్రసర్కారుగారువచ్చి ఆంధ్రదేశమండలి ప్రతిముఖ్యపట్టణములందు సభలుజేసి సంస్కారణములో బాటు స్త్రీవిద్యకు దోడ్పడెను, నూతనవాతావరణము సృష్టించెను. బ్రాహ్మమతప్రచారకులగు కామరాజు హనుమంతరావు, పాలపర్తి నరసింహంగార్లు వితంతువివాహము చేసికొనుటయేగాక తమ సతులకు, పుత్రికలకు ఉన్నతవిద్యనీయగల్గిరి. ఆంధ్రదేశమందు స్త్రీల కున్నతవిద్యకు పాఠశాలలు కనపడనపుడు, వసతిగృహములు లేనపుడు సర్కారుగారి ప్రోత్సాహముచే కాకర్ల శకుంతలాదేవిగారు, మాగంటి అన్నపూర్ణ దేవిగారు కలకత్తాఉన్నతవిద్యకై వెళ్ళిరి. ఇప్పుడు శకుంతలాదేవిగారు యం.ఎ పరీక్షనిచ్చి పరిశోధనము చేయుచున్నది. ప్రార్థనసమాజములతో బాటు స్త్రీప్రార్థనాసమాజములు స్థాపింపబడి నారీసేవకు ప్రయత్నముసాగెను. వితంతుశరణాలయము (హితకారిణీసమాజ (బ్రహ్మసమాజాభిమానులు) వారిచే నడుపబడుచున్నది. ఆర్యసమాజమంత ఆంధ్రదేశమునకు పట్టుబడకపోయినను సంస్కర్తలగు ఆదిపూడి సోమనాథరావుగారు స్త్రీజనాభ్యుదయమునకు దోడ్పడిరి.

### క్రైస్తవమతము

క్రైస్తవమతప్రభావము మనకు లేకపోలేదు. వారి మతవ్యాప్తిలో వారలెత్తి మనసంఘదురాచారమును ఖండించుటవలన మనము తప్పులదిద్దుకొనుట కవకాశ మేర్పడినది. స్త్రీపాఠశాలలు పెట్టియు, జనానా గృహములకు మిషనువారు ప్రచారికలను బంపియు వార్తాప్రచారము కొంతవరకుగావించిరి. ఆంధ్రదేశ

మున స్త్రీలలో ఉన్నతవిద్య బొందినవారు పెద్దపరీక్షలనిచ్చినవారు సర్వనాధనమ్మ, మల్లాది వేంకటరత్నంగారి పుత్రికలు యం.ఏలు. కైస్తవనారీమణులకే; హిందూయువతియను మాసపత్రిక స్త్రీలచే స్థాపింపబడెను. దానికి శ్రీమతి శ్రీనివాసమ్మ బి. ఎ. గారు సంపాదకత్వమువహించి నడపుచుండెడివారు. ఘోషా చికిత్సాలయములు వచ్చినపుడు ఆదొరసానులు, నర్సులు, పంతులమ్మ సహవాసములవల్ల పూర్వాచారపరాయణతదగ్గి స్త్రీలు యుందారులును విద్యార్థినులునుఅగుట తటస్థించెను. ముఖ్యముగా గుంటూరునందలి కుగ్లరుఆసుపత్రి ఈవిధముగా ఎక్కువ తోడ్పడెను. ఈవాతావరణప్రభావమువల్ల మారిన కుటుంబము లెన్నియోగలవు.

### గాంధీ

ఇట్లు వీరేశలింగముచే స్త్రీజనాభ్యుదయమునకు విత్తనములు నాటబడి స్త్రీసంఘముల స్త్రీలపత్రికలలో నీరుపోయబడి బ్రహ్మసమాజముచే పోషింపబడెను. క్రైస్తవమతముచే కలుపుతీయబడి పురుగులు ముట్టకుండ కాపాడబడి గాంధీమహాత్మునిచే ఫలింపచేయబడెను. ఈలోకోత్తరపురుషుని మహిమచే సకల భారతదేశ మొక్కసారి కదలించబడెను. అనేక శతాబ్దములనుంచి అంతర్గతమైయున్న స్త్రీశక్తి యొక్కసారి బహిర్గతమయ్యెను. స్త్రీలాయనకు చేయూతనొసగిరి. వారి సత్వములు సంరక్షించబడి సతీత్వము గౌరవించబడి స్త్రీల కున్నతస్థానములభించెను. ఎచటకువెళ్ళినను అతిబాల్యవివాహముల ఖండించెను. వితంతువివాహముల ప్రోత్సహించెను. గాంధియుగమున సంస్కరణమెన్నిరెట్లు వృద్ధిపొందెనో ప్రస్తుతయుద్యమములలో స్త్రీలెట్టిప్రధానస్థాన మాక్రమించుచున్నారో తెలియగలదు. ఇది వీరాంగనలయుగమగుచున్నది. (కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవి గారు ప్రారంభించిన 'నారీ'యను అముద్రితము గ్రంథమును పూర్తిచేయుటకు వ్యాసకర్త వేలూరు జైలులోనుండగ వ్రాసినది.)

## జానకి యౌవనము

అధికార్ల సూర్యనారాయణరావు గారు బి. యె; బి. యల్.

బాలసూర్యుని పైడిబాణాలబాదలు
చదలేటిబంగారు సుదతిజవ్వనము.
పూసపూసను రాగములనోలలాడు
సెలయేటినురగిలే చెలియజవ్వనము.
నింగిపై కుంకంబు నేరపినట్లుండు
సందెకాంతులశోభ సతిజవ్వనంబు.
చివురుచివురున లేతచెలువంబులొలయ
పూతపూచినతీవ పొలతిజవ్వనము.
వెండినీరముజల్లి పిండారబోయు
చల్లనివెన్నెలలె సఖియజవ్వనము.
రేకురేకున ప్రణయరేఖజీరాడు
నిత్యమల్లెసుమంబు నెలతజవ్వనము.
కిసలయంబులమేసి గీతికలబాడు
కోయిలలగానమే కొమ్మజవ్వనము.
పాలదారులజాడ బర్వగాజేయు
లేతపిట్టలరెక్క లేమజవ్వనము.
వలపుతేనెలరుచుల్ మరపింపజాలు
అపుడుపిదికినపాలె యబలజవ్వనము.
సహజమాధావాల సరసమై మదిని
ముద్దాడుపద్యమే ముదితజవ్వనము.
మాయవలెజనియించి మదివెల్లివిరియు
క్రొత్తవలపులహాయి కొమిరెజవ్వనము.
చల్లగా నామనస్సరసినీదాడు
రాయంచ జానకీరమణిజవ్వనము.

## కైక విజ్ఞప్తి

శ్రీమతి జేలా సీతమాంబగారు

ఉ. అక్కట! రామచంద్రు సుగుణాకరు ఘోరవనాలికంపి పెం
పెక్కిన రాజ్యపీఠిఁ దనపేర్మిసుతున్ భరతావనీశుఁ దా
నెక్కరణిన్ ఘటింపఁగఁ గడఁగెన్ కడుపాపపుఁగైకయంచు నే
డిక్కులనైన నన్నుఁగని తిట్టకమానర దేమిపాపమో!

ఉ. భానునిచే మహాతమముఁ బాయు తెఱంగునఁ బాయునట్లుగన్
దీనికి మూలమైనకథఁ దెల్లముఁ జేయఁదలంచి నాబహిః
ప్రాణము రామభూవిభునిపైఁ గలప్రేమ నెఱుంగఁజేయఁగా
నే నిటువిన్నవించెదను యాచిరువిన్నప మాలకింపరే!

మ. ఒకనాఁ డొక్కనిశీథినిన్ మృగవిహారోద్యోగచిత్తంబుతో
నకటా! మత్పతివిల్లునమ్ములను బాహాపీఠిసంధించి గం
డకవేదండముఖోగ్రజంతుతతి వేటాడంగఁ బోరుండొకం
డొకచో నాసరయూనదిన్ సలిలపాత్రన్ ముంప నాసవ్వడిన్.

చ. విని గజ మంతయేని దగవేగిఱపాటున నీరుఁద్రోలె నం
చనుకొని శబ్దభేదులగు నస్త్రములన్ నిగుడింపఁగా నతం
డనియె మహోర్భటిన్ మిగుల "నక్కట! చచ్చితి" నంచు నాధ్వనిన్
మనమెఱియంగ నావసుధపాలుఁడు నేఁగి శరప్రపీడితున్.

క. కనిమనమునఁ బెనఁగొనువగ జనపతి వడవడవడంకి నవిశేషముగా
వినయమున నతని జననీజనకులగతిఁ దెలిసి యటకు చయ్యనఁ జనియెన్.

క. చని వారల సుతుఁ డచ్చటఁ దనచే మృతినొందెననెడి దారుణవార్తన్
వినిపించిన విని తనయాయని యఱచుచు వృద్ధమిథున మవనిం ద్రెళ్లెన్.

వ. అట్లు విగతచేతస్కులై యుండి కొంతవడికిం దెప్పిరిలి దుఃఖాక్రాంతచిత్తులై.

ఉ. ఎక్కడఁ జొత్తు మేది తెరు వెవ్వరు దిక్కుగువారలిఁక నో
చక్కనితండ్రి! నీరముల జాగొనరింపకఁ దెచ్చెదంచు మా
చక్కి వచించి యంతతడయన్ గతమేమి చరింతు మెట్టు లే
దిక్కున దిక్కు నీవయనుదీనులఁ బాయఁగనేల? పుత్రకా!

ఉ. వారలు కొంతసే పటు లవారితదుఃఖతరంగితాత్ములై
భోరన నేడ్చుచుంగనలి భూపునిఁ జూచి "మదీయపుత్రునిం

జేరఁగ నేగుచుంటి మిదె జీవములం బెడఁబాసి, నీకునున్
కూరిమిపుత్రశోకమునఁ గూడఁగదే మరణంబు మాఁగతిన్.

తే. గీ. అనుచు జీవంబులనుబాసి యవనినొఱఁగునట్టి వారికిం దహనాదు లాచరించి
విన్న నోమోమునందున చెన్నుఁదరుఁగ సదనమునఁ బ్రవేశించె సజ్జనవరుండు.

తే. గీ. అటుల గృహమునకున్ వచ్చియవనిధవుఁడుఁ దనకుమున్ముందుఁబుత్రులు జననమగుట
సిద్ధమనుచును సంతోషసిద్ధుఁడగుచు మఱియుఁ దన్మూలమున వంశ మరయ నాశ
నంబుకాగలదని దుఃఖతాత్ముఁడగుచు చన్న శాపోక్తులను సవిస్తారముగను
కూర్మిభార్యను కావుటంగూర్మి మగుల నుడివె, నితరుల కింతేని నొడువలేదు.

సీ. అందుచే నెంతేని యాత్మజులందఱుఁ బతికంటె మున్ముందు మడియుటయును,
అటుపిమ్మటను నాథుఁ డవనిజీవముఁబాసి పరలోకగతుఁడయి పరగుటయును,
వైధవ్యమునుఁబొంది వనితలందఱమును పుత్రులైననులేక పొగులుటయును,
ఇనవంశమంతట నిలపైని నామమాత్రావశిష్టంబయి యమరుటయును,
జరుగునని మదిఁదలపోసి జనవిభుండుఁ గూర్మిసుతుఁ బట్టమునుగట్టఁ గోరునపుడు
రాముఁ బదునాలుగేం డ్లరణ్యమునకంప
భరతుఁబట్టంబుఁగట్టఁగఁ బటుపటి
వరముఁబొందితి నందునఁ బతియుఁజచ్చి
నను మదీయపుత్రులు భువిమనుటఁగలిగె.

క. పుత్రులు మృతినొందిన తర్వాతను పతివిగతజీవుఁడగుటకు బదు లే
నాతని వంశస్థాపన కాతనివరమడిగి, కొంటి నంతియకాదేన్.

చ. ధరపయి జీవముల్ గలుగుదాఁక వనాంతరసీమ మానిదై
దిరుగఁగ రాఘవుం బనుప దీనుతుఁ బం క్తిరథావనీశు నే
నటమటలేక నాడడుగనా? యటులేటికిఁగోరనైతినో
అరయఁగలేరె మీరు బుధులార! మనంబున నెంచిచూడుఁడీ!

సీ. పతివృద్ధుఁడగుటచేఁ బరఁగమృతుండౌట తప్పనిదేకదా తలఁచిచూడ
నిక్ష్వాకువంశంబునిలపైని నిలువక శాపోక్తిచేఁగడుఁ జనునుగాదె
యందుచే నేనిట్టు లనుగరానిదికోరి శాపంబుఁదార్మారుఁ జేయఁగలిగి
ఇనకులస్థాపనం బినకీర్తిభారకాగణమునిల్పినదాఁక గణనమీర
నొనరిచితినిగదే! మీర లుర్వియందు నింక
ననుఁదిట్ట కెంతేని పంకజాక్షు
లందు నుత్తమురాలిగా నరయుచుండ
మనవిచేయుచునుంటి నో మనుజులారా!

# స్త్రీపురుషుల ఆధ్యాత్మిక స్వరూపము

పాలపర్తి ఆంజనేయులు గారు

మానవవ్యక్తియొక్క పరిపూర్ణస్వరూపములో పురుషుడర్ధభాగము మాత్రమే యాక్రమించుచున్నాడు. పురుషుడెట్టి జవసత్వములు కలవాడైనను తనతో సమానప్రతిపత్తిగల మిగిలిన యర్ధభాగమును తనవలెనే వివేకసంపన్నమైన ఆత్మస్వరూపిణియని గ్రహింపనిచో పరిపూర్ణుడుగాజాలడు. ఒకబండియొక్క కాడికి కట్టబడిన వృషభములవలె స్త్రీపురుషులుండియున్నారు. రెండును సమానమైన శిక్షణపొంది, సమానముగ లాగినప్పు డేవిధమైన ఒడుదుడుకు లేక బండిఎటుల నడచునో ఆవిధమున స్త్రీపురుషు లిరువురును సముచితమైన శిక్షణపొంది స్వీయధర్మముల సరిగ నిర్వర్తించినప్పుడే మానవజాతి పరిపూర్ణవికాసముచెంది గమ్యస్థానము చేరగలదు.

ఇంతవరకును పురుషు డహంకారముచేతనో, అజ్ఞానముచేతనో స్త్రీని జారవిడిచి తానుమాత్రమే సకల సుఖములబడయుచు మానవసంఘమున రాజ్యము చేయజాచెను. కాని అది ప్రకృతివిరుద్ధమగుటచే అడుగడుగునకును స్త్రీయొక్క పతితావస్థయు, అజ్ఞానమును ప్రతిబంధకమై కుటుంబముయొక్కయు, సంఘముయొక్కయు, జాతియొక్కయు పురోభివృద్ధి కుంటుపడి, పురుషుని తన ఇచ్ఛాఫలసిద్ధికి భంగముగలుగజేయు కారణములను పరిశోధించుటకు పురికొల్పెను. స్త్రీని తనకు దానిగను, పరిచారికగను భావింపనలవాటుపడిన పురుషుడు స్త్రీయొక్క అజ్ఞానమే తన యభివృద్ధికి అడ్డుగానున్నదని గ్రహించుటకుగాని ఒప్పుకొనుటకుగాని ఇష్టపడకుండెను. కాని కాలక్రమమున పురుషునికి జ్ఞానోన్మీలనము కలుగజేయు పరిస్థితు లేర్పడజొచ్చెను. రాజకీయసాంఘికపోరాటములందు పురుషుడు స్త్రీసాహాయ్యమును నభిలషించెను. ఈయదనును స్వీకరించి స్త్రీలు వానియందు పాల్గొని తమ వ్యక్తిత్వము ప్రకటింపజొచ్చిరి. సమరానంతరము ప్రాప్త లాభముల స్త్రీపురుషులు సమానముగ బంచుకొనకతప్పదు. ఈపరిస్థితుల గమనించి స్త్రీపురుషులు పరస్పరము గౌరవాదరణభావములతో వారివారి ధర్మముల నిర్వహించుచో కుటుంబము, సంఘము, దేశము సౌఖ్యప్రదము కాగలవు.

ఈసందర్భమున స్త్రీలు తమ ధర్మమును గుర్తించుట అవసరమైయున్నది. పురుషులకువలెనే స్త్రీలకును పరమేశ్వరుడు యుక్తాయుక్తవిచక్షణజ్ఞానమును ప్రసాదించియున్నాడు. దానిని యుపయోగించుకొనియే పురుషుడభివృద్ధిగనుచున్నాడు. స్త్రీలును తమధర్మమును దెలిసికొని కర్తవ్యము నెరవేర్చవలసియున్నారు. స్త్రీలలో చాలమంది నేడు వారికిగల ప్రత్యేకలక్షణములబట్టియు, చిత్తవృత్తులబట్టియు అనేకమైన ఉద్యమములలో పాల్గొనుచున్నారు. కాని స్త్రీకి జన్మచేతనే కొన్ని విలక్షణములైన ధర్మములను భగవంతుడు నిర్దేశించియున్నాడు. అవియే సతీత్వమాతృత్వధర్మములు. ఈరెండుధర్మములలో స్త్రీయొక్క పూర్ణస్వరూపము, పవిత్రత వ్యక్తమగుచున్నది.

స్త్రీపురుషభేదములు ప్రాకృతికములుగాని నిత్యములుగావు. స్త్రీయొక్కగాని, పురుషునియొక్కగాని నిజస్వరూపము ఆత్మగాని కరచరణాద్యవయవములతో కూడుకొనిన బాహ్యరూపముగాదు. ఈనిజస్వరూపము వ్యక్తముకావలెనన్న పైన ఆవరించియున్న అజ్ఞానతమస్సు విడిపోవలెను. జ్ఞానము స్వప్రకాశముగలది. అట్టిజ్ఞానములేక యేవ్యక్తియు ప్రకాశింపజాలదు. కావున కేవలము అక్షరజ్ఞానముతో కూడుకొనినదేగాక ఆత్మయొక్క నిజకాంతుల విరజిమ్ము ఆధ్యాత్మికజ్ఞాన మవసరమైయున్నది. అప్పుడే మానవసృష్టిలో

ఈశ్వరుని మంగళోద్దేశము నెరవేరుటకు తమ యథార్థస్థానమును స్త్రీపురుషులు గుర్తింపగలరు. ఈజ్ఞానోదయమగువరకు కేవలము పరస్పరోపభోగముకొరకే తామున్నామని స్త్రీపురుషులు తలంచెదరు. ఈజ్ఞానోదయమయినపిమ్మట స్త్రీపురుషభేదము నశించును, ద్వైతభావముపోయి అద్వైతభావ మంకురించును. స్వప్రయోజనములు నశించి ఈశ్వరునిప్రయోజనములే అనుసరణీయములగును. అప్పుడు భర్తయెవరు? భార్యయెవరు? పార్వతీపరమేశ్వరులలో భేదభావమెక్కడ? ఎవరుయెక్కువ? ఎవరుతక్కువ? ఇది దాంపత్యముయొక్క పూర్ణస్వరూపము. సతీధర్మముయొక్క పూర్ణబింబమును చూడగలిగిన స్త్రీ పతియందు విలీనమగును. అటులనే సతియం దాత్మసందర్శనము పొందిన పతి ఆమెయం దంతర్భూతుడగును. మానవమూర్తియొక్క ఈపూర్ణస్వరూపోపాసనను అనన్యభక్తితో స్త్రీపురుషు లెప్పుడు చేయగలుగుచున్నారో అప్పుడు దాంపత్యముయొక్క ఆధ్యాత్మికతత్త్వము వ్యక్తముకాగలదు. ఆత్మోపలబ్ధిమార్గమున నిది ప్రథమసోపానము. ఈమొదటిమెట్టునే అధిరోహింపజాలనివారు సర్వభూతాత్మైక్యానుభవము నెట్లు పొందగలరు? వైవాహికధర్మముచేతను, గార్హస్థ్యధర్మముచేతను, సంతానముచేతను పరస్పరము బంధింపబడిన స్త్రీపురుషులు సామ్యబుద్ధిని సాధింపజాలని పక్షమున దానిని సంఘమందు సాధించుటెట్లు?

జీవితముయొక్క పరమార్థమును, నిజతత్త్వమును తెలియకపోవుటచేత సంఘ మస్థిరమైనపునాదులపై నిర్మింపబడుట తటస్థించుచున్నది. మనదేశమున సంఘము, సాంఘికధర్మములు, వ్యవస్థలు సుస్థిరమైన ఆధ్యాత్మికసూత్రములపై వేదకాలమున స్థాపింపబడినప్పటికి, వర్తమానకాలమున పౌరాణికయుగమందు తారుమారైన సాంఘికవ్యవస్థలే ప్రచారమందుండుటచే పశ్చిమమునుండి వచ్చు వివాహవిచ్ఛేదన, సంతాననిరోధనాది సాంఘికపరివర్తనము ఝంఝామారుతముల నెదుర్కొనజాలక హిందూసంఘము నేడు కుంకటి ప్రేశ్యతో సహిత ముజ్జాతలాగుచున్నది. కావున హిందూసంఘము స్త్రీపురుషుల ఆధ్యాత్మికస్వరూపమును గ్రహించి స్త్రీపురుషసమానప్రతిపత్తిగల వేదకాలమందలి సాంఘికవ్యవస్థల పునరుద్ధారణ చేయవలెను.

# కోర్కె

శ్రీమతి జి. జయలక్ష్మి గారు

౧

ఈ మహోన్నతశైలభాగమ్ము నొక్క
ఫలభరితమైన వృక్షమ్ము పగిదినేని
పుట్టియుండిన సార్థకమొందియుందు
నేమొ నాయున్కి నమ్రభావమున తపసి
వర్యుల కనయ మతిథిసత్కార్యమొనగి.

౨

ఈ మనోజ్ఞపుష్పోద్యానసీమ నేను
తావి వెదజల్లు చక్కని పూవునేని
ప్రకృతాంగన సౌభాగ్యగరిమపెంచి
ఇలను సార్థకజీవిగ దలచుకొందు.

౩

ఈ వసంతాగమాదివ్యనవ్యవేళ
కొండచఱియలఁజను సెలయేటి రొదల
గళముపై కెత్తి చక్కదనాలవలపు
పాడియుండుదు నే నొక్కపక్షినైన
అవనితలమున స్వేచ్ఛావిహారినగుచు.

౪

ఈ మనోహరనికృతావనీతలమ్ము
నడతెగకపారు నోసెలయేటినేని
పాంథజనముల తాపమ్ము బాపి, వారి
అమితజీవనాసౌభాగ్య మందియుందు.

# ప్రత్యూషము

బొడ్డు బాపిరాజుగారు

౧

అవనిఁ బీషించినట్టి గాఢాంధకార
సంచయములెల్ల తెరలె నాశాంతములకు
దివ్యతేజఃప్రభాళి ప్రాగ్దిశనుదోఁచెఁ
గలలుగనమానిజగములుఁగన్ను దెఱచె.

౨

అతిసిరంతుశరాత్రించరాధిపత్య
మంతమొందించు ధీబలవంతుఁడైన
ఇనుఁడుదయమందెనిమధుస్వనములోల
ద్విజకులంబులువిజయగీతికలుబాడ. [య

౩

నవనవోదయలోకబాంధవు; సమస్త
భువనసమ్మానితు; మహాత్ముఁ బూజసలుప
లలి మరందార్ఘ్యమునుబూని జలరుహంబు
దరియవచ్చె సహస్రపత్రములవిప్పి.

౪

బాలభాస్కరకిరణప్రచాలనమున
సకలమానవలోకంబునకు సనూన
మానసోల్లాస; ముద్రేక; మానృశంస్య
మధికదీక్షానిరూఢియు నలమెనపుడు.

౫

పరమపావనగంగాభవానియందు
ఘనపరాధీనపంకప్రక్షాళనంబు
సలుపఁగాఁగోరి; స్వాతంత్ర్యసాగరమున
గంతులిడనెంచి బద్ధకంకణులు నగుచు

౬

తరుణులును, సుకుమారకాంతాజనంబు,
బాలురును, వృద్ధులునుగూడి భాస్కరునకు
నైక్యకంఠాన స్వాగత మాలపించు
చున్నవారలు లోకమోహా! యనంగ.

౭

ఉన్నకోలదిని ఇనుడు నత్యుగ్రుఁడగుచు
తేరిచూడఁగ రా కిరిపిరులకును
గుండియలు దిగ్గురన నభోమండలమున
తతసహస్రకరంబులఁ దనరుచుండె.

౮

అఖిలభువనపాలకత్రిమూర్త్యాత్మునకును
అలఘుతేజోవిలాసి కసతితునకు మ
హాత్మునకు భక్తితోడ జోహారుసేస
ముజ్జగంబులు తలవంచి ముదముమీర.

# అమ్మ

పురాణం కుమారరాఘవశాస్త్రి గారు, బి.ఏ.

పెద్దరికమెల్ల మోమున విరిసియుండ
చిన్నితమ్మునికిఁ బాలు జేపుకొనుచు
పారమెఱుఁగని ప్రేమరూపంబువోలె
నాసడింటఁ గూర్చున్న మాయమ్మనీడఁ
దనరుచున్నాడ నానందధాముడనయి.
మనసుతీరంగ నామె నమ్మాయటంచుఁ
బిలచికొందును! నన్నామె ప్రేమచూడ్కిఁ
దమి విలోకించి, "ఏమిరా! తండ్రి" యనును
నాకుఁ బ్రత్యణుస్థితియు నానందమయము.
మ్రొక్కుదునురోజు, తెల్లవారుమునుపె లేచి
యామహాపతివ్రతచరణాబ్జములకు
నాదు జీవితమంత ఆనందమయము
మాతృదేవి యాశీర్వాదమహిమఁ జేసి.
భయముఁజెందినాడు నేఁ బరువులెత్తి
పోయి మాయమ్మకంఠంబుఁ బుణికిపట్టు
కొని విడువకుందు; ఆమె అక్కుపయినన్ను
పొదవిపట్టుక మూర్ధంబు మూరుకొనును.
నామొదటిపాఠ మాయమ ప్రేమయొడినిఁ
జేరి యుత్సాహమున నభ్యసించినాను;
మన శివాజీగుఱించి చెప్పినది యామె
నాకు వీరరక్తముపొంగినది నిజమ్ము.
"భరతదేశము నీదిరా, భారతీయ
రక్తపూరంబు నీలోనఁ బ్రజ్వలించు
రా," యటంచు నాతోడ మాయమ్మపలుకు,
ఎల్లపుడుఁ దలచికొని గర్వించిపోదు.
ఆమె నాపూర్వజన్మపుణ్యము ఫలించి
నాజననియయ్యె; నామె యాజ్ఞానుబద్ధ
వర్తనమెనాడి; పోయిదేవతలగెలిచి
అమృతమైనఁ దెచ్చెదనుపో ఆమెకొఱకు.

# అఘోర కామిని

ఏటుకూరి వేంకటనరసయ్యగారు

ఇదానీంతనముగా సర్వవిధముల దేశాభ్యుదయసూచనలగుపడుచున్నను స్త్రీలింకను స్వక్రమశిక్షయందారితేరలేదు. నే డేకొలదిమందియో విద్యాగంధముగలవారైనను చాలవరకుఁ బురాణశ్రవణముచేతనే ప్రాచీననారీమణులచరిత్ర తెలుసుకొనవలసినవారలుగానున్నారు. ఇదియునాట్టె కొన్నిచోట్ల మృగ్యము. కాని యచ్చటచ్చట పురాతనలలనామణులతో సరిపోల్చదగిన పతివ్రతలు, సర్వభూతములయందు దయాదాక్షిణ్యము గలవారలు, నిజసద్గుణములచే నాదర్శప్రాయలైన మహనీయురాండ్రు లేకపోలేదు.

ఈకోటియందు బరిగణింపదగిన ధన్యతమ, సాధుసాధ్వి, వంగదేశసముద్భవ అఘోరకామినీదేవి యొకతెయని చెప్పవచ్చును.

దేవి జీవితవృత్తాంతము విలిఖించిన మాలేఖినిగూడ పవిత్రముకాగలదు. దీనిని జూచినమహాశయులు మహాచరిత్రనాయిగా బరిగణించి యీమెగుణముల నాదర్శకములుగా స్వీకరింతురని తలంతుము.

ఈసాధుచరిత్ర వంగదేశమున బ్రఖ్యాతివహించిన "టాకీ" యనుగ్రామమున క్రీస్తు 1854 సంవత్సరములో జనించెను. తరుపరి ఈమెకు యుక్తవయస్సురాకముందు 1860 సంవత్సరమున బాల్యముననే మహోదారస్వభావుడగు బాబుప్రకాశచంద్రుడను యువకుడు పెండ్లియాడెను. అది మొదలీమె చక్కగా శిక్షితురాలై గృహమేధినియయ్యెను.

వంగదేశీయులు సర్వశిక్షణావశ్యకములయందారితేరినవారయినప్పటికి స్త్రీశిక్షావిషయమై యాట్టె బుద్ధిని బ్రసరింపనీయరైరి. ఎందుకిదియన "వామలు స్వబుద్ధికి దోచినప్రకార మది దురాచారమైన స్వీకరింతురు. మనమెంత శిక్షించిన సమీచీనమైనదానిని విచారింపకయే కాలద్రోచి పుత్తురని." దృఢముగా వారలలో పాతుకుపోయిన కారణమిదియే. బాబుప్రకాశచంద్రుని కిది నచ్చలేదు. ఎవరికైనను సుశిక్షణలేకయే జ్ఞానములవడదు. జ్ఞానము వినా కార్యాకార్యవిచక్షణగలుగదు. ఈవిచక్షణలేక జీవితమానందమయముగా నడువదుగాన సుఖాభిలాషగల సమస్తభూతములకు జ్ఞానమావశ్యకము. తదర్థమే సర్వక్రమశిక్షణములు కూడను.

వంగీయులు స్త్రీశిక్షణ యనావశ్యకమని యెట్లువివదింతురు? పురుషులకే నేమి శాస్త్రాధ్యయనము, సర్వకార్యధురీణతయును? స్త్రీలకులేదేమి? ఎవ డిది న్యాయమని మనసా వచింపగలడని తాత్కాలికమర్యాదల ననూకంగా విచారించి సర్వవిధముల స్త్రీలకు శిక్షణ యావశ్యకమని నిర్ధరించి పవలెల్ల గృహకార్యవ్యాప్తిచే దీరుబడిలేమి రాత్రిసమయమం దొకగురువును నియోగించి ప్రియురాలికి విద్యగఱపించెను. ఇట్లుకష్టపడి నేర్పించినను, స్వల్పావకాశమగుటచేతను, పైగా రాత్రిసమయమగుటచేతను, విశ్రాంతిసమయమున విద్యాభ్యాసమగుటచేతను, అందులో చిఱుతప్రాయమగుటచేతను, సహపాఠకురాండ్రెవ్వరు లేకునికియు దేవి పతిమనోరథము విఫలమేగావించెను.

ఎంతవిఫలమైనను బాబు నిరుత్సాహుడుగాక 'యత్నేకృతే నసిద్ధ్యతికోత్రదోష' మని ప్రయత్నముపసంహరింపడయ్యెను. కొన్నిదినము లిట్లుగడువగా రాత్రిందివము లధికశ్రమవహించి పలుపాట్లుపడుట తననిమిత్తమేకదాయని విద్యాభిరుచి జనించి స్వంతముగా దివారాత్రములు కష్టించి భర్త్రభీష్టము నెరవేర్చెను.

వంగదేశమున కొన్నిగ్రామములలో వసించు స్త్రీలు ఒకవిధమగు చూర్ణముచే దంతముల కాపాదనరూపమగు నీలిమగలిగించుకొని దీనిచే బ్రియపురుషుడు చూడగలవింతసౌందర్యము తమ కాపాదించగలదని యువ్విళ్ళూరుచునది యొకయాచారముగా బరిగణింతురు. ఇదియంతయు ప్రకాశచంద్రున కసహ్యముగా

దోచెను. తమ గ్రామములో నిది యనాచారమైనను పతిదైవతయగు నఘోరకామిని మనోహరుని భావమెఱిగి "ఈయనాచారక్రమమంతయు దనప్రియుడు సంతోషించుటకుగదా! అదివిని నత డేవగించుకొనిన నీవింతపూత యేమి యానందమున"కని తదాచారము బరిత్యజించి దీనివిషయమై బంధుజనులు సహచరులును బరిహసించుచున్న సహించుచు నాథునిమతానువర్తినియై మెలంగజొచ్చెను.

ఆకాలమున భార్యాభర్తలు పరస్పర ముత్తరములు వ్రాసుకొనుటాక్షే యిరుగుపొరుగులకు బంధువుల కనిష్టముగానుండెను. ప్రేమలేఖలు కారణములేకయే వృథాగా వ్రాసుకొనుటయు గద్దు. నిజముగా విచారించిన నీలేఖలు విరహక్లేశశామకములేగాని ప్రేమవృద్ధకములుమట్టుకు గాజాలవనియు నొకవేళ చిత్స్వైపచే ప్రవాసమొనరించుచున్న పతికి కోడలు త్తరము వ్రాసినటుల దెలిసినయెడల నాయత్తమామలు బడుగాలిదాన (హడావుడి) మింతింతని నుడువశక్యముగాకుండును.

ఒకప్పుడీస్థితి దేవికిగూడ తటస్థించెను. అపు డీమె సాధారణస్త్రీలవలెగాక ప్రాణేశ్వరుని కార్యవృత్తాంతము దెలియజేయుటలో దోషమేమి? పరస్పర క్షేమవార్త దెలుపుకొనుట ప్రేమకు రక్షాబంధముగాదా? యని స్వయముగా దలిసికొనినదైనను సాహసింపలేక తుద కేకారణకలాపములేకయే ప్రియుని కెట్లుత్తరము వ్రాతునని యూతపస్విని దూనహృదయయై దినములు వెళ్ళబుచ్చెను. ఇట్లుండ నొకనాడీప్రవాసవేళ వ్రాసిన పత్రికయే ప్రకాశచంద్రునకు గనబడెను. దానిని బుచ్చుకొని బాబిట్లుచదువుకొనెను. నాప్రియురాలికి పత్రలేఖనవ్యాపారములో శీతకిరణుడు ప్రదీపత్వమును, నవము భవనత్వమును, కీలాతల మాసనత్వమును, కిసలయము-పత్రత్వమును, కనిష్టాంగుళి లేఖనీసాధనమైనదా? యని.

పాఠకులారా! ఈదేవి లేఖనవ్యాపారమునిండనర్థముజేసుకొనిన నేవ్యక్తి క్షణము విస్మయమందకుండును?

యౌవనమందు యువతులకు సామాన్యముగా భూషణాభిలాష మెండుగానుండును. అందులో గామినీజనులు స్త్రీసౌందర్యము భూషణాయత్తమని నోట పాటచేర్చిన చదువుగాకయే సహజో స్నేహముచేతనే గ్రహింతురు. ఏయమ్మశరీరమునిండ బట్టెడుసొమ్ములు శుభ్రమైన దుకూలములుండునో ఆయమయే ధన్యురాలని ప్రాయశః పరిగణింతురు. సతతము స్త్రీసమాజములలో తఱచీప్రస్తావనలే వినబడుచుండును. పిల్లదాన! మీఅత్తింటివారు బెట్టినసొమ్ము లెంతఖరీదైనవోయి, మాయాడపడుచునకు గొలుసందంగానున్నది, అమ్మాయీ? తులఖరీదెంతే? బాజీబందులు గుత్తంగాసరిపోయినవి. వడ్డాణమెంత పిల్లా! అని.

ఒకప్పుడు దేవి కొద్దిజిలుగల వస్త్రముగట్టుకొని నైసర్గికకాయకాంతికమనీయముతో మంగళసూత్రమాత్రాలంకారయై దేనికో గుంపుగామూగిన మహిళాసమాజమును బ్రవేశించి వారిచే బలుకరింపబడక సహేళనముగా జూడబడి వారిలోనే మెల్లగా ఎవరమ్మా యీమానవతీయురాలనిపించుకొని అచటనే నిలచి చాలసేపు వారిని బరికించెను. తదుపరి యావికటాట్టహాసములు నాగుసగుసలలో నజ్ఞత దెలుసుకొని 'ఈసమితి ప్రవేశార్హమైనదిగాదు. ఇది పరోపకారార్థమేర్పడినదా? ధర్మోన్నతికి గల్పింపబడినదా? ఛీ,ఛీ, వృథాపల్లాపములకే గుమిగూడిరిగాని' యని తత్క్షణమే గృహమున కరిగెను. పోయినవెంటనే ఆయమోఘవాగ్విలాసిని యిక ముందెన్నడు భూషణములు సురుచిరాంబరములు ధరింపనని ప్రతినబట్టి మరణపర్యంత మీమె యాశపథము జెల్లించుకొనెను.

వయస్సుచేతనెట్లో యశస్సుచేతనట్లే దినదినప్రవర్ధమానయై సర్వదా సదసద్విచారములజేయుచు భర్త్రనుమతిచే బ్రాహ్మధర్మదీక్షను వహించి 'పరోపకారః పుణ్యాయ పాపాయపరపీడన'మ్మను నీతివాక్యమును మూలమంత్రమునువలె స్మరించుచు నశేషధనమును దానధర్మములకై వ్యయించెను.

అనాథలగు కొంతమంది స్త్రీలను తాదప్పిన గతికమింకెవ్వరులేరనుకొనునట్లుగా స్వగృహముననుంచుకొని యోగక్షేమమును విచారించుచు బరిపోషించెను.

కొన్ని సమయములందు దరిద్రదుర్లభమైన పదార్థములుగనుపడిన నుత్తరక్షణముననే వానిని దెప్పించి పచనముచేయించి విద్యాభిలాషగల స్త్రీలననేకులపిలిపించి తదిష్టమువచ్చినటుల గుడువబెట్టి తదనంతరము ప్రియాలాపములతో వారి నిట్లనేకపర్యాయములు సంతోషపెట్టెను.

ఆకాలములో పరోపకారనిమిత్తము మనస్సుచేత శరీరముచేత ధనముచేత నహర్నిశలువ్యయించుచు కష్టపడిన దెవరన నొకయఘోరకామినిదేవి యని ప్రజలెల్ల నైక్యకంఠముతో సానందముగా జెప్పుకొనెడువారలు.

ఒకపర్యాయము సమీపగ్రామములో బీదవాడొకడు వ్యాధిగ్రస్తుడై మృత్యువువాతబడనున్నాడను వార్త కర్ణాకర్ణికగా విని తదుత్తరనిమిషములోనే బయలుదేరి యాగ్రామము బ్రవేశించి వాని బాలసహోదర నిర్విశేషునిగా సన్మానించుచు దరిద్రుడగుటచే స్వంతధనము వెచ్చించి యౌషధమును దెప్పించి క్రమముగా నౌషధము వాడుడని తత్పరిచర్యకొరకు కొంతమంది తన దాసీలనుంచి సర్వవిధముల లోటులేకుండ శుశ్రూష గావించెను. మఱొకప్పుడు మేడలో పుస్తకము జూచుకొనుచు వీథిలో గొల్లున నొకదయనీయమైన శబ్దమును వినెను. వినినతోడనే ససంభ్రమమునలేచి ఏమిటేమిటని ద్వారముకడ కరుదెంచి యటగుట్టగామూగిన జనుల కారణమడిగెను. వారు 'దేవీ! ఏమి చేయుటకు దోచుటలేదు. నావికుడైన హాలధరుని భార్య జ్వరపీడితయయ్యె. నవప్రసూతియగుటచేత చూడవచ్చిన వారినెల్ల నాయవస్థ విచారింపుడని ఖిద్యమానరాలై బాధపడుచున్నది. పాపము! కడుచూట కష్ట' మనిరి. ఆవాక్యము లాలించినవెంటనే హాలధరునిసదనమునకుజని యాయింట చీకటికోణగానున్న నొకమూల ధూళిధూసరితప్రదేశమునందు చింపిరిగుడ్డపై పొరలాడుచున్న దీనహృదయంజూచి నీకువచ్చిన భయములేదని చెప్పుచు ముందుగా వైద్యునికొరకొకనిని బరుగెత్తించెను. తదుపరి యిల్లంతకలయజూచి కసవుగానుంటచే నట నేపడియున్న చీపురుకట్టబుచ్చుకొని హాలధరుడెంత వారించుచున్నను సరకుకొనక "వైద్యుడువచ్చులోగ పరిశుభ్రపరచెదను. లేకున్న చీకాకుగానుండును. పరోపకారమేలేని యీచేతితో మట్టుకు నాకేమిప్రయోజన" మని చెప్పుచు వైద్యుడు వచ్చువంతకు గీము నిర్మలినముగా దుడిచెను. అనంతరము వైద్యునిచే తగు మందిప్పించి యామెకు విశ్రాంతియొదవుదనుక తనపనికత్తెల నియోగించి గేహమునకు వెళ్ళిపోయెను.

ఈవిజ్ఞానురాలు స్త్రీలనిమిత్తము వాంకీపురములో గొప్పపాఠశాలను గట్టించెను. దాని యభివృద్ధికై పలుపాట్లుబడుచు తనుస్వయముగా పోషించుచున్న యిరువదిమంది స్త్రీలను ప్రత్యహముపాఠశాలకు బంపుచ వచ్చెను. ఇంక నిండకోపగించుచు నాత్మీయపుత్రికలనువలె నాగ్రహమున శిక్షింప నుపక్రమించెను. లోకు లీయాగ్రహమును జూచి 'దేవీ! ఎందు కీయాగ్రహము? నీవు శ్రీమంతురాలవు. శిక్షణయు వంతమంచిగాలేదు. పరాయిపాపల నిట వ్యక్తముగా శిక్షించుట దగునా' యనిరి. అపు డీజనశ్రుతి విని దేవి 'నిజమే. పరోపకారనిరతనైనను నాయింటనున్న వారలతో గాలము వెళ్ళబుచ్చుచుండిరే తదారాధనలో వేగించుట మంచి శిక్షాపద్ధతిగాద'ని నిండవిచారించెను. కొన్నాళ్ళ కీవిచారముతో బనిలేదు విదేశమునకేగి కొన్నిసంవత్సరములోక సంస్థయందుండి ప్రచురముగ జ్ఞానమార్జించివచ్చి స్త్రీశిక్షణ సక్రమపద్ధతిలో నడుపవలెనని నిశ్చయించి తోడనే బయలుదేరి దేశాంతరశిక్షాభ్యాసపద్ధతుల నేర్చుకొనివచ్చి వాంకీపురిలో తన పాఠశాలయందే ప్రధానాధ్యాపకురాలుగానుండి స్త్రీల ననేకుల విద్యాసంపన్నలగా దయారుచేసెను.

ఈమె జాత్యభిమానమునిర్వర్ణనీయము. లేకున్న నక్తందివ మిట్లుకష్టపడునా? ఒకసమయమున వాంకీపురియందే స్టేషనులో స్త్రీలకు ప్రత్యేకముగా (waiting room) లేకపోవుటచే స్త్రీపురుషులుకలిసి యుండ

వలసివచ్చినది. ఆవేళ నొకరాజకీయోద్యోగి అనాథయగు నొకయువతిని బలాత్కరించగా నీపాపమును దేవి చూచి దూయమానమానసయై వానిని శిక్షించుటకు లేఖవ్రాసి యచటనున్న నూరుగురు స్త్రీపురుషులచే సంతకములుచేయించి యప్పటికప్పుడే ఈలియట్ దొరవాని కంపించినది. లేఖచేరినతోడనే వానికిదగు శిక్షను వేసిరి. అప్పటినుండియే స్త్రీలకు ప్రత్యేకముగా రాజకీయోద్యోగులచే (waiting room) యేర్పరుపబడెను.

మహాత్ముడగు ప్రకాశచంద్రుడు ప్రతిమాసము తనచేతితో నిచ్చుచున్న వేతనమును మూడుభాగములుగా విభజించి రెండుభాగములు ధర్మముకొరకు మిగిలినది తనఖర్చుల నిమిత్తమై వినియోగించుచువచ్చెను.

ఒకప్పుడు సింధుదేశీయుడైన పదునెనిమిదేండ్ల విద్యార్థి హీరానందుడనువాడు వాంకీపురిలో చదువుకొనుచుండెను. కొంతకాల మిట్లు గడువగా దైవదుర్విపాకమువలన నావిద్యార్థి జబ్బుపడెను. పాపము దిక్కులేని యాయువకుని తన గేహమునకు గొనివచ్చి ప్రియునియనుమతిచే వాని యారోగ్యమున కనేక ప్రయత్నములాచరించెను. కాని యతని దురదృష్టముచే కొన్నాళ్ళకుమరణించెను. పుత్రనిర్విశేషముగా జూచుకొనుచున్న దేవి వానిమరణమునకు మిక్కిలి దురపిల్లి తజ్జాతీయులచేత నాప్రేతమునకు దహనాదిక్రియల జరిపించెను. తదుపరి తంత్రీద్వారా యతని బాంధవుల కిది తెలియజేసెను. వారిది తెలిసికొనివచ్చి హీరానందుని మృతికి నిండదుఃఖించి దేవిశ్రమ కనేకసాధువాదములాచరించి వెడలిపోయిరి.

ఈమె బ్రాహ్మధర్మానుయాయినియని ముందే ప్రవచించితిమికదా? ఒకమారు తమయూరు ప్రవేశించిన ధర్మప్రచారకుని కొంతమంది స్త్రీలతో గలిసికొని సప్రమోదోత్కంఠతో నుత్సవముజరుపుకొనుచు నెదురేగి యింటికిదోడితెచ్చి వానిచే ధర్మములదెలిసికొని ధనదానముచే దగుమర్యాదలుజరిపి సత్కర్మలనాచరింప పెద్దగా ప్రోత్సాహింపబడినది. ఆహా! దేవి ధర్మపరాయణత మిగుల ప్రశంసనీయముగదా?

ప్రతిదిన మీమె సాయంతనమందు స్త్రీలతోగలిసి బుద్ధదేవాలయమునకరుగుచు మార్గమధ్యమందున్న ప్రజలకు నీతికథలు మంచితత్వముల నుపదేశించుచుండెడిది. ఇట్లు దైనందిన మాచరించు దేవి ప్రవృత్తినవలోకించుచున్న లోకులకొకవిధమైన పూజ్యభావమేర్పడెను. అదిమొదలీమెను భువనావతీర్ణయైన దేవతనుగా దలచుచుండెడివారు.

దేవిపరోపకారము, భూతదయ, స్వధర్మనిరతి, పాతివ్రత్యము, ప్రమదాభ్యున్నతి, దీక్షేత్యాద్యనితర సాధారణగుణముల వర్ణింపబూనిన వ్రాయసకాండ్రమగు మాహృదయమేలకో "టువ్వటువ్వ"మని బిల్లబీటగుచున్నది.

శరీరము క్షీణించుచుండెను. అహర్నిశ లధికపరిశ్రమయయ్యెను. అదిపరోపకారార్థమేనండీ! పాప మీతపస్విని శరీరమున క్రమముగావ్యాధులు ప్రవేశించినవి. వైద్యులకు ననేమిరాయన్నవి. ఇది వాతమే, తదుపశమనార్థము స్థలాంతరమున కేగవలయునన్నారు. బాబు దేవి కారోగ్యాశ్రమదియేనని నిర్ణయించెను. ఊహు. "బలవతీహిచద్దైవేబంధుభిఃకింవిధేయ" కేవలము బాబు నొక్కనేకాదు నగరవాసులనందరి నపార దుఃఖసాగరమున ముంచి క్షణికమైన పాంచభౌతికమును వీడి అమరము, అజరము, అవ్యయము, అతులము, అనిర్వచనీయమునైన స్థిరకళ్యాణధామమును నాత్మశరీరముచే సాయుజ్యసామీప్యములతో లయమైచేరుకొన్నది. విశ్వమోహనజగత్తులో నానందమయగీతిక కన్నీరుకథగామారినది.

ఈప్రాజ్ఞురాలు మరణమాసన్నమైనదని తెలిసిన వెంటనే నాప్రేమమయి బాబును నయనచంద్రికలను వీడవలసివచ్చెగదా యని లోకపరిపాటిగాగ గన్నీరుకుడుచుకొనుచు బాంధవులరప్పించుకొని "చూడుడు. మీరు దుఃఖించవలదు. జీవికప్పటికైన చావుతప్పదు. నేనానందమయసదనమును జేరుచున్నాను. సంతోషింపవలసిన సమయమేయిది. దుఃఖమునకవకాశములేదే. నన్నుగూర్చి యూరకిట్లు వాపోదురేలకో" యని వారి

నూరార్చి కొంచెము తెప్పరిలి తనజ్యేష్ఠకుమారుడైన సుబోధునిబిలిపించి ప్రక్కలో కూర్చుండబెట్టుకొని చేనిమిరి 'తండ్రీ! సుబోధ! చిరంజీవ! నీజీవితములో మానినులవిషయమై రవ్వంత కసరుకొనకు. ఇట్లే తదితరుల విషయముగూడను. యావజ్జీవము సత్యంవద, ధర్మంచర, దిగంగనాకర్ణావతంసీకృతకుసుమాయమానమైన యశస్సౌరభ్యమును సంపాదింపుము. నీకొరకు నేనుంచిన ద్రవ్యము ధర్మముకొరకేనుమీ! నన్నుగూర్చి లవమేనియు దుఃఖింపవలదు. నేనాసన్నమరణనైతి' నని వారిని పలువిధముల నోదార్చెను.

పాఠకులారా! అఘోరకామిని చరమావస్థయందు నుడివిన వాక్యములచే ధర్మబుద్ధియన నెట్టిదియో, కర్తవ్యజాగరూకతయన నెట్టిదో, సద్వర్తనయన నెటువంటిదో విశదమైనదిగదా?

ఏమహనీయురాలివలన సాంఘికబాధలత్యున్నతములై భావబాధాముక్తులై నేడు మన కిట్టట్టనరాని యాదర్శకప్రాయములై చిరస్థాయులైనవియో ఆమహాయోగిని కన్నుమూసినవెంటనే, మన ప్రియభాగిని పోయినట్లు, కూతునిగోల్పోయినట్లు, బహిఃప్రాణమునశించినట్లు, ఉపదేశకర్తయగు గురువుతొలగినట్లు, ఉండకెందున నెక్కని యబాధలమైనట్లు సంస్పృష్టహృదయములతో బాష్పరుద్ధకంఠములతో ఘల్లకడి నీరవుల మగునట్లుచేసిన మహత్తరశక్తియేది? ఈమెకార్యదీక్ష, సత్ప్రవర్తనయును.

నగరమునందెల్లయెడల నీవార్తవ్యాపించిన వెంటనే స్త్రీలెల్లరు బొమ్మలుబాదుకొనుచు కడుదురపిల్లిరి.

దేవి సర్వవిధముల దేశసేవకై యవతరించిన మహావ్యక్తి తన సర్వస్వమును దేశాభ్యున్నతికై వ్యయించెను. తాను విశ్వహృదయములో ప్రేమభాగియయ్యెను. మహనీయులకింతకంటె వేరేయుపకృతియుద్ది?

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

అన్నట్లిట్టిరూపములో నవతరించి లోకకల్యాణముల గలిగింతురని తలతుము. ఈకర్మయోగులకు మన మెల్లర మాజన్మము ఋణపడి "పాపీచిరాయు స్సుకృతీగతాయుః" యనునట్లు చిరంజీవుల మగుచుందుము.

## మమ్మువీడెదె? శ్రావణమాసలక్ష్మి!

బి. హనుమంతరావుగారు

శ్రావణీనాగమంబు సౌఖ్యావహంబు
నిర్భరానందజనకంబు నిస్తులంబు
ననుచుఁబడతులునిన్నుఁ జేర్కొనుటెగాని
క్షణములుగఁజేసి దినముల సత్వరముగ
మమ్మువీడెదె శ్రావణమాసలక్ష్మి!
ఎన్నిదినములు నీరాక నెదురుచూచు
చుంటిమో యన్నినాళ్లేని శోభఁదనరి
మానికేతనమునఁజేరి మమ్ముఁగాచి
దీవెనలనిడకుండ దుర్దినముఁగూర్చి
మమ్మువీడెదె శ్రావణమాసలక్ష్మి!
శుక్రమంగళవారముల్ సక్రమముగఁ
మజ్జనంబాడి యంత నమందలీలఁ
దేవినర్చించి నిర్మలోద్దేశమునను
వింతరుచులొల్కు వలువలసంతరించి
సురుచిరాభరణంబులఁ సొంపుమీఱి
సంధ్యఁ బేరటాండ్రను నిజసదనమునకుఁ
జీరి వారలఁదన్పి యాశీస్సులంది
సంతసాంబుధిఁదేలుచు సుంతయేని
చీకుచింతలనెరుగక చిత్తమందు
నలినవలెల్లరునుంట నీకతనఁగాదె?
వినుతి నిన్నేయశక్యమే విబుధులకును
నీదుసౌభాగ్యగరిమం బికెట్లు గాంతు
మమ్మ! మాప్రార్థనమ్ము లవమ్ముజేసి
మమ్మువీడెదె? శ్రావణమాసలక్ష్మి!

# స్త్రీలు: భీమా సమస్య

శ్రీమతి మనసా కం కమలమ్మ గారు

ఈదినములందు మనస్త్రీలు అన్నిసమస్యలయందు ఉత్సాహముతోను దీక్షతోను పాల్గొనుచుండుట మనము చూచుచున్నాము. భీమాప్రపంచమునందుకూడ కొంతమంది సోదరీమణులు-ఉత్తరహిందూస్థానమున, సిలానుప్రాంతములందు పెక్కండ్రు సోదరీమణులు-ప్రవేశించి కృషిచేయుచున్నను, ఈసందర్భమున మనకంతపరిచయములేమి, దీని నెరుగకున్నాము.

ఆలోచించి చూచినట్లయిన, భీమాసమస్యతో స్త్రీలకే ఎక్కువ సంబంధమేర్పడవలసియున్నది. ఉన్నతవిద్యలనభ్యసించి, విజ్ఞానవంతులై స్వతంత్రజీవనము చేయుచూ, కుటుంబపోషణభారమును మోతవహించుచున్నకాలమున, భీమాప్రపంచమున, మనస్త్రీలెన్నివిధముల ప్రవేశించవలసియున్నదియు మనము తప్పక గుర్తెరుగవలయును. లాహోరునందు, "భారత్" ఇన్సూర్యెన్సుకంపెనీయందు ప్రత్యేకస్త్రీశాఖనేర్పరచి కార్యదర్శినిగ పనిచేయుచున్న 'జగుత్షి' సతీమణి మనకు మార్గదర్శికురాలై యున్నది.

ఒకదేశముయొక్క వర్తకపారిశ్రామికాభివృద్ధికొరకు భీమాకంపెనీలసహాకారము ముఖ్యముగ నుండవలసియున్నదను విషయము మనము మరువతగినదికాదు. అమెరికాయందు 5,000 కోట్ల రూపాయలమొత్తము జీవితభీమాలయందున్నది. ఇంగ్లాండునందు 1,200 కోట్లున్నవి. హిందూదేశమందు 17 కోట్లు మాత్రమేయుండియున్నది. "34 కోట్ల ప్రజలున్నపుడు ఇంతస్వల్పమొత్తము జీవితభీమాకంపెనీలయందుండుట హాస్యాస్పదముగ నున్న"దని ఇందు భూషణసేనుగారు ఇండియన్ ఇన్సూర్యెన్సుకంపెనీఏజంట్ల కాన్ఫరెన్సునందు తమ అధ్యక్షోపన్యాసమునందు వ్రాక్రుచ్చియున్నారు.

భీమావ్యాపారము పెక్కువిధముల వర్తకసంబంధమైనదేయైనను, ఒకవిధముగా ప్రజాసేవకును, జాత్యుద్ధరణకును కూడ ఉపయోగపడుచున్నది. ఈసంగతి పెద్దలచే నిప్పుడే గమనించబడినది. మనముకూడ దానినిగుర్తెరిగి క్రియారూపమున పరిణమింపజేయవలయును. ప్రతిదేశముయొక్క జాతీయాభివృద్ధి ఐశ్వర్యముపైన నాధారపడియున్నది. పెద్ద మూలధనముకూర్చి దానిని ప్రజాసౌకర్యములకు, వర్తకమునకు, పరిశ్రమలకు వెచ్చించుట భీమాకంపెనీల మూలముననే సులభముగ జరుగగలదు.

భారతభీమాసంఘములు, (ఇండియన్ లైఫు అస్యూరెన్సుకంపెనీలు) స్త్రీలను సాధారణముగా చేర్చుకొనుటలేదు. కొన్నికంపెనీలు చేర్చుకొనుచున్నను ప్రసవసమయమందు జరుగే అపాయములనష్టముకొరకు అదనపుప్రీమియములు స్త్రీలకు పుచ్చుకొనుచున్నవి. పాశ్చాత్యదేశములం దీవిషయము పరిశోధనగావింపబడి చర్చింపబడి భీమాచేయునపుడు పురు

షునిజీవితమున కెంతఅపాయముకలదో స్త్రీజీవితముకూడ అంతేఅపాయము కలదని ధృవపరుచబడినది. స్త్రీలే పురుషులకన్న ఎక్కువకాలము జీవించుచున్నట్లు ఆపరిశోధకులు అభిప్రాయములు వెలిబుచ్చియున్నారు. తదనుగుణ్యముగ యునైటెడ్ స్టేట్సు జర్మనీఇంగ్లాండుల యందు స్త్రీలకును పురుషులతో సమానమైనరేట్లను ఏర్పాటుచేసి సమానసౌకర్యములనిచ్చి భీమాచేయించుకొనుచున్నారు.

భారతదేశమున ఈసమస్య పరిష్కరింపబడకపోయినను మనవితంతువుల ఆయుఃప్రమాణము దీర్ఘమనుట నిర్వివాదాంశము. వివాహితలగు స్త్రీల జీవితము అపాయమునకు గురియైనదనినప్పటికి, వితంతువులే మనకెక్కువమందియున్నందున ఈనష్టము పరిహారముకాగలదు.

భీమాచేయుటయందుగల లాభములు మనస్త్రీలు గమనింపలేకపోవుటయేకాక పురుషులుగూడ గుర్తెరుగకున్నారు. "నాభార్యకేమి ఉద్యోగములేదు. ఆమె యింటివద్ద సురక్షితముగ నుండును. ఆమె భీమాచేయవలసిన అవసరములే" దని పురుషుడు తలంచుచున్నాడే కాని, అపాయమనునది స్త్రీకిని పురుషునికిని సమానమేయని గమనించుటలేదు. స్వతంత్రజీవనము చేయుచున్న స్త్రీలు భీమాయొక్క అవసరమును తదనుగుణ్యమగు లాభములను కనిపెట్టి, తమజీవితముల భీమాచేయుచున్నారు. సినీమానటీకులుగానున్న స్త్రీలు ఎక్కువగా భీమాచేయుచున్నారు. భీమాయందలి ప్రాముఖ్యాంశముల గ్రహించి, తమజీవితముల భీమాచేయుటయేకాక వీలైనవారందరు అర్హలైన జర్లుగను, ఏజంట్లుగను ప్రవేశించి మనస్త్రీల కుద్బోధన గావించగలందులకు కోరుచున్నాను. స్త్రీలకు నచ్చచెప్పుటకు స్త్రీలకే సమర్థతకలదు. వైద్యశాలలు విద్యాలయములే స్త్రీలకర్హమగు ప్రదేశములని ఎంచక ప్రతివ్యాపారములలోను నిస్సంకోచముగా మన సోదరీమణులు వీలైనంతవరకు పాల్గొనవలయును.

విద్యావతియు, ధనవతియునగు "అమ్ముస్వామినాధనుగారు" స్వదేశవస్తువస్త్రాగారము నడుపుచున్నారు. ఎంతమందియో విదుషీమణులగు కన్యలందు పనిచేయుచుండుట చూడ అహ్లాదకరముగనున్నది.

భారతదేశమునం దింతవరకు ఏభీమాకంపెనీచూపనట్టిఅపూర్వసాహసమును "డెక్కన్ ఇన్సూర్యెన్సుకంపెనీ" చూపి స్త్రీపురుషులకు సమానమైనరేట్లను, సమానమైన సౌకర్యములను ఒసగుచున్నది. స్త్రీశాఖను ప్రత్యేకముగా నేర్పాటుచేసి స్త్రీలచేనడిపించు నుద్దేశ్యముతో శ్రీ డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి, అమ్ముస్వామినాధను, రుక్మిణిలక్ష్మిపతిగార్లను అడ్వైజరీబోర్డుగా నేర్పాటుచేసియున్నది. వారును వారికుండియున్న వివిధసమస్యలతో బాటీ సమస్యకుకూడ ఆదరణచూపి ప్రోత్సాహించుచు సహకారము ఇచ్చుచున్నందులకు మేము వందనముల నిచ్చుచున్నాము. స్త్రీప్రపంచమం దీనూత్నసంస్థ తగురీతిని ఆదరింపబడునని నమ్ముచున్నాము. మనస్త్రీలందరు ఈకంపెనీయందు తమ జీవితముల భీమాచేసికొనుటయే

కాక, తగిన ప్రోత్సాహమునొసగి "జగతీ" సతీమణి మార్గమునను సరించి స్త్రీశాఖ నభివృద్ధి చెందించుటకు సాయపడగలరని ప్రార్థించుచున్నాను.

ఇప్పటి కీభీమాకంపెనీలో షుమారు 30 మంది స్త్రీలవరకు ఆర్గనైజర్లుగను, ఏజంట్లుగను పనిచేయుచు అన్నిపట్టణములలోను, గ్రామములలోను దీనిశాఖలను ఏర్పాటుజేసి యున్నారు. స్త్రీశాస్త్రరులే పరీక్షచేయుదురు. అందరికిని బోధపడగల సులభమగు తెనుగున ఉత్తరప్రత్యుత్తరములు జరుపబడుచు, తెనుగు వ్యవహారికభాషగ నేర్పడియున్నది. ఆంధ్ర సోదరీమణులందరు ఎట్టిసంకోచములేక దీనికే సర్వవిధములతోడ్పడి, పోషించి, పెంపొందించ గలందులకు ప్రార్థించుచున్నాను.

# మల్లికామధుకరము

మానినీమణీ! యీలతామందిరాగ్ర
మునఁ దనర్చెడునీమల్లెమొగ్గ నీవు
చూచితే? యిది యిప్పుడే సోయగముగ
విచ్చుచున్నది వాసనల్ వెల్లివిరియ.

దీనిశుభాకారంబును
దీనిసువాసనయు దీనితెల్లదనంబున్
దీనిసుకుమారతయుఁ గనఁ
గా నెంతయు హృదయరంజకము సుమ్మి సఖి!

కలదు సంపంగి; కలదు చెంగలువపూవు;
గలదు విరజాజి; చేమంతి గలదు; బంతి
గలదు; మఱి యెన్ని యోపూలు గలవు గాని
దీని కాపూవులన్నియుఁ దీసికట్టు.

ఇట్టిసమ్మోహకతగల్గి యెసఁగుచుండుఁ
గావునన దీని సస్త్రమ్ముగాధరించి
స్త్రీపురుషచిత్తములు చెదాచెదలుచేసి
మూఁడుజగముల నలనుండు మోహపెట్టు.

మందపవమానచలితగుల్మమ్ముమీఁద
వరలు పచ్చనిమృదుపల్లవములనడుమ
నీలమణిమధ్యమునయందు నెలవుకొనిన
వజ్రకళికకు నిది యీడువచ్చుఁ గనుము.

దానిమరందముఁ ద్రావనో?
దానిపరిమళముఁజూచి తనివొందఁగనో?
దానిదళమ్ములఁ దాఁగం
గానో యల్లదిగో నళి యొకం డరుదెంచెన్.

ఇటునటును బచ్చపచ్చనియిగురుటాకు
మధ్యమునఁ దెల్లతెల్లనిమల్లెమొగ్గ
కొట్టకొన నల్ల నల్లనికోదమతేఁటి
చూడు మీసోయగము దివ్యసుందరాంగి!

పల్లవయుగమ్ముతో దీని గిల్లితెచ్చి
నిగనిగలమించు నీకచనీరదమునఁ
దాల్ప ముచ్చటపడుచున్నదాన వేమొ?
వలదు నీవట్లు సేయఁగా వలదుసుమ్ము.

రవలుచెక్కిన నీనాగరమ్ముకన్న
నిద్ది యెుకక్రొత్తచెలువమ్మునీయవచ్చు
నడిమిరేకులు బాగుగావిడువనిమ్ము
కోసికొని కొప్పులో గ్రుచ్చుకొందుగాని.

పదములాఱును మోపిమోపకయె వ్రాలి
పట్టిపట్టని పూదేనె నట్టెత్రావి
యిదిగో! తిన్నగ నీమోముకేసి వెడలె
నద్దిరా! గండుదుమ్మెదయాగడంబు.

# షికారు

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

"ఏమండీ మతిషికారు తీసికెళ్ళితే నలుగురూ నవ్వుతారంటారుగదా అకాస్తుర్లగారు రోజూ పెళ్లాంతోనే వెడతారే? నవ్వరేంఎవ్వరూను?"

"ఆయనకు కారుఉందిగనక వెడతారు."

"బాగుంది కారుకీ షికారుకీ సంబంధ మేమిటి?."

"ఎవరన్నా నవ్వితే డ్రైవరు దబదబాపోనిస్తాడు. అందుకోసం ఎవరునవ్వేది తెలియదన్నమాట."

"ఇది మరీబాగుందిలెండి, ఎవరన్నా నవ్వేప్పుడే అతడు తొందరగాతోలుతాడాయేమిటి? అయినా ఆవిడసాయంత్రం ఎప్పుడో పొద్దుకూకేప్పుడు మొగుడుతో వెడుతుందిగదా మలీపూలేమో పొద్దున్నే విచ్చుతాయూరొను. అయితే ఆవిడపెట్టుకున్నపూలు అచ్చు అప్పుడేవిచ్చినవాటిమో స్తరుగా ఉంటాయే-కాస్తేనా వలిగేనాఉండవే మతి?"

"ఆవిడ జాగ్రత్తపడుతుంది. పొద్దున్నేకోసి నలక్కుండాదాచి షికారుకోసమని అట్టే పెట్టుకుంటుంది."

"ఎంతభద్రంగాఉంచుకున్నా కాస్తేనా వాడైనా ఉండవారేమిటి మతీను."

"అయితే అవి గుడ్డపూలు. బజార్లో అల్లాంటివి అమ్ముతారు."

"మతి వాసన ఏలావస్తుంది?."

"ఏంవాసనలేకపోతే యేం ఆవిడకు."

"ఆవిడకేమిటి, మొన్న నేను చూస్తేనే. ఎంత మంచివాసన వేశాయనుకున్నారు?"

"ఏసెంటో రాసిఉంటుంది ఆగుడ్డపూలకే."

"సెంటువాసనా గులాబీపూలవాసనా అంత తెలియదనుకున్నారాయేం?"

"గులాబీసెంటని ఓటిఉంటుందిలే. అది అచ్చు వాసనే-మతిపాపం నీవు పల్లెటూరిదానివి. నీకేం తెలుస్తుంది.?"

"మహాబస్తీవారు ఎల్లాగైతేనేం పాపం- పోనీ పల్లెటూరని ఆక్షేపించకపోతే బస్తీగొప్పలు చూపించరాదూ."

"ఉందూమతి, మొన్న నేగావస్తివి. అప్పుడే మొగుడూపెళ్ళాం కారులో షికారుకుపోవడం మాశావుగా."

"సరేగాని నేనూ షికారుకు పోవాలనిఉందండి, ఒక్కమాటు తీసుకెళ్ళుదురూ."

"నాతోనే షికారుకు- అదోఊరనుకున్నావా?"

"మహాగొప్ప, ఏ మీ రెం ర గ న ను కు న్నా రు గాబోలు. పోనీలెండి ఏదోటిగాని ఓమాటు తీసుకెళ్ళుదురూ."

"మతీనువ్వు ఆడదానివిగదా నీకు సిగ్గుండదూ నాతో వచ్చేందుకు?."

"సిగ్గేమిటి ఇదేంపల్లెటూరా ఏమన్నా నా?. బస్తీలో సిగ్గులూ బిడియాలూ ఉండగూడదంటారుగా."

"నాకు సిగ్గుగాఉంటుంది, నేరాను."

"పోనీలెండి. ఏదోటి తీసికెళ్ళకుండా ఉండేందుకు."

"అల్లాఅలిగితేగాదు మతి. నీకు తెలియకన్నా తెలియాలి. నేచెపితే వినన్నా వినాలి. రెండులేకుంటే ఎలా. అల్లాఅయితే తీసుకెడతాలే. ఎవరోరు సర్దుకోకపోతే మతి సంసారంలో ఉన్న ఇద్దరమూ చెరోదిక్కు-అయితే నవ్వులపాలేగా- మాకుసెలవున్నరోజు వెడదాంలే."

ఈఊళ్ళో మా డేక్ళనుంచీ మేష్టరీచేస్తున్నా హోటల్లో తింటూండమేగాని సంసారంఅనేదిలేదు. ఈయేడే కొత్తకాపరం. అసలు అమ్మాయి పచ్చిపల్లెటూరిది. ఎలాఉంటుందో ఆలోచించండి. నాజూకూ అదీఅలాఉంచండి. ఓ తెలివితేటల్లోనైనా పూర్ణాను స్వారమే- అయితే మహాగడుసుదానిలాగ ప్రశ్నలు వేస్తుంది. పాపం పల్లెటూరిపిల్లగదాఅని ఏమైనా చూపించి నాగరికత నేర్పుదామనుకుంటే వింటేనా?

ఓనాడు మాఊళ్ళో రాజాగారి ఏనుగు అలా మా గుమ్మంలోంచే వెడుతూంటే ఏనుగంటే ఏమిటో పాపం చూపిద్దామని నేను తొందరగావచ్చి అదిగో ఏనుగు అని చెప్పితే పోనీ లెండి అని మెల్లిగా అంది- ఇంతనా అదుర్దాకూ కత్తిపీటమీదనుంచి తరిగే వంకాయనన్నా ఆపలేదు- పోనీ ఏనుగంటే ఏచీపురు కట్టో అనుకుందిగాబోలు పెట్టెలాగులది అనుకుని దానినివర్ణించి ఎంతో వింతగా నాకవిత్వమంతా ఉపయోగించి చెప్పితే ఓచలనమన్నా లేకుండా "అయితే ఆరాజాగారు అంతఏనుగనీ ఊరికేవదలిపెట్టకపోతే ఓపెద్దబండీచేయించి దాంట్లో వెడుతూండగూడదు రోజూను?" అని ప్రశ్నలుప్రారంభించింది- ఇంకా పైగా ఆయన్ని ఒంటెగుఱ్ఱం లాగలేదనో మరి దర్జాకో రెండుగుఱ్ఱాలబండీమీద వెడతాడులెండి- అవి ముసిలివిట- మహాయిది గుఱ్ఱాల మొఖం చూసినట్టే ప్రశ్నలు- ఇదొక్కటే గాదునుమండి. రోజూఅన్నిటికీయింతే. మొన్నటికి మొన్న పుష్కరాలక్కాబోలు విమానం ఓటి మాయింటిమీదనుంచే పైగా పెద్దమోతతో అందరూ హడిలిపొయ్యేట్టుపోతూంటే ఊళ్ళోయింటిల్లిపాదీ చిన్నాపెద్దా ఆడామొగలేకుండా వచ్చారు. తనపాటితను కంచంకడుగుతూంది. గుమ్మందగ్గరకేనా రాలేదు- మాయింటిపక్కన ఓబూబూలయిల్లుంది- వాళ్ళకి గోషాగా. అయినా ఆబూబూ పాపం ఆవిమానదర్శనోత్సాహంలో గోషాగీషా మరిచి పులును కలేబెడుతున్నదిగాబోలు ఆ తెడ్డుతోనే పాపం బయటికొచ్చి పైనసోరు తెరిచి చూచిచూచి అదికనబడకండా వెళ్ళాకే యింట్లోకివెళ్ళింది- అంతఅదుర్దా యింతమందికీఉంటే తను బైటికన్నా రాదే. చెముడనుకుంటారేమో. పాము చెవులునుమండీమళ్ళీను. ఇల్లాఉంటే ఏమిటిఇంకా బస్తీసంగతులుచూపడం- ఇల్లాంటిమనిషి ఉంటుందనుకుంటామా?

సినిమాఅంటే ఏమిటో ఎరగదుగా అని పోనీ ఓరోజూచూపిద్దామని "రేపుసినిమాకు పోదామా?" అన్నా.

"అంటే"

"అక్కడ బొమ్మలూ అవీ చూపుతారు. బాగా ఉంటుందిలే-"

"బొమ్మలాటావద్దు గురుగులాటావద్దు. నేను నిద్ర ఆపుకోలేను. మాఊళ్ళోకూడా మాఅమ్మావాళ్ళే వెళ్ళేవాళ్ళుగాని ఒక్కనాడన్నా నేవెళ్ళలేదు-"

పాపం పల్లెటూళ్ళల్లో తోలుబొమ్మల్లాంటిదనుకున్నది-ఆనిశ్చితాన్ని పోగొట్టి- కాదని ఒప్పించేందుకు తాతలేదిగిరావాలి- అసలు సినిమా నాకూబాగుండదు- ఏదోదాంట్లో నాకోస్నేహితుడున్నాడు. డబ్బు లేకుండాచెళ్ళొచ్చుగా. ఏంతోచకపోతే సినిమాకు పోవడం మామూలు ఇదివరకు- సరిగ్గా ఆనాడే ఆస్నేహితుడు ఇంటికిరావడం,ఆయన మమ్మల్నిద్దరినీ ఆహ్వానించేడు. ఆరోజు కొత్తఆట మంచిదీఅని- లేకపోతే అసలు ఈప్రసక్తేఉండేదికాదు- నాకింకో భయం తీరామాచి ఆనందిస్తుందేమో అని తిప్పికళ్ళి ఆ స్త్రీలకు ప్రత్యేకస్థలంలో దీన్నికూడా కూచోబెడతాననుకోండి- ఈఊళ్ళోసినిమాలో ఎప్పుడూ యుద్ధాలే చూపిస్తారు. అదోఅలవాటు ఈ ఊరు సినిమాకు వాళ్ళూవాళ్ళూ అగుడ్డతెరమీద కత్తులుతిప్పి పొడుచుకుంటూంటే తనమీదికొక్కడవస్తారో అని బిగ్గరిగా అరుస్తుందేమో అల్లరిపాలు అనినాభయం-

ఆసినీమామిత్రుడు వెళ్ళాకే నేను సినిమాప్రస్తావన తెచ్చాను. తను రావంటె రానంది ఆబొమ్మలాటకి.

"అయితే ఆయనెవరండీ"అని అడిగింది.

"ఈఊరే. ఓపెద్దమనిషి."

"అంటేఆయనా మేష్టరేనా?"

ఆసలుఆయనకేం ఉద్యోగంలేదు. లేదని చెప్పితే ఊరికే ఎందుకున్నాడు. అదీఇదీ ఓలక్షప్రశ్నలు. కొద్దిలోముగిద్దామనుకొని ఆయన సినిమాలో ఉంటారన్నాను.

"అయితే రోజూబొమ్మలని ఆయనేఆడిస్తూంటారా?"

వేగలేకదాంతో అవునన్నాను.

"ఉహూఁ ఇంకేంబొమ్మలాళ్ళూ చెంచులాళ్ళూ నా మీసావాసం" అని యీసడించింది. దీనిమాటల్లో లెఖ్ఖా అనుకుని ఊరుకున్నాను. అయితే "ఇల్లాఅల్లా

అనకూడదు. ఆయనగొప్ప జమీందార"ని మాత్రం చెప్పాను. ఏంలాభం? తనుఓటి అనుకుంటే అదిశిలాక్షరం. దాన్ని తుడువాలంటే ఓ ప్రళయం.

ఇంతకూ సినిమాఅంటే తోలుబొమ్మలాట అనే నిశ్చయంతో రానంటూన్నదని యేదో గమ్మతుచేసి ఒప్పించి ఓరోజు తీసికెళ్ళాను.

ఆ సినిమాలో హార్మోనియం వాయించేవాడు ఎప్పుడేనాపాడుతూంటాడు. ఆ పాటకందరూ నవ్వుతూనే ఉంటారు. అయితేనేం ఆహార్మోనీయం మోతలోనూ అతడిపెద్దగొంతులోనూ సభ్యులనవ్వు లీనమైపోతూంది. మేము సినిమాకువెళ్ళినరోజున అతడు చాలాసార్లు పాడాలసివచ్చింది. దాంతో ఇక తప్పకుండా తోలుబొమ్మలాటే అని నిశ్చయంచేసుకుంది. ఇంటికిరాగానే "సినీమా, సినీమా"అని దశాయిస్తారేం వెధవతోలుబొమ్మలాటచూసి. హాయిగా నిద్రోయేదాన్ని. ఇకను చస్తే మీమాటలు నమ్మను బాబూ" అని అంది. దీనిమాటలకేం పాపం పల్లెటిదిక్కు అమాయకురాలని అనుకుని ఊరుకున్నాను.

ఇంతకూషికారుకు పోదామని పట్టుపట్టింది. అది ఏమిటో అనుకుంటుంది. అక్కడ చాలామంది షేరంటానికి వచ్చినట్లుగా ఉంటుందనుకున్నదిగాని ఇల్లూ పనీపాటూలేనివాళ్ళు ఇంతకాఫీతాగి ఏపంపులచెరువు గట్టునో కూనురాగాలు తీనుకుంటూ కూచోడమని తెలిస్తే నాతోవస్తానంటుందా, తనేనాపోతానంటుందా? పాపం ప్రశ్నలు ఏదోగొడవగా వెయ్యడమేగాని నిజానికి అమాయకురాలు. అసలు ఈఅమాయి కంగడునులేనమేమో అనుకున్నాను మొదట. వరీక్షిద్దామని ఓరోజువాకన్నం పెట్టాకనుంచుంది. నీవూ పెట్టుకోఅన్నాను. పెట్టుకున్నది. నాతోపాటు తింటున్నది. అయినాచూద్దామని "నాపళ్ళెం నేనే కడుక్కుంటాను, నీకంచంనీవుకడుక్కో"అన్నాను. సరే లెండిఅన్నది. నేముందుతినివచ్చాను. తనుతిని తనకంచం కడుక్కునివచ్చింది. నాదెందుకు కడగలేదంటే మీదిమీరే కడుక్కుంటానన్నారుగా పోనీ నన్నే కడగమంటే కడుగుతానంది. చూశారా నేకడగమనాలిట. పోనీ నేనేదో అలాఅంటే ఏదోమొగవాణ్ణిగా తిన్నపళ్ళెంకూడా ఎల్లాకడుక్కోను ఇంట్లో ధర్మదాసిఉంటూంటే? తనుమర్యాదాకైనా నేనే కడుగుతాలెండి అని అనదేంఅనుకున్నాను. పోయి నేనేకడుక్కున్నాను. తనుచూస్తూ వడుకునిఉంది. ఎంతోకోపమొచ్చింది. కాని యేంచెయ్యను నేనే తెచ్చిపెట్టుకున్నదాయెను. అదేసమాధానం చెప్పుకుని ఊరుకున్నాను.

ఇదీ అమాయకంపరస. ఇల్లాంటిఅమాయకంతో వేగలేకపోతున్నాను. రోజూగుమ్మంలోంచే సినీమా బండి పోతూంటుందా అమాత్రం తెలుసుకోలేదూ. "ఏమండీ యీఊళ్ళో రోజూ పెళ్ళేఅవుతూంటుందే" అని తీరిగ్గా ప్రశ్న వేస్తుంది. మాయింటిపక్కన శర్మగారు ఆదేదో దేశంవెళ్ళి సంగీతం నేర్చుకొచ్చారు. ఇదో పెద్దగాధలెండి. ఆయనసర్దాగాకొత్తగనక ఎప్పుడూ బిగ్గరగాపాడుతూండడం అలవాటు. అది మా వీథిలో ప్రతీవాళ్ళకీ తెలుసు. తనూఆపాటి గ్రహించాలా? "అబ్బ పాడుగ్రామఫోను ఎప్పుడూ ఆపిచ్చి ప్లేటే వేస్తారేమిటండి ఏంబాగుందని"అని నన్నడుగుతుంది. అది పిచ్చిప్లేటుట. సంగీతం ఎలాంటిదో తను నిజంగా ఎరిగేఉండదు. ఆవాళ్ళదగ్గరకూడా యిలాగే అంటుందేమో పిచ్చగా ఏమనుకుంటారో అని నా భయం. చెప్పకుంటే నవ్వుతారుగాని నాతలనెంప్రదుకలన్నిఉన్నవిరోజూ యిల్లా చేసేపనులు, వేసేప్రశ్నలూను. ఎంతోవినుకు నాకు. తను పట్టిందేపట్టు. చెప్పితే నూదిమొనవానీనా వినదు. నాకర్థంగాకుండాఉంది యీకాపురం.

ఇంతకూ ఇప్పుడు పట్టుదల తను నాతోషికారుకు పోవాలని. అసలు తనకీపడం ఎలా తెలిసింది? ఆశాస్త్రుల్లు గారు రోజూభార్యతో కారుమీద మాగుమ్మంలోంచే వెడతారు. అదిచూసిందిగాబోలును పక్కింటివాళ్లని అడిగిఉంటుంది. వాళ్ళుచెప్పిఉంటారు. తనుపోనీ పూర్తిగానన్నా తెలుసుకోరాదూ? ఏమనుకున్నదంటే షికారుఅనేది ఊరనీ దాంలో ఏదోతమాషా ఉండితీరాలనీ అనుకుంది. లేకపోతే ఈయన రోజూ

నాలుగ్గంటలకే భార్యతోకూడా అంతతొందరగా ఎందుకువెడతారు? అని సందేహం.

నేనిదివరకు ఉండేయిల్లు పసరుకోనేరుదగ్గిర. ఆ యింటి ఆమెపేరు సుబ్బమ్మగారు. ఆవిడ "ఏమండీ మీభార్యను తీసుకురండీ" అని ఎంతో అప్యాయనంగా రోజూ చెబుతూండేది. అప్పుడు నేచెప్పాను. ఆ అమ్మాయి పిచ్చిది. చదువూఅవీరావు. ఏమీ తెలీదు అని. దాంతో నేనేమో అబద్ధంచెప్పుతున్నానని తప్పకుండా చూడాలనే కోరికను ఎక్కువచేసుకుని రోజూ అడుగుతూండేది. ఎప్పుడేనా ఇదివచ్చాక ఆవిడను పిలుద్దామనుకున్నాను. రేపనీ ఎల్లుండిఅనీ రోజులు నెట్టుతూండగానే తను షికారు తీసుకువెళ్ళమని గోలెడుతుంది. ఏమనిదీంతో ఆపంపులుచెరువుదాకా సాయంత్రం వెళ్ళను? ఆశాస్త్రుల్లగారిలాంటి ఉదార బుద్ధి ఉండాలిగా. షికారు అనేపదానికి తనుఎల్లాంటి అర్థంతీసుకుందో నేనూ గ్రహించాను. అందుకోసం ఓరోజు శనివారంనాడు పొద్దున్నే సుబ్బమ్మగారింటికివెళ్ళి మేము సాయంత్రంవస్తామండి నాలుగ్గంటల కన్నాను. ఆవిడ పాపం ఎంతోసంతోషించి వాళ్ళ శ్రీరామమూర్తితోపాటు నాకూ ఇంతకాఫీయిచ్చి "పదిగంటలకే మీరిద్దరూ భోజనాలకూడారండి. సాయంత్రందాకాఉండి వెళ్ళుదురుగాని" అని బతిమాలుకుంది. నాకు ఇష్టంలేదు తను అంతకంటె ఒప్పుకోదు అని చెప్పివచ్చాను. ఇంటికివచ్చి "నాలుగ్గంటలకల్లా షికారుకుపోదాము తయారుగాఉండు" అన్నాను. నిజమేనా అని కళ్ళువిప్పింది. "పాపం మళ్లీ వెంటనేరావాలి అక్కడఉండొద్దు" అని చెప్పింది. షికారుఅంటే అర్థంతెలిసిందైతే యిలాఅంటుందా? అక్కడఉండడమేమిటి దీనితలకాయఅని నాలో నేనే అనుకున్నాను. పాపంరాత్రివంట మూడుగంటల నుంచే మొదలెట్టింది. శర్మగారుపంపిన ఆవకాయ చాల్లెండి కూరలేకపోతేమానె అని క్షమాపణకోరింది.

నాలుగువేసింది గడియారం. బయలుదేరాము. ఏమీ పెద్ద డాబుచీరెలూ అవీకట్టుకోలా అసలుంటెనా? పోనీకొనమనీ అడగదు. సుబ్బమ్మగారిల్లు ఓఅరమైలుఉంది. నడిచిపోవడం అందులో ముందు నేనూ వెనకతనూను.

సుబ్బమ్మగారు సగౌరవంగా ఎదురువచ్చింది. చేయిపట్టుకు ఇంట్లోకితీసికెళ్ళింది. ఏటో అవీ ఇవీ పలహారాలు చేసి ఉంచింది. పొద్దునచెప్పేగా సాయంత్రంవస్తామని. ఇద్దరంతిన్నాము. ఆవిడఏవో ప్రశ్నలువేసింది దీన్ని. తనేమీమాట్లాడలేదు పాపం రక్షించింది. నాలాగే ఆవిడనుకూడా ప్రశ్నలువేయలేదు బతికాను అనుకున్నాను. అన్నిటికీ నేనే సమాధానంచెప్పి దానికి కొత్తండీఅన్నాను. "అవును పాపంచిన్నపిల్ల" అని ఆవిడానవ్వుతూ అనుకుంది.

బయలుదేరాం మళ్ళీ స్వగృహానికి. దోవలోఅంది గదా "ఏమండీ ఆశాస్త్రుల్లగారు పెళ్ళాంతోరాలేదేం ఇవ్వేళ" అని. "వీథిలో మాట్లాడకు నాతో" అని కొంచెంవిసుగుతో అన్నాను. తనకోర్కె నెరవేర్చానుగా ఆసంతోషంలో పాపం ఆయన్నువిసిగించకూడదనుకుంది గాబోలు మళ్ళీమాట్లాడలా.

మళ్ళీయింతవరకూ షికారుకుపోదామని అనలేదు. పాపం షికారంటే అదేఅని ఇప్పటికీనమ్మకమే.

## మాయమ్మమోము

పి. వి. సుబ్బారావుగారు

అన్నింటికంటె మహాద్భుతంబై చిత్ర
మైన ప్రకృతిఁగన హర్షమొదవు
తీయనిపండ్లు పానీయంబులను ద్రావు
నప్పు డత్యధికమౌ హర్షమొదవు
మకరందమునుఁబోలె మాధుర్యమునుచిమ్ము
నమలకావ్యముఁ జూడహర్షమొదవు
తన శేముషియు విద్యయును గని తండ్రి 'హా
య'ని మెచ్చుకొనువేళ హర్షమొదవు
గాని శాంతిరసమున కాకరము మోద
మునకు తావు హృదయవికసనపు నిధియు
నైన మాయమ్మమోమును గానగలుగు
హర్షమున కెద్దిసాటి యీయవనియందు.

# హృదయజ్యోతి

తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారు

యువతీ! దేనికోసము అత్యాశతో ఆరాటపడుతున్నావు?

ఈమృగతృష్ణలో ఏపదచిహ్నములకోసము వెదకుతున్నావు?

అనిమిషాంగనవలె రెప్పవాల్చకుండా ఆత్రములో ఏమధురగానము కోసము నిరీక్షిస్తున్నావు?

ఈకుసుమమాల ఎవరికోసం గూర్చావు?

ఆతణ్ణి ఎప్పటివలె ఆరాధించుటకా?

ద్వారము తెరచినావు. మందిరములో నిజ్యోతి కాంతివంతముగ ప్రకాశిస్తూన్నది.

అతను వచ్చునపుడు స్వాగతమిచ్చుటకా?

నిశీధములో నిరీక్షణము ఎవరికొరకు?

చంచలనేత్రాలలో నుంచి ప్రతిఫలాపేక్షా, ఆశా, ద్యోతకమౌతూయున్నవి.

అతనికోసమా? ఆశ.

*   *   *

ఈవేడినిట్టూర్పులు ఎందుకు వెళ్ళబుచ్చెదవు?

ఒకింత యాలస్యముకూడ సహించలేవా?

హృదయతంత్రులు త్రెళ్లునట్లుగా విలపింతువు?

అతడు రాగలడా?

నీహృదయములోని జ్యోతిని వెలిగించినాడు.

కృతకృత్యుడై నందుకు సంతోషమున వెళ్ళాడు.

ఎచ్చటని అన్వేషించెదవు?

హృదయభారములను ఉపశమింప జేయడానికి ఎచ్చటికో వెళ్ళేడు.

నీహృదయంలో వెలిగించబడిన జ్యోతిని ఒకమారు పరిశీలించుము.

అక్కడనే ఆతణ్ణి దర్శించగలుగుదువు?

# సంగీతము

శ్రీమతి కల్వాల పార్వతీకుమారి గారు

సంగీత మన నభిరుచి లేనివారెవరు? అందును భరతఖండమున నుద్భవిల్లినవారికి హిందూజాతిధర్మము తెచ్చుకొనవలసినఁ బైటవస్తువుకాదు. స్వరాజ్యము నాజన్మహక్కని సర్వజనమాన్యుఁడు గాంధిమహాత్ముఁడు వచించె. అట్లే సంగీతము నాజన్మహక్కని యేభారతీయుఁడైనను ధారాళముగవచించవచ్చును. ఆబాలగోపాలమునకు సంగీత మన సంతసమెక్కుడు గానుండును. తల్లిపాలులేనిది పిల్లకు నిదుర రాదు. పిల్లనగ్రోవిలేనిది గొల్లవానికిఁ బ్రొద్దుపోదు. జీవితములోని ప్రతికార్యమునందును సంగీతమును మనయంత దృఢముగా మేళవించినవారే దేశమందును యేజాతియందును సామాన్యముగానుండఁజాలరు. మనపూర్వులకు దీనిని స్మరించి యుపన్యసించుటంతగా తెలియదు. కాని పాటయందు ప్రజలకు వీడరానియభిమానము నభిరుచిగల్గించు విషయమున వారు సాధించినంతపని మన మెట్టిసభలను దినమున కొకతూరి జరిపినను సాధింపగలమాయని సందియము. ఆసేతుహిమాచలపర్యంతము హిందువులందరును శుభకర్మలు సంగీతముతో నాచరింతురు. సంగీతముతో భగవద్భజనఁజేయుదురు. ఇతరులకు నీతివైరాగ్యవిషయములను సంగీతముతో నుపదేశింతురు. సంగీతములోఁ జదువుదురు. సంగీతముతోఁ దమతమ జాతిపనులఁ జేయుదురు. సంగీతముతో బేరమాడుదురు. సంగీతముతో బిచ్చమెత్తుదురు. మనకేకాదు ప్రపంచమునకు ప్రథమవాఙ్మయమగు వేదము పాడఁదగినది. ద్విజులు శుభాశుభ కర్మలయందు పాడకఁదప్పదు. సామవేదము గానరూపమే. భగవంతుఁడు సామగానప్రియుఁడు కావుననే వేదములలో నెల్ల నయ్యది శ్రేష్ఠమైనది. పెండ్లిపేరంటములయందు ముందుగా ముత్తైదువలు పాటలనుబాడి వధూవరులను లోనికిబోనిత్తురు. నాలుగు మంగళహారతులైనను రాని స్త్రీలు నలువురిలోఁ గూర్చుండుటకే లజ్జింతురు. "మద్భక్తాయత్ర గాయన్తి తత్ర తిష్ఠామి నారద"యని భగవానుఁడు చెప్పినాఁడు. పాటలేనిది తనకు తృప్తికాదని చెప్పినాఁడు. భజనాదులు చేయుట మనకెల్లరకు విదితమేగదా. శ్రీకృష్ణభగవానుఁడు కురుక్షేత్ర సంగ్రామమున నర్జునున కుపదేశించిన యోగవిద్యకు యుక్తయనక యుపదిష్టయనక పురాణమనక శ్రుతియనక గీతయని పేరిడినాడు. ఇదియే హరికథలు మొదలగు నుపదేశవిద్యలను గానప్రధానముగాఁ జేసినది. మన కాదికావ్యరత్నమగు శ్రీరామాయణమునురచించిన వాల్మీకి దానిని లోకమునకు వినిపించువేళ తన ముసలి కంఠముతోఁ జదివినచో సారస్యముండదనితలచి కుశలవుల కోమలపికకంఠములతో గానముఁజేయించినాఁడు. స్వభావానుగుణమగు రాగములతో కావ్యనాటకాదులఁజదువుట యొకవిద్య. తుదకు వీథిబడియందు సైతము బాలికాబాలు రొకవిధమైనరాగముతో చదువుచుందురు. సంగీతవాసనలేని శాస్త్రము శ్రాద్ధమంత్రము వంటిది. లోకప్రసిద్ధమగు కాశ్మీర శేలువుల నేతపని పాటపాడనిది జరుగదట. అంతదూరమేల? పిండివిసరునపుడుగాని, వడ్లు దంపునపుడుగాని, రాట్నం వడుకునపుడుగాని సంగీతము తాండవమాడదా? నాట్ల, కోతలు సమయమున సంగీతము మూర్తీభవించదా? నిత్యకర్మలఁజేయు కృషికునికష్టముల మఱపించునది సంగీతమే. రైల్వేస్టేషనులలో సామానులుమోయు కూలీ, సిగరెట్టుచుట్టలనమ్ము సాహేబు, కాఫీటీనమ్ము మంగుళూరియాచారి, పరిమళద్రవ్యములనమ్మువారలు సంగీతరసలహరీనిమగ్నమూర్తులు. వీథులయందు కాయగూరలనమ్ము కాపుకలకంఠుల రాగమువిననివారుందురా? భిక్షాన్నబ్రహ్మచారి, నిత్యయాత్రచేయు నిరుద్యోగమనుష్యుఁడు, భూతభవిష్యత్తులఁజెప్పు బుడబుక్కలవాఁడు, తందనాలదాసరులు, కుంటపక్షి మొదలగు పరతంత్రజీవులకు సంగీతమే ప్రాణాధారముగదా. అన్ని దేశములయందును యాచనావృత్తిదుస్సహమని నిర్మూలించుచుండగా మన దేశమందుమాత్ర మదియుండుటకు ప్రబలమగుకారణము హైందవుల సంగీతరసాస్వాదనమనుట కిసుమంతయు సందియముండదు. సంగీతంచ సాహిత్యంచ సరస్వత్యాః కుచద్వయం. దేవగంధర్వయక్షదాసాదులచేత సంగీతము ముఖ్యముగా పరిగణింపబడుట గ్రంథావలోకనమున మనకు కానబడుచున్నది.

# కడుపుతీపు

కాశిరాజు రామమోహనశర్మగారు

౧

నాగృహోద్యానవాటికాంతరమునందు
విచ్చినది యెన్నడో మాధవీలతిక సు
మత్రయంబు దళము దళమందున నును
లేతచిరునవ్వులు పులకరించువాని.

౨

అది యమావాస్య. దిశలెల్ల నంధకార
బంధురమ్ములు. గగనసీమంతినీ వి
నీలకుంతలచ్ఛాయలో నిల్చినది ల
తాంగి పూవుకూతుంద్ర ముద్దాడికొనుచు.

౩

అపుడు పెనుగాలివీవ భయంకరముగ
చిమ్మచీకట్ల తెరల రచించినట్టి
భయదమృత్యుమూర్తులవోలె వరలుచుండె
భీకరానిలుచేబడ్డ వృక్షరాజి.

౪

ప్రబల ఝంఝామరుత్ప్రదభంజనమున
నేలపై రాలిపోయె నాపూలనొకటి.
పొంగి పొరలు దుఃఖమ్ము నాపుకొనలేక
జల్లుమనిరాల్చు కన్నీటిఝరులవోలె
రాల్చె మాధవీలతిక పత్రములనెల్ల.

౫

శ్రావ్యమోహన మధురప్రసన్నమైన    అంతకంతకు రుద్ధమైనట్టి రుతిని
గళమునెత్తి పాడెడి పికాంగనయొకర్తు    కడుపుతీపుభరింప శక్యమ్మె యను
శాంతముగపాడె నొండు విషాదగీతి.

౬

కుమిలికుమిలి నాలోన నే క్రుంగిపోతి.




## డి. ఆర్. ముత్తులక్ష్మి

ఈమె డిండిగల్‌లో సెప్టెంబరు 1908 లో జననమొందెను. పసితనమునుంచియు ఈమెకు సంగీతమునిన బహు అభిలాషకలదు. ఈమె యభిలాషను చూచి యీమెతల్లి యొకయుపాధ్యాయుని సంగీతము చెప్పుటకు నియమించెను. సంగీతమందు మెచ్చుభిలాషగలిగియుండుటచేత ఆయుపాధ్యాయునికివచ్చిన విద్యనంతయును ఈమె తన మాతృగ్రాహిత్యమున నేర్చుకొనెను.

డిండిగల్‌లో మరి యీమెకు సంగీతముచెప్పు యుపాధ్యాయులు అప్పటికి లేకపోవుటచే, యీమెను యొకగొప్ప సంగీతప్రవీణురాలుగా చేయనెంచి, తలిదండ్రులు ఈమెతో సహా మధురకువేంచేసి యక్కడ నొకవిద్వాంసునకు ఒప్పజెప్పిరి. ఆయనదగ్గర విద్యలో బాగుగ తయారాయెను. ఈమె కంఠస్వరము బహు మృదువైనది.

ఇట్టిసమయములో నాగస్వరవాయిద్యమున మిక్కిలి పేరెన్నికవహించిన పున్నస్వామి పిళ్ళె యీమెయింటికివచ్చి యీమె సంగీతాభిలాషనెరింగినవాడై రాగాలాపనము కొన్ని కీర్తనములను చెప్పెను.

ఈమె పేరు వినినటువంటివాడై, పళనిస్వామి పిళ్ళె యనునాతడు యీమెయింటికివచ్చెను. ఈమె తలిదండ్రులుకూడ నీమెను నాటకములలోనటించుటకుపంపుటకు నిశ్చయించుకొనియుండిరి. అతడు వచ్చి కోరుటచే, నాటకములలో పాత్రలధరించుటకు పంపిరి. అతడు ముత్తులక్ష్మికి నాటకముల కనుకూలమగుపాటలను చెప్పించెను. అప్పటికి యీమెవయస్సు 16 ఏండ్లు. నాటకములలో ముఖ్యపాత్రధరించ సిద్ధపడియుండెను.

## యం. అప్పన్న, డి. వి. కృష్ణయ్యగార్లు

ఇట్టిసమయములలో నాటకములలో ముఖ్యపాత్రల ధరించుటయందు పేరెన్నికవహించిన వి. పి. జానకి యనునామె తనయొక్క నాటకసంఘముతో మధురకువచ్చెను. ముత్తులక్ష్మితలిదండ్రులు ముత్తులక్ష్మిని జానకియొద్దకు తీసుకొనిపోయిరి. ఆమె ముత్తులక్ష్మిని తనతో తీసుకొనిపోయి కొద్దికాలము తననాటకసంఘములోనుంచెను. అందులో ఈమె, యీమెకు యిచ్చినపాత్రలను అతిజాగ్రత్తగనటించెను. ఈమెయు నొకగొప్పనాటకపాత్రధారిణియనిమంచిపేర్వడసెను.

1923 లో కోదండపాణిపిళ్ళె మద్రాసులో గేండుథియేటరు (ప్రస్తుతము సినిమాసెంట్రల్) లో నాటకమున ఈమెకు కథానాయికపాత్రను యిచ్చెను. అదిమొదలు యీతనితో కథానాయికపాత్రలధరించుచు, మంచిస్నేహమునుసంపాదించి దక్షిణహిందూస్థాననాట్యరంగములందు గొప్ప పేరు గాంచి, ఆరుమాసము లాయనకంపెనీలో పనిచేసి తిరిగి మధురకువచ్చెను. మూడుఏండ్లు పనిపాటలు లేక యింటివద్ద నేయుండెను.

మునుస్వామిముదలియార్, పి.జి. వెంకటకృష్ణయ్య చెట్టియార్ మొదలగు ప్రముఖులచే 1926 సంవత్సరమునందు క్రొత్తగా కట్టబడిన ఎస్ప్లనేడుథియేటరు

(ఇప్పుడది కొన్ని మిలిటరీ అధారిటీలవలన తీసివేయబడినది.) నందు నటించుటకు ముత్తులక్ష్మిని ఆహ్వానించిరి. ఈమెయు దీనికంగీకరించి నెలకు 1200 రూపాయిల వేతనముపైని ప్రవేశించెను. ఈమెతో ప్రధానపాత్రధారుడైనటించువాతడు వి. యస్. సుందరేశ్వరయ్యరు. ఇప్పటికికూడ నీమెనటించుచున్న మాట్లాడుఫిల్ములలో ప్రధానపాత్రధారుడుగనుండెను.

ఇట్టి సమయములో యస్. జి. కిట్టప్ప యను నాతడు కన్నయ్యకంపెనీలో పనిచేసి, అది పోవుటవలన తనంతటతానే, సుందరంబాళ్ యను నామెతో కలసి ఒకక్రొత్తనాటకకంపెనీని పెట్టుకొనెను. కాని కారణాంతరములచే సుందరంబాళ్ యాకంపెనీని విడిచిపెట్టెను. కిట్టప్ప తనతో సమముగా ప్రధానపాత్ర ధరించుటకు, స్త్రీరత్నము లేకపోవుటచే అట్టివారికై వెదకుచుండెను. ఆఖరుకు ముత్తులక్ష్మివద్దకువచ్చి యామెను తనకంపెనీలో చేర్చుకొని సేలంలో ననేకనాటకముల ప్రదర్శించెను.

తరువాత ఆకంపెనీవిడిచిపెట్టి యెవరైన తన నాహ్వానించినయెడల వెళ్ళుచుండెడిది. ఇట్లు నటించి నాటకరంగమున, దక్షిణహిందూస్థానమున సాటిలేని పేరుగాంచెను. 1931 సంవత్సరములో మద్రాసునందు స్థాపింపబడిన కొలంబియాగ్రాంఫోనుకంపెనీవారు ముత్తులక్ష్మిపాటలను తీయుటకు నిశ్చయించిరి. దీనికిముఖ్యుడు ప్లాటు సంజీవరావు. మెసర్సు కిట్టప్ప, సుబ్బయ్యభాగవతర్, సుందరంబాళ్ మధురకు వెంచేసి, ముత్తులక్ష్మి పాడినపాటలనుతీయుటకు నామెను మద్రాసు గొనిపోయిరి.

ఈమె నాటకములలో ముఖ్యపాత్రధారిణియై నటించిన నాటకములు "చంద్రమతి," "నందనార్," "భారతి," "కుమారాస్వామి," "కోవలన్." వీటిలో మొదట చెప్పిన రెండునాటకములందును గొప్పగ నటించినది.

ప్రస్తుతము, ఈమె సాగరుఫిల్ముకంపెనీలో మాట్లాడుఫిల్ములలో నటించుటకు పోయియుండెను. ఈమె, యిదివరకు, యేఫిల్ములలోను నటించకపోయినను, తా నేపాత్రధారిణియైయుండునో తానే యామనిపించనుకొని, నటించుటయందు గొప్పచాకచక్యము గలిగియుండుటచే ఈమెకు మాట్లాడుఫిల్ములలో తావు దొరకెను.

ఈమెనటించిన మాట్లాడుఫిల్ములు (1) హరిశ్చంద్ర (2) గాలవ. ఇవి అరవములో మాట్లాడుఫిల్ములు.

---

పైమాసమున సినీమానటి మాధురీకన్యచరిత్ర ప్రచురింపబడును.

---

# మృత్యుదేవత

ఆదిపూడి సోమనాథరావుగారు

తలిరుప్రాయంపుటాసలు దళుకులొత్త
విచ్చువిరిమొగ్గవగిది జీవితము తనకుఁ
బ్రియతరమ్ముగ మదికిఁ గాన్పించువేళ
నెంత కష్టమ్ముగాఁదోఁచు మృత్యువన్న.
సమయ మనుకూలముగనుండి సలుపఁదగిన
పనులలోమున్గి ప్రేమానుబంధనములఁ
గట్టువడి వీడఁజాలని కాలమందు
నెంత ఘోరమ్ముగాఁదోఁచు మృత్యువన్న.
ఎల్లప్రేమానుబంధమ్ము లెడలిపోయి
యెల్లసఖు లొక్కరొక్కరే చెల్లిపోయి
వగచుటకుఁ గేవలము తానె మిగిలినప్పు
డెంత సులభముగాఁదోఁచు మృత్యువన్న.
అమలమౌ నంతరాత్మయు నచలభక్తి
గలిగి శాంతమ్ముగా నాత్మ వెలుఁగుచుండి
స్వర్గసుఖములు మతికిఁ గన్పడెడువేళ
నెంతయానందముగఁదోఁచు మృత్యువన్న.
ఉన్న యంగబలమ్మెల్ల నుడిగిపోయి
దృష్టి కనుమందమయి తన తెలివికున్న
మహిమలన్నియు మరపుచే మాయునపుడు
ఎంత యుపకారముగఁదోఁచు మృత్యువన్న.

# అభినందనము

హరి రాధాకృష్ణమూర్తిగారు

౧

తుది స్వాతంత్ర్యపదాభిలాషులగు యోధుల్ పోరు సంగ్రామ మి
య్యది; యిందున్ జోర మేటిపూరుషులు శంకావిష్టులౌచుంద్రు నీ
వుదితార్క ప్రతిభాసమానవయి యుద్యోగించినావింత నో
ముదితా! ధన్యవు నీదుజన్మ కడుసంపూజ్యంబు మాకెప్పుడున్.

౨

వైరులుసంగరంబునఁ బ్రపంచము నొక్కట నెత్తివచ్చినన్
బోరనగెల్వఁజాలు పరిపూర్ణులు; వారికి నున్న వెన్నియో
నారసముల్ ఫిరంగులు ఘనంబులుగా నవిలేక నీవు న
వ్వారలమారుకొంట పరిపంథుల యోటమియేమొ మానినీ!

౩

ఉబుసుదోరంగకే సుదతు లొద్దికఁబాయుదురంచు భీతిమై
యబలలటంచు పూరుషులహర్నిశముల్ వచియించుచుంద్రుగా
క, బయలుదేర పూరుషులొ కామినిలో బలహీను? లంతటన్
ప్రబలు నిజంబ. ఇట్టియుపపత్తికి హేతువదేమొ? మానినీ!

౪

కలకాలంబుననుండి యొక్కగతి నీకాయంబు క్లేశంబులన్
గలనై నన్ సహియింపరోసెడిది; ప్రక్రాంతక్రియానైపుణిన్
గల కష్టంబులనెల్ల నోర్చుచును నున్నావమ్మ నీవిప్పు డో
లలనా! యేటికిఁగల్గె నీతెగువ? సల్లాపింతువే మాదెసన్?

౫

వీరపత్నివి కాఁగోరి వెతలఁబడుదో?
వీరమాతవు కాఁగోరి వెఱ్ఱివాదో?
వానితో నేమి మాకుఁగావలయు? నీవు
వీరవనితవు మానమస్కారశతము.




### —పువ్వుపిండి వంట—

ఒకమానెడుబియ్యము నీళ్ళలో నానబోసిపడగట్టి, మెత్తనిపిండిగాకొట్టి ఆరనిచ్చి రెండుకొబ్బరికాయలు కొట్టి కోరినకోరును ఒకసోలడు మంచినీళ్ళలో బాగుగాకలిపి పిండగావచ్చిన తెల్లని నీటిపాలను ఆరబెట్టిన పిండిలోపోసి కలిపి వెలక్కాయంత వెన్న ముద్దకూడకలిపి, పాతికపంపు పంచదారనుకూడకలిపి, పిండిని బాగా పల్చగాచేసి, గులాబీగుత్తి (పువ్వుకోరము) అను పాకసామగ్రిచే గులాబీపువ్వును వండవలెను. వండువిధము బూరెలమూకుడులో ఒకశేరు నూనెపోసి దానిని బాగుగా కాచవలెను. కాగిన నూనెలో గులాబీగుత్తి (పువ్వుకోరము) ముంచి, వెంటనే పల్చగాచేసిన పిండిలో ముంచవలెను. అప్పుడు గులాబీగుత్తిని పల్చనిపిండి కొంచెము పట్టుకొనును. ఆగులాబీగుత్తిని తిరుగనూనెలో ముంచిన బూరెలమూకుడులో గులాబిపువ్వులాగున పువ్వురాలుచుండును. ఈవిధముగనే గులాబీగుత్తిని కాగిన నూనెలో ముంచుట, దానినిపల్చని పిండిలోముంచుట, దానిని తిరుగనూనెలోముంచుట చేయుచుండిన నూనెలో పువ్వులు రాలుచుండును. వాటిని కొద్దిగా దోరవేపువేగనిచ్చి పైకిచట్రముతో తీయవలెను. దీనినే గులాబీపువ్వని, పువ్వుపిండివంట అని అందురు. ఇది చాల ప్రశస్తమైనది. గులాబీగుత్తి (పువ్వుకోరము) అడుగుభాగమున పంచపాళికవలెనుండును పైభాగమున కొబ్బరికోరముకన్న విశేషములేదు.

—ఓలేటి రత్నవతి.

### —బొబ్బాసి కాయకూర—

ఇది పండ్లకొరకేకాక కూరకుకూడ నుపయోగించును. దీనిని పనసపొట్టువలె బాకుతో సరకి కడిగి పోపుబాగుగా వేయించి పోపులోవేసి ఆవాలు మన కిష్టమైనన్ని నూరి ఆముద్దను దానిలోవేసికలిపి పొయ్యిమీదనుంచి మగ్గి ఉడికినతరువాత తీసితినిన చాల బాగుండును. తెలియనివారికి పెట్టి ఏమికూరని అడిగిన పనసకాయ కూరనియందురు. లేనిచో పొట్టును ఉడకపెట్టి వార్చి పోపు బాగుగవేయించి ఆవనుకలిపి పోపులోవేయవలెను. రెండువిధములలోనూకూడ కొంచెము చింతపండుపులుసు వేయవలెను. మరొకవిధము: అరటికాయకూరవలె పెద్దముక్కలుగా తరిగి ఉడకనిచ్చి పులుసూ ఆవాపోసి పోపులోవేసినను బాగుండును. ఈకూరకు కొంచెము దోరగానున్నకాయ అయినచో నెంతయు బాగుండును. ఇది గుమ్మడికాయవలెతరిగి పులుసులోకికూడ ఉపయోగించుటకు వీలగును.

—కొలచన నరసమ్మ.

### —సాన్ జాన్ చేయువిధము—

అరపంపుమంచినేయిని బాణలిలోపోసి కాచవలెను. అందులో అరపడి గోధుమనూకనుపోసి మాడకుండా దోరగా ఇసుకరంగుగా వేయించవలెను. తర్వాత పొగలేని కుంపటిమీద ఒకపడినీళ్ళు కాగనిచ్చి ఆకాగిననీళ్ళలో ఈవేయించిననూకను పోయవలెను. కలియబెట్టి పదలంపంచదార ఏలకులపొడి 2 తులములు, నేతిలోవేయించిన జీడిపప్పుకాని తోలుదీసిన తియ్యబాదంపప్పుగాని 9 తులములువేసి అన్నము

వలె ఉడుకబెట్టవలెను. ఉడికిన తర్వాత కొద్దిగచల్లార నిచ్చి కమ్మనినేయి 1 చంపుపోసి కలియబెట్టిదింప వలెను. బాగుగ చల్లారినపిదప ఉపయోగించుకో వచ్చును.

## — కేసరి —

శేరుగోధుమరవ్వ తీసుకొనివచ్చి బూర్లిమూకుడుని ప్రొయ్యిమీదపెట్టి అందులో సవాశేరునెయ్యివేసి బాగామరగనిచ్చి, అందులో చంపుజీడిపప్పు, ద్రాక్ష పండు, చారపప్పువేసి బాగావేగినపిమ్మట శేరు గోధుమరవ్వ వేయవలెను. రవ్వవేగినపిమ్మట ½ శేరు పాలుపోసి అరపావునీళ్లుపోసి బాగాకలుపవలెను. బాగా ఉడికినపిమ్మట సవాశేరు పంచదార వేయ వలెను. కుంకుమపువ్వు కొంచమునీళ్ళలోకలిపి అం దులోవేసి బాగాకలియబెట్టి దింపవలెను.

## — అక్బర్ హల్వా —

పారపప్పు కర్బూజాపప్పు పెద్దదోసపప్పు చిన్న దోసపప్పు యివి ఒక్కొక్కటి అరపడి సిద్ధపర్చుకో వలెను. పొట్టుదీసి తియ్యబాదంపప్పు గసగసాలు 6 తులములు వీటిని ఆవుపాలతో మెత్తగా నూరవలెను. కలకండను అరచంపుదెచ్చి పాకముచేసి ముదురు పాకముకాకుండా చూచి యీనూరినముద్ద అందులో కలుపవలెను. 2 జొన్నులపన్నీరు కొద్దిగా కుంకుమ పువ్వు కొద్దిగా కస్తూరి ఒకవరహాయెత్తుచేర్చి బంగారు మన్నారేకులనుకూడా చేర్చవలెను. చేర్చి హల్వా తయారుచేసిన మిక్కిలి రుచిగనుండును.

## — జర్దా —

పచ్చిబియ్యమును సోలెడుతెచ్చి బాగుగాకడిగి పెట్టుకోవలెను. గిన్నెలో మంచిఅప్పాచక్కెర పదలంతెచ్చి 1 అరాకు నీళ్ళలోవేసి పాకముపట్ట వలెను. పావుతులం కాశ్మీరకుంకుమపువ్వు నూరియుంచ వలెను. అరచంపు మంచినేయిని గిన్నెలోపోసి లవంగ ములు, దాల్చినచెక్క, పెద్దజీలకఱ్ఱ, మరాటిమొగ్గలు, ఏలక్కాయలలోనిగింజలు, జాజికాయ, జాపత్రి, చలవమిరియాలు యివిఅన్నియు పొడిగాకొట్టి నేతిలో వేయవలెను. తర్వాత కుంకుమపువ్వు బియ్యమునకుసరి పడు మంచినీళ్ళు ఆనేతిలోపోసి చక్కగా పొంగ నిచ్చి అపుడు బియ్యము వేయవలెను. బియ్యముఉడికి నీరు ఇగిరినతర్వాత 1 అరగంటకు చారపప్పువేసి చక్కెరపాకముపోసి గింజలుతీసిన ద్రాక్షపండ్లు తియ్యబాదముపప్పువేసి కలిపి 5 నిమిషములు మరల పొయిమీదపెట్టిదింపుకొని తినవలెను.

## — జీరా —

3 తులముల మంచినేయిని ఒకబాణలిలోపోసి చక్కగాకాచవలెను. కాగినపిదప కాలుపడి గోధుమ నూకను దోరగావేయించవలెను. 1 పడిపాలను సన్న సెగనుకాచి పొంగువచ్చునప్పుడు వేయించిఉంచిన గోధుమరవ్వను దానిలోపోసి కలియబెట్టి 3 పొంగులు రాగానే ఏబులం తెల్లచక్కెర 1 చంపు గింజలుతీసిన ద్రాక్షపండ్లు 4 తులముల ఏలకులపొడి వేయవలెను. అటుతర్వాత 4 గురిగింజలయెత్తు కాశ్మీరకుంకుమ పువ్వును ఆవుపాలలోనూరి అందులోవేసి చక్కగా కలియబెట్టవలెను. 1 చంపు ప్రశస్తమైన నేయిపోసి గిన్నెను మూతికివాసెనగట్టి 5 నిమిషములుతాలి తిన వలెను. —సుసర్ల లక్ష్మీనరసమాంబ.

## — ములక్కాడల ఆవరసము —

అప్పుడేకోసినటువంటి పాతిక ములక్కాడలు తెచ్చి 2 అంగుళములపొడవైన ముక్కలుగా తరిగి ఉంచవలెను. 1 తులం ఆవాలు, 1 తులం బియ్యం, కొద్దిగా కొబ్బరికోరు, నూవులపప్పు, పసుపువేసిరుబ్బి ఒకపాత్రలో ఉంచవలెను. వేరొకపాత్రలో 2 తుల ములనేయివేసి, కాగినపిమ్మట 1 తులం మినపప్పు, పావుతులం ఆవాలు, అరతులం మిరపకాయముక్కలు ఇంగువవేసి బాగావేగినపిమ్మట 1 నేరు నీళ్లుపోయ వలెను. తరిగినటువంటిముక్కలు ఆనీళ్లలోవేయవలెను. ముక్కలు బాగాఉడికినపిమ్మట, రుబ్బిఉంచినముద్ద ఉప్పువేసి బాగాకలిపి దించవలెను. బహురుచిగా యుండును.

—బి. లక్ష్మీబాయమ్మ.

# స్వాగతము

శిరోమణి వారణాశి గంగాధరశాస్త్రిగారు

పరుల కుపకృతిసేయు సద్భావమరసి
ప్రజలసంతాపముడుప శాత్రవగణంబు
కడలకోనలంటఁదోలిన కాలమూర్తి!
స్వాగతము నీకుఁ గొనుము వర్షరురాజ!

క్రూరత్వంబున నెల్లలోకులను సంక్షోభంబు నొందించి, నో
రారం ద్రావుట కొక్క గ్రుక్కెడుదకం బైనం బ్రసాదింప కే
వారంబోయిన మాన్చు నామ్రకుని నిర్బంధించి తీవ్రంబుగా
ధారాపాతశరాళి ముంచితి మహాత్మా! నీకుఁ గేల్మోడ్చెదన్.

తరళవికాస విద్యుదసిధార శత్రులగీటడంచి భీ
కరభవదభ్రసద్భటనికాయము తీవ్రశతఘ్నిసంహతిన్
గుటికనియేసి, యార్చి, రిపుకోటినదల్చి, నిదాఘరాజుఁ బె
న్నురమున స్రుక్కఁజేసి, సకలోర్విని జీవములిచ్చి ప్రోవదే.

రోహిణిని నీదు మృగశిరుఁ
డాహవమునవెన్నుదన్ని యార్భటిమెఱయన్
దాహనమస్త్రము ఘనసం
దోహమునను బోలెఁ తొగరుత్రోలఁగి యడంగెన్.

జీవములనిచ్చుఘనుఁడవు
కావుననే చాతకాళి కడుముదమున నీ
త్రోవ కెదురేగి సౌహృద
భావముతో సరసరీతి పరలుచునుండున్.

# బంగారమా? బ్యాంకా?

శ్రీ వా. వేంకటరమణారావుగారు "హైందవ స్త్రీలు: ఆభరణములు" అను తమ వ్యాసశకలమున హైందవనారీమణులుకూడ ఆభరణాభిలాషయను యజ్ఞానమునుండి తొలంగి తమధనమును తమపేరనే బ్యాంకులలో వేసికొనినచో మంచిపనియని లోకమునకు చాటినారు. ఇటీవల బ్రహ్మశ్రీ పప్పు సూర్యనారాయణగారు ఆభరణములనే సమర్థించుచూ స్త్రీలను హెచ్చరించియున్నారు. వ్యాసకర్తలు, పాఠకమహాశయులు లేయని యసత్యముకంటె కఠినముగనుండు నిజస్థితినే ప్రేమించు పుణ్యమూర్తులను దృఢనమ్మకముతో బ్యాంకును సమర్థించుటకు మాకుగల కారణముల నీదిగువ వ్రాయుచున్నాము. పాఠకులామోదింతురుగాక! ఆడువారలకు తప్పక ఆభరణములుండవలెనని వాదించువారు మొదటనొసంగు కారణము మతవిషయమైనది. "కన్యాంసాలంకృతాం సాధ్వీం" యను సూత్రము నాధారము చేసికొనుచున్నారు. పైసూత్రము వివాహకాలమందు వాడబడెడిదని వేరేవ్రాయ నవసరములేదు. ఇందు "సాలంకృతాం" యను సమాసార్థము రెండువిధములుగ తీసుకవచ్చును. అందొకటి భౌతికము; రెండవది యాధ్యాత్మికము. 'బంగారము, వెండి మొదలగు లోహములచే చేయబడిన ఆభరణములు ధరించినటువంటి' యని భౌతిక యర్థము. ఇది సామాన్యులు తీసెడియర్థము. లోహములచే తయారుచేయబడిన నగలుధరించినపుడే "యలంకృత" శబ్దము సిద్ధిపొందనక్కరలేదు. హరినామచింతన క్రియాలోలుడగు ప్రహ్లాదుడు సాలంకృతుడు. అలంకృతియన్న నొకవ్యక్తికి మెరుగుపెట్టి రాణింపజేయుపదార్థము. సార్వభౌమతనూజుడగు ప్రహ్లాదుడు కోహినూరు వజ్రమును ధరింపకపోయినను-తనలోని విష్ణుభక్తియను సుగుణము నలంకారముగాజేసికొని- యలంకృతుడయ్యెను. "ఓహో! ఆడవాళ్ళనుగురించి మేమడుగుతే మొగాళ్ళ ఉదాహరణం ఏమిటంటారేమో? పతిమరణించినను, నిర్పేదయగు సత్యవంతునిపై ప్రేమత్యజింపక యాతనికై యముని యాచించిన సావిత్రిలోని సుగుణమామె కలంకారము. దానంజేసి యామె "సాలంకృత." ఆధ్యాత్మికార్థ మీరీతి నిట్టియెడల వర్తించును. ఈరెంటిలో నేది మిక్కిలి మంచియర్థమో యోచించి మనవిషయము నిర్ణయింతము. తండ్రి తన పుత్రికను పరాధీనము చేయునపుడు-తన పిల్లవయసున పిన్నయనియూ; సర్వసుగుణములను అలంకారముగ కలదనియూ; ఇంకను సుహృదయము కలదనియూ; వటుడు పరిగ్రహించుటకు తగినదనియూ చెప్పవనియే మానమ్మకము. అటులు యాధ్యాత్మికదృష్టితో కన్యయొక్క సుగుణసంపత్తులను తెల్పుచు, వటునికివచ్చి చెప్పి చేసిన కన్యాదానము మంచిదా? లేక "సాలంకృతాం" అని యున్నదిగాన తండ్రి కొన్నినగలుంచి, పిదప మామగారిచేకూడ కొన్నినగలుపెట్టించిచేసిన కన్యాదానము మంచిదా? మామగారిచేకూడ కొన్నినగలు పెట్టించినచో కన్యాదానఫలసిద్ధి యెక్కడిది? కాశీకిపోయే విద్యార్థి నిర్పేదయగువానికి తమకన్య నిప్పించుటకు పిలిపించి (ప్రయాణమాపి) వానికి పిల్లనిచ్చేటప్పుడు సదరుబ్రహ్మచారికి ధనమెక్కడిది? వానివద్ద కొంతధనముండుననియూ, వాడు తప్పక నగలుంచి వివాహమాడుననియూ నమ్మకము మనకుంటే యీకాశీప్రయాణ మంత్రంలోని నిజస్థితి కప్పిపుచ్చడం ఎందుకు? మనకు మరింత భోజనాలాలస్యం అవడానికే? అంతేకాక కేవలం నగలు పెట్టించే కన్యాదాత "దశపూర్వేషాం దశాపరేషాం" అను సూత్రానుసరణంగా నెక్కడ గడచినట్లు? తన 20 తరముల వారిని తరింపజేయుటకు బదులు 20 తులముల బంగారము కన్యకిప్పించి యామె నమ్ముచున్నాడు. ఇది నరమాంసవర్తకమునకు దగ్గరదైనది!! 20 తరములవారి స్వర్గలోకమార్గమునకు మధ్యనొక వైతరణీనదియైనది. కాబట్టి వేదభూమియగు హిందూదేశమునగల మతగ్రంథములలో, వైవాహికకర్మలలో

ఇంతటి స్వల్పాభిప్రాయముగల సూత్రములుండ నేరవు. 'జపంబిడిచి లొట్టలో పడ్డట్టు' సూత్రముల యథార్థమగు వరమును గణింపక మన వారు తప్పు త్రోవ త్రొక్కుట యుత్కృష్టమగు పని కాదు. లేదా "సాలంకృతాం" అనేదానికి భౌతికమందలి బంగారు నగలనే యర్థమే మనవారు తీసికొంటారనికట్టండి. అట్లయినచో యీ వ్యవహారమెంత సాక్షులతో కూడిన కోర్టుకై ఫిర్యాదుక్రింద తేలును. అలంకారములు కూడగల మాపిల్లను నీకిచ్చుచున్నా"మని. అట్లయినచో యీ యాచారము తొలగింపబడినపుడు యీ సూత్రము స్వచ్ఛమగు దేవభాషలో మన మతగురువుల చేత మంచి రోజుచూచి మార్పించుకోవచ్చును. సూత్రము లుమార్చడమా అని చెవులుమూసుకోకండి! సూత్రమునకుగల యుత్తమయర్థమును తప్పుగ గ్రహించి దాని నాచారముగ చేసికొను దురలవాటుకంటె దానిని మార్చుకొని దోషరహితులమగుట మంచిదని. కాని యింతటి ప్రమాదమగు మార్పు లవసరము లేదు. "సాలంకృతాం" యనగా పైనిచెప్పిన యాధ్యాత్మికయర్థము సరిపోవును. ఈ దారపంతులగు మన పూర్వపు మతగురువుల యుద్దేశ్యమదియే. ప్రస్తుతవివాదకు ఘాటుగ నుండు సంస్కృతసూత్రములనెదకి కొందరు మతప్రవాహమునకు కంసాలి వీకేకుతాతకు ముడివేసేరు! ఆముడి జారుగా ఉంది. తెగిపోయింది. ఈ అలంకారేచ్ఛలిచ్చి యిప్పించడం కేవలం లౌకికధర్మం. ఇందు రెండువిషయములున్నవి. (1) ఆర్థికచింత (2) సంఘములో తమ గొప్పతనం వెల్లడిచేయుట. పూర్వము నుండి నేటివరకు మన హైందవస్త్రీ పురుషుని పోషణలో నున్నది. ఆపురుషుడు సుగుణసంపత్తికలవాడై ధనార్జనాపరుడై, యాయురారోగ్యవంతుడైనచో ఆమె జీవితము సరిగ నడచును. లేక నడిమి కాలముననే యవాంతరము వాటిల్లినచో యామె జీవితము దుర్గతిపాలై, యున్నవస్త్రములకు కడుంగడు క్రమ చేరుచున్నది. ఈసంగతిని పెద్దలాలోచించి యట్టి దుస్థితి దైవికముగ ఘటిల్లినపుడు "వాజి" యని చెప్పుకొని పరాధీనముకాకుండ స్త్రీ తాను జీవించుటకు జీవనోపాధి చేసియున్నారు. అట్టి సందర్భమున ఏ 20 తులాల బంగారమో పెండ్లికాలమందు పెట్టించి, దానిని చంటనరగదీయించి, తీరా పని వచ్చినప్పుడమ్మితే అసలులో మూడోవంతు వెలతెచ్చుకొనుటకంటె ఆధనమును తొలినుండి బ్యాంకులో వృద్ధికివేసి స్త్రీయొక్క యార్థికపరిస్థితిని మనము బాగుచేసినవారమగుదున్నాము. ఇందుకూడా విశేషముకలదు. ఈ స్త్రీల ప్రత్యేకనిధులేర్పరచుటలో తారతమ్యమును చూపినారు. ఏలనన ఒక బహుధనవంతుని భార్య, పతిమరణించిన యనంతరము-తన పూర్వసుఖానుభవకాలమందుండెడు యౌన్నత్యమునుండి యొక్కసారి క్రింద పెట్టున పడకుండ యామె హోదాకుపలయు ధనముండునట్లు యామె కక్కువనగలను కోరుచున్నారు. లేనిచో పై "సాలంకృతాం" అన్న సూత్రానుసరణంగా తప్పక బంగారునగకావాలంటేబీదలు, ధనికులు ఒకపావుతులం చుట్టుపెట్టి కార్యంనిర్వర్తించ కూడదూ? అది అలంకారమనిపించుకుంటుంది; అలాచెయ్యరు: ఏలనన వారి యాశయము స్త్రీప్రత్యేక నిధిని పెంపొందించుట. సంఘములో తమ గొప్పతనమును చాటుట. ఒకావిడ:-మీపిల్లకెన్ని తులాలు పెట్టేరు పిన్నీ? రెండోఆవిడ:-కట్టకానుల పేరు జగినీగొలుసు చేయించేరు. ఒకావిడ:-మాఅన్నయ్యగారి పూర్ణకు 30 తులాల వడ్డాణం, 20 తులాలకంటె, 12 తులాల జిగినీతోడ్తోనే యిచ్చేసేరు. లేకపోతే మాపటన కుంకంబరిణ పట్టుగొనంది.—ఇటువంటి సంభాషణలు మనకు రోజూతెలుస్తున్నా యికదా యిళ్ళలో. వీటినిబట్టిచూస్తే సంఘంలో యిదో దురాచారం. దీనిని తొలగించడానికి ప్రయత్నించాలి. దీనికి మారుగా కలిగినంతమట్టుకు వాయిదాలచొప్పున స్త్రీలపేర బ్యాంకులో ధనమువేసి వారి యార్థికపరిస్థితి బాగుచెయ్యాలి. "వద్దికంటె ఊరగాయ ఘనం" అన్నట్లు చేయించేనగమీద మజూరిక్రింద మనం వ్యయపరిచే ధనానికి మేరయున్నదా?. దీనివల్ల ప్రయోజనం ఏమి? అలంకారమునకు అందమునకు ఏమి సంబంధం? బంగారునగలుంచుకొనినగాని

సౌందర్యము లేదనుట యొకతప్పు. మన కవులుకూడ స్త్రీవర్ణన ఘట్టములయందు, స్త్రీయొక్క సహజ సౌందర్యములకు ప్రాముఖ్యతనొసంగి వాటిని వర్ణించిరి గాని యీనగల యూసెత్తరేదే? జగన్మాతయు, జగన్మోహినియునగు సీతామహాదేవికిగల సౌందర్యము వడ్డాణం పెట్టుకొన్న తాటకకు లభించునా? సర్వేశ్వరుడొసంగిన యంగసౌష్టవముకలిగి, సుగుణములతోను, విద్యాధనములతోను ప్రకాశించు స్త్రీని ధర్మపత్నిగా తీసికొనిన పురుషునకున్న యిహపర సౌఖ్యములు—వస్తుతారీఖు నాటిమధ్యాహ్నం గవర్నమెంటుముద్దర గల పెద్దకాసు భార్యకు ధనమునిచ్చుకొనిన పతికి కల్గునా? విద్యావతులగు సోదరీమణులు బాగుగనిందలి నిజమును గుర్తెరింగి, మాయభిప్రాయముతో నేకీభవించి, యజ్ఞానులగు కొందరు సోదరీమణులను యీభూషణాభిలాషయను తృష్ణనుండి తొలగించినచో మన దేశపు యార్థికస్థితి యెంతబాగుండును? దాన మన నాగరికత యెంత వృద్ధిచెందును? స్త్రీ సహజ సౌందర్యవంతురాలు కానిచో నగలుపెట్టినచో ఆమెకు సౌందర్యము హెచ్చునా? శరీరమునుపట్టి నగ రాణించుట మనము నిత్యము కనుచున్నాము. నగను పట్టి శరీరము రాణించుటకల్ల. రెండువిషయాలూ మన స్వానుభవంలోనివే! ఇంతకూ సౌందర్యమునుసొక శారీరవిషయమున కంత మెక్కుడిది? దీనికొల్పుట కవకాశమేది? నగవల్ల సౌందర్యము వృద్ధికానేరదని వ్రాయుచూ, మావ్యాసము చదువువారు తమాహంశములను యోజింతురని వేడుచున్నాము. సర్వేశ్వరుడు సృష్టించిన స్త్రీపురుషులకుగల సౌందర్యమునకు ప్రాముఖ్యతనొసంగి దంపతులు సంచరించుట మిక్కిలి ఉత్తమము. మనకు కావలసినది సుగుణసంపత్తి. ఇట్టిసుగుణములు మానవహృదయమునుండి రావలెను. పైనున్న ధారుగల్లీవల్ల కలుగనేరవు.

"చేతులకు తొడవుదానము
భూతలనాథులకు తొడవు బొంకమి ధరలో
నీతియె తొడ వెవ్వానికి
నాతికి మానంబె తొడవు నయముగ సుమతీ!"

నిలువుటద్దములో చూచుకొనుటకంటె స్త్రీలు తమ హృదయములోనికి చూచుకొనిన మేలు. హృదయమున రెండు ప్రతిమలు సహృదయులగు స్త్రీలకు కనబడును. (1) నగలీయనిదే తమకరుణకు పాత్రుడు కాజాలడని నుడివిన పురుగల భర్త ప్రతిమ. (2) స్వర్గీయభూముల సృష్టింపబడిన ప్రేమామృతమును భర్తకోరినతోడనే యాతనికొసంగి, యాతనిపాదసేవ చేయ నాతడానందాంబుధి నీదులాడు ప్రతిమ. ఈ రెంటిలో మీకే ప్రతిమ యిష్టమో దానినే స్వీకరింపుడు—దాని నిమిత్తమే పాటుపడుడు—నగలున్న కొండు మీఅందము హెచ్చును. నగలుతీసినచో మీసౌందర్యము తగ్గునని వ్రాయుట నరకులు చెలామణీ యగుటకు వర్తకులనుమాట. వారు Advertisement లో ఒక నిలువుటద్దం కూడా పెడతారు.

—వడ్లమాని అప్పారావు.

౨

బంగారమునకా? బ్యాంకునకా? మీవోటుఅనగా నావోటు రెంటికిని పంచియిచ్చెదను. ఏలనన రెండును స్త్రీల కుపయుక్తములగునవియే. శ్రీ చిప్ప సూర్యనారాయణరావుగారు వ్రాసినట్లు పాశ్చాత్యనాగరికత నించుక మరచి ఆభరణములధరించి అద్దమున దమప్రతిబింబమును చూచుకొనినచో నిజమునకదియే రమణీయముగనుండును. ఆభరణము లెవ్వియు లేకున్న స్త్రీ మూర్తి కందమేలేదు. అట్లని తమకున్న ఆస్తినెల్ల రవ్వలకు, రాళ్లకు వెచ్చించి వేలకువేలు సొమ్ముల నొడలిపై నెక్కించుకొని తిరుగుట నింద్యమగునని. సాధారణముగ ధనవంతులగు వారి వారీమణులు 1000 రూప్యముల విలువగల భూషణములను, తదితరులు తమకున్నంతలో కొలదిగను ఆభరణములు ధరించి మిక్కుంగల ధనము బ్యాంకిలో వేసికొన్నట్లు తమ మైనపని. తమకుగల ధనమంతయు నగలరూపమున చేయించినప్పుడు పడరాని యిక్కట్టులకుల్లోను గావలసివచ్చును. కనుక ప్రతి స్త్రీయును తనకున్నంతలో కొలదిగ నగలను చేయించుకొని తన సౌందర్యమును పెంపొందించుకొనవలెను. అట్లుగాక బ్యాంకు

ద్రులను, పిదప పతిని బంగారముకొరకు వేధించు అతివలు తెలివితక్కువ వారనుట నిక్కము. ఎప్పటికిని కొంత వస్తురూపకమున మరి కొంత ధనరూపమున నున్నచో మంచిది. ఏదియైన ఆపదవచ్చి ధనమావశ్యకమైనప్పుడు చటాలున బ్యాంకిలోనుండి తీసికొనవచ్చును. వస్తువునప్పుడు అమ్ముటకష్టము.

—తాయి రత్నమాల.

౩

బంగారమా? బ్యాంకా? అనువిషయమున శ్రీపప్పు సూర్యనారాయణగారు సమర్థించినబంగారమే సరియైనదని తోచుచున్నది. కారణమేమన, భారతనారీమణుల కలంకారములు నగలే. పుట్టినింటివారును మెట్టినింటివారును పెట్టవలసిన విధాయకము ప్రకారము అనాదిగావచ్చుచున్న ఈఆచారము యెవరును మానజాలరు. ఒకప్పుడు నగలు బదులు నగదే వారు ఇచ్చినయెడల ఎంత బ్యాంకిలోనుంచినను అది నిలువజాలదు. సంసారములో అనేకములగు కష్టసుఖములకు ధనమే మూలము. దాన వారియొద్దనుండెడి ధనరూపముగానున్న ఈసొమ్ము దినదినము వ్యయముకాసాగును. అదియే నగలరూపముగానున్న యెంతకష్టములకోర్చినను తమ అభరణములదీయ సాహసింపదు హైందవస్త్రీ. కాన అలంకారములనియోజించినను బంగారమునకే స్థానమివ్వవచ్చును. లేదా తనుయాస్తిగా భావించినను నగలే కలకాలముండగలధనము. కనుక యేనారీమణియు ఆభరణములవిషయమై పక్షపాతబుద్ధిగలదైయుండునని నాయుద్దేశము.

—సామినేని హనుమాయమ్మ.

౪

బంగారమా? బ్యాంకా? అనువిషయమున నా ఓటును బంగారమునకేఇచ్చుచున్నాను. బ్యాంకులో డబ్బును దాచిపెట్టిన ఉన్నవారనుభవింతురు. తాను మాత్రము దీపపుపెమ్మవలెనుండుటగదా లాభము. స్త్రీకి అలంకారమే ఆభరణములు. శృంగారమంతయు స్త్రీకి నగలలోనేగలదు. ఇదియునుంగాక ఒక యాత్రవెళ్ళినచో, పైకముకావలసిన నచ్చట ఆ నగలనమ్మి సుఖప్రయాణము చేయవచ్చును. బ్యాంకులోనున్నచో రాతలు, పూతలు యెంతరో కాలహరణమగును. స్త్రీ లాభరణములనుధరింపక పోయినచో విశ్వబ్రాహ్మణుల చేతిపనులవృద్ధియెట్లు? హిందూదేశమున నవనాగరకమున కలవాటుపడి పురాతనరాటపరిశ్రమ నీస్త్రీలెట్లంతరింపకేసిరో అట్లే నీ విశ్వకర్మల పనిపాట లంతరించుటకుకూడ స్త్రీలే కారణభూతులగుదురు. స్త్రీవద్దనున్న సొమ్ములన్నియు భర్తసహితము స్త్రీఇష్టములేనిదే ముట్టుకొనుటకు (స్త్రీధనము) అధికారములేదని చట్టమున్నదిగదా? ఇంత కట్టుదిట్టముగుబ్యాంకు, స్వాతంత్ర్యముగు బ్యాంకునువదలి ఇతర బ్యాంకులలోవేసికొనుట యెంతయు సమంజసముగాదు.

—అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మ.

౫

“బంగారమా? బ్యాంకా” అను పప్పు సూర్యనారాయణగారి అభిప్రాయములో మాఓటుబంగారమునకే ఇచ్చియున్నాము. కారణాంతరములచే దివాలాతీయసమర్థతగల బ్యాంకులందుచాటకవు. నగలుపోయిన ఏమిచేసెదగసెదరవా? వాటియజమానుల జాగ్రతాజాగ్రత్తలలో అనిక్షేపమిమిడియున్నది. కాబట్టి బైటయున్న రెండుపక్షులతో చేతిలోయున్న ఒక్కపిట్టసమానము చేటుకానికి. అరెంటికొరకాసించిన చేతిలోదిపోవును. స్వేచ్ఛగల బైటరెండుపిట్టలు పారిపోవును. అట్లే వడ్డీకాసించి స్త్రీలకలంకారములై నిధిరూపకములగు నగలను పరిత్యజించుట అవివేకము. స్త్రీదత్తమైనధనము సొఖ్యరూపకముగా గాని భూగృహరూపకముగాని ఉన్నవారసుల చేతులకు(పుత్రులకుగాని) లభ్యమగును. వస్తురూపక ధనమొక్కటియే స్వాధీనస్వానుభవసత్వాధికారముల కనుకూలించును. వస్తురూపకధనమున్న స్త్రీలకే అవాంతరములువచ్చినా నిలువబడగలరు. లేనివారు అనగా అజ్ఞానముచే నగలమ్మివడ్డీకివేసికొని భూమిపుత్రులు స్వాధీనముచెందక



శ్రీమతి
బేతా సీతమాంబగారు
'కైక విజ్ఞప్తి' అని ఈమె వ్రాసిన
పద్యవ్యాసము స్థలాంతరమున ముద్రితము.





శ్రీమతి
వై. లక్ష్మీసుందరమణిగారు
పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుపట్టణ
వాసిని. విద్యావతి.



అమ్మోయ్, మరేం!

ఈ ఆకస్మికఛాయాచిత్రము శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తిగారు గుంటూరునుంచిపంపినది. ఆదర్శకభూమిక పల్లెటిగృహము. అలంకారసమయమున అబ్బాయివచ్చి అల్లరిమాటలాడుచు అపల్లెటిగృహమునందలి ప్రశాంతతకు, ఆఅలంకారసమయపుగభీరతకు కొంతభంగపాటు గలిగించుచున్నాడు.

ఈరోజువరకు గౌరవకాలక్షేపము చేసికొనిన స్త్రీనిధి పళ్ళెము మరువాడే వంటమనిషి క్రిందనో నీళ్ళబింది మోసుకొనియో జీవితము గడుపుచుండిన కాంతల నెందరినో గాంచుచున్నాము. నగలున్న అవి కొన్ని విక్రయించి జీవితావశేషము సుఖముగాగడుపుకొనును కదా? కన్యాదానసమయమున జనకుడిచ్చిన ఆభరణములను సప్తపదిసమయమున మామాగారిచ్చిన నగలను స్త్రీకి సర్వాధికారమగును. అందుకనే స్త్రీకి (హిందూస్త్రీకి) పుట్టింట అత్తింటకూడా వారసత్వపుహక్కులేని మనదేశస్త్రీల కీనిధి కలిగియున్నదని మాఅభిప్రాయము.

—అచంట సత్యవతమ్మ.

౬

బంగారమా? బ్యాంకా? ఇది నిర్వివాదాంశము. మానవతీమానసములను పరీక్షించుటయందించుకైనా అనుభవము కలవారి కీసందేహముండదు. హైందవ స్త్రీలలో పాశ్చాత్యనాగరికతా నిమగ్నులైన వారిలో సహితము నూటికొక్కరుతప్ప తక్కినవారేరును కంఠమందు బొందిలో మాంగళ్యములను, చేతికి రబ్బరుగాజులను ధరించి తమ యాభరణముల నమ్మికొని యాక్రయధనమును తమపేర బ్యాంకులలో నిలువచేసికొనుట కిచ్చగింపరని నాఅభిప్రాయము. ఇందుకు కారణము ఆభరణములు అందమునకాధారభూతములు. సువర్ణవికారములైన ఆభరణములు ఆరోగ్యకరములు. ఆభరణములు లక్ష్మీప్రదములు.

—కే. నాగమణి.

౭

పుష్పచయమునందలి బంగారమా? బ్యాంకా అను వ్యాసములోని అభిప్రాయముతో నే నేకీభవింతును. స్త్రీల ఆయురారోగ్యములకుతగినది బంగారమేగాని బ్యాంకుకాదు. నారీరత్నములకు, తలిదండ్రులు ధనరూపముగానిచ్చిన ముఖ్యముగా మూడుకష్టములకు గురికావలసివచ్చును. (1) ఎక్కువవడ్డీకి యేగృహస్తునకోయిచ్చిన ఆగృహస్తు అసలుయిచ్చుటేకష్టము. పోనీ యిచ్చినాఅంటే వడ్డీతగ్గకపోతే ముఖముముందర తిట్టియో, చాటునతిట్టియో విధిలేక యిచ్చెదరు. (2) హిందూదేశమున పురుషులకు ఉద్యోగములుతక్కువ. ఉన్నప్పటికి ఉద్యోగిగృహము నిర్వాహారుని గృహము ధనమునకు ఒక్కరూపమున నేయున్నది. ఇటువంటి ధనాభావములలో స్త్రీకి నగలేమైనా ఉన్నరోజుల కుదువపెట్టిచేయు ఈసంసారములకు బ్యాంకులోని స్త్రీధనమును నిలువనిచ్చెదరా? గుడిని మ్రింగువానికి గుళ్లో దేవుడడ్డునా? పోనీ పురుషులా ధనముముట్టరన్న కళ్ళముందు యెన్ని బ్యాంకులు అంతరించుట లేదు. (3) అతివలకు ఆభరణములు ఆరోగ్యసాధనములనిగదా మనువు మొదలు మహాఋషులవరకు నిర్ణయించిరి. సౌందర్యపోషణకు అలంకారములే ఆలవాలములు. అన్నినగలు పెడితే అమ్మన్న యేమీలేకపోతే తిమ్మన్న అని మనవాళ్లు సామెతవాడెదరు. కనుక ఆకారణముచేతనే రామకృష్ణాదిపురుషదేవతలకుకూడా మనవాళ్లు అలంకరించెదరు. కనుక తల్లులారా! నగలరూపమునయుండుటే స్త్రీలకు శ్రేష్టము. ఇంతకూ హిందూమాతలకు మోక్షము నగలవల్ల రాదు. ధనమువల్ల రాదు. పతిభక్తియే ఆమెకు పెట్టనిభూషణము. సుగుణపుంజములే ఆమెకు చక్కదనము. ఎంత బంగారము యెన్ని దేశములకుపోయినను హైందవ స్త్రీఆభరణములవల్లనే ఇంకా మిగిలినది.

—దామోజీపురపు లక్ష్మీనరసమ్మ.

౮

బంగారమా? బ్యాంకా? బంగారమునకే మావోటును ఇచ్చుచున్నాము. బ్యాంకుపద్ధతిని, స్త్రీలకు కొంతపెన్నిధిసమకూర్ప నూహించినచో, ఆభరణములుగ నుంచుపద్ధతి మిగుల అపాయకరమును, అస్థిరమునై యున్నది. స్త్రీలకు మూలధనము కూర్చుటయే అభిప్రాయమైనచో, యిట్టి అవివేకపద్ధతి నవలంబించి యుండరు. ఆభరణములు అందమునకు కాక వేఱొండుకార్యమునకని యేస్త్రీయనగలదు? పాశ్చాత్యపుగాలి సోకిన యిప్పటికాలపు మనము, ఒక పాశ్చా

త్యుడు పరిహాసమునకు పల్కిన వాక్యమును, వేద వాక్కుగ నమ్మి, హిందూస్త్రీలు, నడచకల్లు బ్యాంకులని సమర్థింపబూనుకొనుచున్నాము. ఇట్టి ఊహాలు కేవలము ఆర్థికవ్యామోహమున మునిగి తేలుచున్న పాశ్చాత్యులకు చెల్లునుగాని, మన హిందువులకు చెల్లవు.

—జంపాల జగన్నాధరావు.

౬

'సాలంకృతాం' అనగా 'అలంకారముతో కూడుకొనిన' అని యర్థము. అలంకారమనగా సువర్ణపుయాభరణములను భావము కాదు. మానవతులకు సుగుణములే యలంకారము. పవిత్రమైన హృదయమే యలంకారము. సుగుణములను యాభరణ సహితులై యుండవలెనని భావముకాని బంగారపు ఆభరణములు ధరించవలెనని భావముకాదు. "సుగుణ సంపదలేని సుదతి చక్కదనమ్ము తంతులులేని సుతారు వినుము" అనునట్లు మణిమయనిర్మితమైన యలంకారములుధరించినను, రంభ, ఊర్వశి, తిలోత్తమ మొదలగు దేవతాప్సరసలనుమించిన సౌందర్యవతియైనను సుగుణసంపత్తిలేని మానవతీమణికి యాభరణములు శోభనిచ్చునా? మహాపతివ్రతాశిరోమణులగు అనసూయ, సావిత్రి, దమయంతి మొదలగువారు ఆభరణములు ధరించనంతమాత్రమున వారిసౌందర్యమునకు లోటుగలుగునా? లేక ఒక వికలాంగములుగల స్త్రీ వజ్రఖచితమైననగలను ధరించినంతమాత్రమున సహజ సౌందర్యవతియగునా? "స్త్రీణాం పతిరేవదైవతం" అను నార్యోక్తిని మనఃపూర్వకముగా ఆచరించుట యందు ఆసక్తిగల సాధ్వీమణులకు బంగారేల? అలంకారములేల? మరియును ఆభరణములు అసూయను వృద్ధిచేయును. ఒక ఇంటియందిరువురన్నదమ్ములున్నారని యనుకొనుడు. వారిరువురిభార్యలు ఒకరికన్న ఒకరికి అలంకారములు ఎక్కువయున్నాయని తమలో తాము ద్వేషించి ఎక్కువ యలంకారములకొరకు పతులను పీడించుదురు. అట్టి విషమస్థితిలో పతివద్ద ఆభరణములుచేయించుటకు ధనముండనియెడల ఎక్కువవడ్డీ యిచ్చెదనని ఋణముజేసి అలంకారములను చేయించును. కాని కంసాలి అందులో మోసముజేసి కొంత ధన మపహరించును. అలంకారములను నాల్గుసంవత్సరములకాలము ధరించినట్లయిన వాటివిలువ చాలా తగ్గిపోవును. ఒకప్రక్కన యాభరణములవిలువ తగ్గిపోవుచుండును. మరియొకప్రక్క ఋణము పెరిగిపోవుచుండును. అలంకారములకొరకు పతులను ఇట్లు పీడించువనితలు "దశపూర్వేషాం దశాపరేషాం" అను నార్యోక్తిని ఎట్లు సాఫల్యముచేయుదురో చదువరు లూహించుదురుగాక! కనుక అలంకారములవలన ఇంతకన్న వేరులాభములేదు. ఆనగలకొరకు మదుపుపెట్టిన ధనము బ్యాంకులో వృద్ధికి ఉంచినయెడల ప్రతిసంవత్సరమును ధనమువృద్ధివలన అధికమగుచుండును.

—అయలసోమయాజుల లక్ష్మీనారాయణరావు.

౧౦

"బంగారమా? బ్యాంకా?" అను ప్రశ్నమును చూచినాను. ఈయుగమున ధర్మము సన్నగిల్లినది. పాశ్చాత్యనాగరికత పరధనాపహరణమునకు సాయపడుచుండుట మనకు నిత్యము కనిపించుచున్నది. అర్బతునాటు బ్యాంకి ఎందరు మహారాజులను, వర్తకశిఖామణులను కంటతడి పెట్టించినదో దేవునికెరుక! ఆదారే అనేక బ్యాంకులు తీసినవి. నేడు పరులచేత బడిన సొమ్మును తిరిగి తీసుకొనుట బలవంతులకే అలవికాని పనియగుచుండ ఇక సాధారణస్త్రీలమాట లెక్కయా? ఇప్పటి కోర్టులలో ఎట్టిన్యాయము లభించుచున్నదో ఎవరికి తెలియదు? "ఇదంతయుచూడ స్త్రీతనసొమ్ము తన స్వాధీనమందే యుంచుకొనుట యుక్తము. అపుడే అది ఆమెను సకాలమున రక్షింపగలదు. ఇంతేకాక ఆభరణములు స్త్రీసహజసౌందర్యమునకు శోభను తేగల సాధనములు. అవి యామెస్థితిని పరులకు చూపుచు ఆమెకుఘనతను గౌరవమును కూర్చగలవు. బంగారమును ఆభరణములరూపమున తమ స్వాధీనమందే యుంచుకొనుట స్త్రీలకు సర్వవిధముల శ్రేయమని నేను తలంచుచున్నాను. అందువలన నావోటు బంగారమునకే.

—గ. సీతామహాలక్ష్మమ్మ.

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## క్రొత్తఅల్లునిపాట

(సంపాదకులు) శెట్టిపల్లి వేంకటరత్నంచాదరిగారు

అత్తవారింటికీ క్రొత్తల్లుడొస్తేను
క్రొత్తసున్నముదెచ్చి మెత్తరమ్మ
క్రొత్తసున్నముతోను కోపంబువస్తేను
నల్లేరుదెప్పించి నలుపరమ్మ
నల్లేరుచేతను ననననలాడితే
దూలగుండాకుతో దులపరమ్మ
దూలగుండాకుతో దుఃఖంబువస్తేను
బర్రెపలువులుదెచ్చి బాదరమ్మ
బర్రెపలువులతోను బాధలువస్తేను
కర్రలుదెప్పించి కొట్టరమ్మ
అబ్బబ్బ యీా అత్తవారింటికివచ్చినసుఖమేంటి
వచ్చినదారినేకాళీకిపోతే మేల్ మేల్.

## చిన్నపిల్లలపాటలు

శ్రీమతి యల్. సుబ్బలక్ష్మిగారు

౧

వెనకా వెనకా వేములతాత
కనకాపల్లా కామనరూావు
వాగూాసీళ్ళా వనమూాపత్రీ
తెల్లనిగుళ్లో నల్లనిస్వామికి
నాలుగుచేతులా నమస్కారాలు.

౨

చిట్టీచిట్టీ మిరియాలు
చెట్టుక్రిందాబోసి
పుట్టామన్నూ దెచ్చీ
బొమ్మారిల్లూాగట్టీ
బొమ్మారింట్లో బొమ్మానీళ్లాడితే
బొమ్మాతలకీ నూనేలేదూా;
బొమ్మాబిడ్డకి నెయ్యీాలేదూా;
అంతట్లోనే పెద్దన్నొస్తే
కాళ్లాచెప్పులు విడిపించి
కంచెడుపాయసం జుర్రించి.

౩

బాలకృష్ణుడు – పండ్లు

బంగారుతలకుంచె కొప్పుజీర్లాడె
బంగారుపట్టుచీర చెంగుజీర్లాడె
పాన్పుమీాదపాపడికి పావాలుదొడిగ
భమిడిపిల్లంగోరు చేతికందించె
వెళ్లెనేకృష్ణమ్మ గోపికలవెంట.
అంగటాచెంచెతా పళ్లమ్మదెచ్చే
అమ్మనాకుపళ్లని అడిగెకృష్ణమ్మ
పళ్లుపళ్లుపలరా పాపయ్యమనకూా?
నట్టింటవున్నది రత్నాలరాసి
తప్పుకోకృష్ణమ్మ దోసెళ్ళనిండ
ముంగిటానున్నాది ముత్యాలరాసి

తప్పుకోకృష్ణమ్మ ధోసిళ్లనిండ
ఉంగరాలవ్రేళ్ళ నురకంగివచ్చె
పట్టవేసెంచెతా పెట్టవేపండ్లు?
పెట్టంగనొకపండు గంపలోపడెను
గంపలోపళ్ళన్ని కనకంబులాయె
గంపక్రిందాచుట్టు మాణిక్యమాయె

# అడవిమార్గము

చిన్నారిపొన్నారి చిలుకవేనీవు
చిట్టిమామిడిపండు హంసవేనీవు
శ్రీరామఅల్లుడు సీతఅల్లుడు
రావయ్యపెద్దన్న రాజఅల్లుడు
రాజుపుట్టాడన్ని రాజ్యాలునీకెరుక
పన్నెండురాజ్యాల పట్టాసికెరుక

# హాతి పాటలు

౧

చిత్తరువుపెట్టినా చిన్నింటిలోనా
శ్రీకృష్ణుడన్నయ్య నేమంటెవదినె
ఎప్పటికినీయన్న నేమందుసమ్మా
నల్లనీవాడందు నవ్వుమొగమందు
నల్లనీవాడందు నవ్వుమొగమందూ

౨. కథలు

అడికట్టిసమసిపాల పట్టుచీరాయె.
ఏన్నోముమునో స్త్రీవే అమ్మగోపెమ్మ?
పట్టిచవులువుంటె వరిపిండితింటె
పుట్టలోపాములకు పాలుపోయి స్త్రీ
వనములోరామచిలుకలకు మేతబెట్టి స్త్రీ
కంటినే బలభద్రరాముతమ్ముణ్ణి.

శ్రీమతి కె. మాణిక్యాలదేవి

రాముడులేడటే రాత్రిసభలోను
నిద్రయెట్టాపట్టింది నీకుసీతమ్మ
అన్నలారా! మీరు విన్నారలేద
ఆలిమీదపెండ్లి విన్నారలేద
అత్తిల్లుఒకటైన పుట్టిల్లుఒకటి
అవిరెండుదప్పితే అడవిమార్గంబు.

శ్రీమతి కొసరాజు సీతారామమ్మగారు

చక్కనీచెల్లెలికి సైదోడువందు.

౨

చక్కనీవాడమ్మ సారంగధరుడు
చిక్కాడుచిత్రాంగి చిన్నమ్మచేత
మారుతల్లీచేత మాటబడలేకా
చావుకూలోనయ్యె సారంగధరుడు.

# బ్రహ్మ పాట్లు

శ్రీమతి నాయని హనుమాయమ్మగారు

ఒకవూళ్లో ఒకపంతులు. ఆయనభార్య పూర్ణగర్భిణి. ప్రసవించేరోజులు. అట్టిసమయములో ఆయన అత్యవసరంగా పొరుగూరు వెళ్ళవలసివచ్చింది. ఇంట్లో ఎవరూలేరు. శిష్యుడికి ఇల్లువప్పగించి తానువచ్చేవరకూ జాగ్రతగా వుండవలసినదనిచెప్పి వెళ్ళినాడు. పంతులుగారు అటువెళ్ళగానే ఆయనభార్యకు నొప్పులు ఆరంభమయినవి. శిష్యుడు పరుగెత్తుకొనిపోయి మంత్రసాన్ని తీసుకవచ్చాడు. దాన్నిలోపలికిపంపి తానువాకిట కావలి వున్నాడు. పంతులభార్య సుఖప్రసవమై మొగపిల్లవాణ్ణికన్నది. బాలింతకు జరగవలసిన

దంతా మంత్రసానిజరిపింది. ఇంతలో బిడ్డనొసట మూడుబంతులు వ్రాయుటకు బ్రహ్మవచ్చి లోపలికి వెళ్ళబోగా శిష్యుడు అటకాయించగా "నేను బ్రహ్మదేవుణ్ణి. ఇప్పుడు పుట్టినబిడ్డకు నొసటివ్రాలువ్రాయుటకు పోతున్నాను. నన్ను వెళ్ళనివ్వవలసినది" అన్నాడు బ్రహ్మదేవుడు. "నీవు నొసట ఏమివ్రాస్తావో వెళ్ళేటప్పుడు నాతో చెప్పేటట్లయితే పోనిస్తాను" అన్నాడు శిష్యుడు. అట్లాగేనని లోపలికివెళ్ళి వచ్చినపనికాజేసుకొని తనదారి తాను చల్లగా జారుకుంటున్నాడు బ్రహ్మదేవుడు. "బలే బ్రహ్మదేవుడివే. మాటఇచ్చి ఏసంగతిచెప్పకుండా నెమ్మదిగా దాటుతున్నావే. ఆగుఆగు" అని శిష్యుడు బ్రహ్మదేవుణ్ణి పోనివ్వకుండా పట్టుకున్నాడు. ఇక చేసేదేముంది! "ఇప్పుడు పుట్టినబిడ్డకు అరవయిసంవత్సరముల ఆయుస్సు. కోడెలబేరం చేసుకొని జీవనంచేస్తాడు." అని బ్రహ్మ తానువ్రాసినవ్రాలు తానేచదివి శిష్యుడు వదలగా సత్యలోకంచేరుకున్నాడు. "భేష్! బ్రహ్మదేవుడు నాచేతిలోచిక్కాడు" అని శిష్యుడు చంకలుకొట్టుకున్నాడు. పంతులకొడుకు నాటానాటా పెరిగి పెద్దవాడైనాడు. వానికి పదహారో ఏట తల్లిదండ్రులు గతించారు. తనజీవితం ఎట్లాగడుస్తుందాఅన్న ఆలోచనలోపడి చివరకు వాడు కోడెలబేరం చేస్తామనుకొన్నాడు. కాని శిష్యుడు ఆయత్నానికి అడ్డుతగిలి "బ్రహ్మదేవుడు నీనొసట వ్రాసిందేఅది. ఆయనవ్రాలు మనం అబద్ధంచేయాలి. నీవు పూరకేవుండు. నీకు తిండి నేనుపెడతాను" అన్నాడు. పంతులకొడుకు సంతోషించాడు. అట్లు కొంతకాలం జరిగింది. బ్రహ్మదేవుడికి గట్టిచిక్కేవచ్చింది! సత్యలోకాధిపతిమాట అసత్యము కావడమా మరి! ఆలోచించి ఆలోచించి బ్రహ్మదేవుడు ఒకఎత్తుఎత్తాడు. తెల్లవారేటప్పటికి పంతులు కొడుకువాకిట ఒక మంచికోడె కట్టుకొయ్యకతయార్. ప్రొద్దున్నే పంతులకొడుకు, శిష్యుడు దాన్నిచూచారు. బ్రహ్మదేవునిఎత్తు శిష్యునికి అర్థమయింది. పంతులకొడుక్కు దాన్నిఅమ్మాలని కుతూహలంకలిగింది. "ఇదమ్మితే కోడెలబేరమే" అన్నాడు శిష్యుడు. పంతులకొడుక్కు మనస్సునిలువలేదు. కాదుకూడదు అమ్మతానని పట్టుబట్టాడు. "అయితే ఎవరైతే మానెడు సోలెడు వరహాలు ఇస్తాడో వాడికే దీనిని అమ్మవలసినది" అని శిష్యుడు వుపాయంచేసినాడు. మానెడు సోలెడు వరహాలిచ్చి కోడెదూడను ఏబ్రతికినవాడు కొంటాడు! బ్రహ్మదేవుడే దిగి రావాలి! "మనఖర్మం ఇట్లాకాలింది. అఘోరించక తప్పుతుందా" అనుకుని కోడెలబేరగాని వేషంవేసుకొని మానెడు సోలెడు వరహాలమూటతో పంతులకొడుకు ఇంటికివచ్చి వరహాలిచ్చి కోడెను తోలుకొని వెళ్ళినాడు. పంతులకొడుక్కు కోడెలబేరం సాగడానికి ప్రతినిత్యం ఇదేనాటకం ఆడవలసివచ్చింది బ్రహ్మదేవుడికి. వరహాలవల్ల పంతులుకొడుకు శిష్యుడు కోటీశ్వరులయినారు. సత్యలోకాన్నుండి మనుష్యలోకానికి తిరిగితిరిగి బ్రహ్మకు బుద్ధివచ్చింది. "ఛీ! ఇక మనుష్యులకు కనుపడకుండా పోయి నొసటివ్రాలు వ్రాస్తాను" అనుకొని అప్పటినుంచి అట్లాగే చేస్తున్నాడు.

# గడుసు బ్రాహ్మడు

కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

ఒకపల్లెటూళ్లో ఒక బ్రాహ్మడు వైద్యంచేసుకుంటూఉండేవాడు. ఆయన చాలామంచివాడు. ఎప్పుడూ మందులు తయారుచేస్తూఉండడం, చాలామందికి ధర్మంగా వైద్యంచేస్తూఉండడం ఆయనపని. అతనిపెళ్లాం మహాగయ్యాళి. మొగుడితో ఎదురువాదించడం, అవునంటే కాదనడం, కాదంటే అవునడం ఆమెస్వభావం. మాటిమాటికీ ఆవస్తువులుకావాలి, ఈచీరలుకావాలి అని మొగుడితో దెబ్బలాడ్డమేగాని, ఇంట్లోపనులు చక్కగా చేసుకోడం, భర్తచెప్పినమాటమీద నడుచుకుంటూఉండడం ఆమె స్వప్నంలోకూడా ఎరగదనే అందరూ అనుకునేవారు. ఒకనాడు ఆవైద్యుడు ఏవోమందులుకావలిసిన వేళ్లుచితకొట్టుకుందామని ఆఖల్వాంపాత్రం ఇల్లాపట్రాఅని పెళ్లాంతో చెప్పాడు. ఆమె పళ్లుపటకరిస్తూ కళ్లుమిటకరిస్తూ మొగాళ్లాగ ఆడవాళ్లు రాళ్లూరప్పలూ మొయ్యగలరా? నాతరంగాదుబాబూ! ఆపాత్రం తేడం అంది. అనటంతోనే ఆవైద్యుడు కాస్తనవ్వుకుని ఏమీఅనలేక తానే ఆపాత్రం తెచ్చుకుని పనేదో సాగించాడు. అప్పటినుండీ దీనిపోత్రం ఎల్లాఅణచడంరాఅని ఆలోచిస్తూ ఏవిటాయనకుతట్టిందో ఒకనాడు పొద్దున్నేలేచి పెళ్లాన్ని పిలిచేడు. ఏమేవ్ ఈరోజున కాస్తవేగంగా వంటచెయ్యి. మేమూళ్లో మంచిమంచి కంఠాభరణాలు తయారుచేసేపనివాళ్లొచ్చారంట, నీక్కూడా ఓటికొని తెస్తానన్నాడు. ఆభరణంఅనటంతోనే ఎక్కడాలేనిఓపికతో ఎన్నడూలేనిసంతోషంతో నిమిషంలో వంటవండేసి నీళ్లుకాచేసి స్నానంచేసి మడికట్టుకోండిఅంది. ఆయనా మహాప్రేమగా ఆభరణంతేటానికి వెళ్లేటట్టు గబగబా స్నానంచేసేసి, తృప్తిగా భోజనంచేసి దుస్తులువేసికొని పెళ్లాంచూడకుండా ఆయనవుద్దేశమేమిటో ఖల్వాంపాత్రం గుడ్డనిచుట్టి చిన్నమడతపెట్టిన అంగవస్త్రంలాగ చంకనుపెట్టి, ఏమే వెళ్తున్నాను, ఇంటివద్ద జాగ్రత్తసుమా! రేపుప్రొద్దుటో సాయంకాలమో వచ్చేస్తానులే అనిచెప్పి బయలుదేరేడు. దగ్గరగాఉన్న ఒకబస్తీకిపోయి కొంతబంగారంకొని ఒక బంగారంపనివాడిదగ్గిరికితీసుకువెళ్లి ఏమోయి? నీకుతగిన మజూరీఇస్తాను. ఈబంగారంలోసగం రేకుచేసి ఈపాత్రానికి అతికమన్నాడు. తక్కినసగం మెళ్లోవేసుకోడానికి వీలయినట్లు తాడులాఅల్లించి దానికి అతికించేడు. మొత్తంమీద చక్కని కంఠాభరణంలా తయారుచేయించి యింటికిపట్టుకొచ్చేడు. రావడంతోనే ఎలాంటికంఠాభరణంతెస్తారో! ఎంతవేగంగా మెళ్లోవేసుకుని ఊరంతాతిరిగేసి అందరికీ చూపించొద్దామాఅని గుటకలేస్తూ ఆయనవచ్చేవేళకు మార్గంకేసిచూస్తూన్న ఆయిల్లాలు, ఆయనచేతిలో మూటతీసి గబగబావిప్పేసి మంచిదైనా ఆడక్కుండా మెళ్లోతగిలించేసుకుని ఒక్కమారు ఊరంతా ఊరేగివచ్చింది. ఆవైద్యుడిదంతాచూసి నవ్వుకుంటూ అప్పుడేమీఅనకుండా ఊరుకున్నాడు. ఓవారంరోజులుపోయినతర్వాత దీనిపెంకితనం అణచాలని, ఏమేవ్! కబురు! ఇలారా! అనిపిలచేడు. ఆమె మళ్లీ ఏమిటోచేయిస్తారుగాబోసని దగ్గరగావచ్చింది. ఆవేళ తెచ్చిన కంఠహారం ఓమాటుతియ్యి, ఏమైనా రంగూగట్రామారినా, మరామత్తూపనులయినా తిరిగి వాపసుచేసి మరోమంచిది తీసుకుంటానని ఆవర్తకునితో చెప్పివచ్చేను అన్నాడు. అనేసరికి ఆమెయూ తీసియిచ్చింది. అతడున్నా రుబ్బుపాత్రానికి ఈమూలా ఆమూలా వేయించిన రెండు బంగారుడిప్పలూ ఊడలాగి ఆపాత్రం భూమిమ్మీద ఆమెచూస్తూండగా పడేసేడు. కిందపడిన పాత్రంచూసేసరికి ఆమెముఖాన్ని కళలేదు. రాసిన బొమ్మలా అలానుంచుంది. ఏమేవ్! ఒక్కమాట అక్కడున్నపాత్రం ఇక్కడికి తేలేవన్నావుగదా! మగవాళ్లలాగ ఆడవాళ్లు రాళ్లుమొయ్యగలరా అన్నావుగదా! ఇప్పుడు వారంరోజులు మెళ్లోకట్టుకునిమోసింది మొగాళ్లా! ఆడాళ్లా! అని పెంకితనం, గర్వం అడిగిపోయేటట్టు ఒక్కమాటు వెటకారం, వేళాకోళంచేయడం మొదలెట్టాడు. ఎంతపనిచేసారండీ అని గిరుకతిరిగి ఆవతలికి వెళ్లిపోయిందామె.




# రాట్నపునాదము

శ్రీమతి దేశరాజు భారతీదేవిగారు

గోపాలకృష్ణునీగంటికే (వరుస)

రాట్నపునాదమువింటిరే భారతులారా! రా.

జనధనప్రాణమానసంచయంబులగాచీ
సకలబీదజనులకెల్లా సౌఖ్యమునిరతంబుగూర్చు రా.

భారతీయప్రజలకెందు భంగపాటుగలుగకుండ
పరమగౌరవపదవిగూర్చి పారతంత్ర్యమవలద్రోయు రా.

కోట్లకొలదిధనపురాసుల్ కొల్లగొనిపోవుచున్న
పట్ల గాంధీజూపినట్టి పరమసాధనమైనయట్టీ రా.

ఖండఖండాంతరములందు నింపుకీర్తిగాంచి సాధు
తండమెల్లావినుతీ చాలాజేయునట్టి మేటయైనా రా.

లాంకుషైరువర్తకుల బింకమెల్లాడుల్లిపోవ
సంకటములబాపునట్టి సాధనరాజామైనా రా.

శాంతీయుద్ధమందు మనకాంతలెల్లాచేతబట్టి
వింతరణముసేయ మంచివిల్లువలెవెలయునట్టి రా.

దుష్టులనుదునిమి వేగ శిష్టరక్షణసేయుటకు
శ్రీమహావిష్ణువు తనచేతదాల్చు చక్రమైన రా.

## వీ రా బా యి

శ్రీమతి అల్లూరి వేంకటసీతమ్మ గారు

రాజపుత్రవంశరమణి వీరాబాయి శత్రుభయముచేత కార్యముడిగి
ప్రధనభూమివీడు భర్తను జూడగాంచి శౌర్యరసము పొంగిసాహసించి
దండువచ్చినట్టిరాయలపై బడి యాగ్రహంబుమించియమ్ముదాల్చి
చీల్చివైచినాడు సింగంబుకైవడి వెన్నుజూపిపరులువిచ్చిపోవ
సుందరాంగియిట్లు సుంతైనవెఱువక కదనసీమనిల్చి కత్తిదూయ
పోటుబంటులెల్లపొంగిపొరలుచున్న వీరరసముజూపి విక్రమించి
వాడినారసంబువడి కేలగీలించి పంతగించి కత్తిపదను బెట్టి
కొమరుతనముమించు కోపంబుజూపుచు నతివవచ్చెయనికియడలువీడి
కోమలాంగినిలిచి కోటసందడింప యుద్ధభటులెల్లఆవిదయందు
భక్తిగల్గిచాలపంతంబుమదినిల్చి తురకవారిగొట్టె దురమునందు
అదుదానిచేతియమ్ములబడలేక పోటుమగలవాడియీఁటెపోటు
లోర్వశక్తిలేకయుల్లంబుజల్లన వచ్చుదారిబట్టి పచ్చితురక
అబలయంచుబల్కియాఁకువారినెపుడు నంతిపురినిబెట్టియణఁగగొట్టి
చదువుసామునేర్ప సమ్మతిజూపక శక్తియుక్తులన్ని జంపరవని
సామునేర్వకున్న సమరమెఱుఁగకున్న సహజశక్తిజూపిసాహసించి
శత్రుసేనజీల్చిజయము వీరాబాయికాంచలేదె జగతికాంతలార!

## లా లి పా ట

శ్రీమతి చోడవరపు రంగనాయకమ్మ గారు

జోజో ముద్దులకోసలబాలా జయజయ రఘువీర జో.

లాలియూచెద శ్యామలగాత్రా
పాలింపుమినను వారిజనేత్రా
ఏలగమరచితో దశరథపుత్రా
చాలికజాలము పరమపవిత్ర. జో.

కస్తూరీతిలకాంచితఫాలా
కనకాంబరధర కావవదేలా
గళమునతులసీమాలికవ్రేలా
కాంచనమణి భూషణయుతబాల జో.

రామరవికులా వారిధిసోమా
ప్రేమకౌసల్యా పాలిటినోమా
కామాంతకప్రియతారకనామా
నామొరాలింపుమి రాఘవరామా. జో.

చోడవరపు రంగనాయకివేడా
తోడలక్ష్మణుకు వేకుకమీరా
పాడుచుఅచ్చర చేడియలాడా
పోడిమిసిగ్గొందు జానకితోడ. జో.

# శాంతమతి

కీ. శే. ఆలూరు వాసుదేవయ్యగారు

అనంతర మాదంపతు లిద్దఱామణిపురంబుదాఁటి, యైదాఱుక్రోసుల దూరంబరిగి, సూర్యుఁడ స్తమింప, నొకపల్లియుఁజేరి, యూరేయి యొకగొల్లవానింటఁ బాలుగొనిత్రాగి, యందొక్కెడఁబరుండి, సూర్యోదయానంతరము, మఱలఁ బ్రయాణంబయి, పోవుచు శాంతమతి తనభర్తతో నిట్లనియె:

"ప్రియవల్లభా! భయంబులేక యూపనుచు నీపగిదిమాటాడుచున్నదని తలంపక, నా మాటలు కొంతయాలకింపుఁడు. మనకు ధనంబులేదనియు, నిల్లులేదనియు నేరీతిజీవనము సేయనగుననియుఁదలంపకుఁడు. ఎట్టియిక్కట్టు సంభవించినను నన్నువిడనాఁడకుఁడు. నా మాటలు తృణీకరించి వేఱొకత్రోవం జనకుఁడు. మన మొక్కరింటికేగఁబనిలేదు. దేవునినమ్మి యేదోయొకవిధముగ జీవింతము. కడకునుప్పమ్ముకొని గంజిత్రాగియుందము. "మోదుగ పూవెఱ్ఱఁగనుండినను వాసనలేనియట్ల" నాతండ్రి ధనికుఁడయ్యు గుణంబులేదయ్యె. అతని యందాశ నాకులేదు. తల్లి తనభర్త నానతిమీరుట పాడిగాదుగనుక నన్నామె యాదరించుటకు నొల్లఁబడలేదు. ఇంక వారి ప్రస్తావనమునసేయ నక్కఱలేదు. నాతండ్రి తలంచిన తలంపుకు నన్నొకగ్రుడ్డివానికో కుంటివానికోయిచ్చి పెండ్లిసేయునని తలంచితి. కట్టకడ దేవుని కృపవలనఁ దమచే నొసంగినందులకు నాయదృష్టంబింతకు మంచిదనితలంతు" ననఁగ నాభానుగుప్తుండిట్లనియె:

"కన్యారత్నమా! యన్యగ్రామంబుననుండి నేనువచ్చుటేమి? ధనికుఁడై, మాన్యుఁడై యుండు నీతండ్రి ధనశూన్యుండగు నన్నుఁబిలచి నిన్నీదలంచుటేమి? యిదంతయు బ్రహ్మతంత్రంబుగదా? నిన్ను మొట్టమొదట చూచినపుడ నామనంబున నీకన్యకామణి మదీయధనరాశియని నిర్ణయించినాఁడ. "దరిద్రునకుఁ బెన్నిధి యబ్బినట్ల" నాకు నీవు లభించుటచేత నీఁక నాలేమిడి తొలంగిపోవుటకు సందియంబుగలదె? మఱియు నీవిద్యాపాటవంబునకు మనంబున నెంతయు సంతసించితి. నాకు విద్యలభింపమికి నెంతయుఁ చింతించువాఁడ" ననఁగ శాంతమతి "విద్యలేదని చింతవడకుఁడు. వచ్చినంతకు నన్నము దొరికినంజాలు. మఱి యిదివఱకే మీరు నాతండ్రితో నాకిల్లువాకిలిలేదని చెప్పుచుండఁగ నేను వినియున్నదాన, నట్లుండ నిపుడెయ్యెడకుఁబోదము? నీటివఱవఁజూచి చెఱువుకట్టవలె నన్నట్లు మనకుబాగుగ జీవనముజరుగు నొక్కగొప్పపట్టణంబునకేగి, యెందేని గుడిసెఁగట్టుకుని వక్కలాకులుప్పమ్మకొని "అప్పులేనిగంజ దొప్పడై ననుజాలు పడెకుమేడకంటె గుడిసెమేలు" అనునట్లు దేవుఁడిచ్చినంతకు గంజిత్రావి యొకగుడిసెయందుందుదము. అప్పుసేయఁ దెప్పున నొప్పమికల్లకమానదు. కొన్నాళ్ళకు నేలఁగూలు ప్రాతమేడలోనుండితిమేని ప్రాణహాని పొసంగకపోదు. కాఁబట్టి సర్వథా పట్టణవాసం బుత్తమంబగుటంజేసి మీరెఱింగిన నొక పట్టణంబునకుఁబోద"మని చెప్పునట్టి

శాంతమతింజూచి "భానుగుప్తుఁడు" అవునవును! గ్రామవాసంబుకంటెఁ బట్టణవాసంబు కడు మేలు. చిన్న సెలయేటిని నమ్మిపై రిడుటకంటె గోదావరినమ్మి పై రుపెట్టుకొనుట మేలుగదా! యట్ల నీయభీష్టముచొప్పున నిపు డీదారింబోతిమేని ముందట యమునానది కానవచ్చును. దానిగట్టునఁ బద్మావతీనగరంబను నొకపురంబుగలదు. అది యీ భూమండలంబునం బ్రసిద్ధి నొందెను నేఁడుపురంబులకు మండనంబుగనొప్పారు. అప్పట్టణంబునంగల చాతుర్వర్ణ్యముల వారు ధనధాన్యసంపన్నులయి యుండువారు. ప్రశాంతమహారాజు చతుర్భుజునివలెఁ బురుషార్థంబులొసంగుచు దయార్ద్రహృదయుఁడై తత్పట్టణంబును బరిపాలించుచుండు. సేనాపట్టణంబున విస్తళ్ళమ్మినవాఁడనగుటంచేసి యెఱుంగుదు" ననఁగ శాంతమతివిని "అలాగైనచో నా పురంబున కేగుదము" అని నిశ్చయించుకొని మెల్లమెల్లఁగ నాల్గుదినంబుల కాపురి కేగి యొక సత్రంబునం జేరిరి.

అనంతరము శాంతమతి పదిదినంబులు గడచినపిదప నొకదినము భర్తతో నిట్లనియె: "నాథా! యీపురవీథినెందైన వ్యాపారాదులు బాగుగనగుచోట మనకాఁపురంబునకుఁదగిన చిన్నయింటిని బాడుగకుమాటాడ యేర్పాటుచేసుకునిరండు. కట్టకడకొకగుడిసెయైనంజాలు, నందుండి వక్కలాకులమ్ముకొని జీవింతము." అని చెప్పుటంజేసి భానుగుప్తుండు సంతసించి యప్పురవీథులందందుఁదిరిగి తగినగుడిసెయొండు దొరకమి చింతించుచు శాంతమతికడకుంజని తావీథులంగ్రుమ్మరిఫలంబుగాననివిధంబు సెప్పుటంజేసి శాంతమతి కొంతతడవు యోచించి "నాథా! యిక్కార్యంబునకుఁ జింతింపకుఁడు. ఏధనికునింగానివేఁడకుఁడు. చేత ధనంబులేదని యధైర్యపడకుఁడు. దైవంబేదియో యొకసాధనము చూపకమానఁడు.

### సుధాకరమాళిశర్మకథ

తొల్లి సుధాకరమాళిశర్మయను విప్రోత్తముండు మహాదరిద్రుఁడై భార్యయగు హైమవతిందోడ్కొని యూరూరుఁదిరిగి కట్టకడఁ గాంచీనగరంబుసేరి సౌఖ్యంబునొందె. అక్కథఁ జక్కఁగ వక్కాణించెదవినుండు. ఇదివఱకుఁజెప్పిన యావిప్రదంపతులు తుంగభద్రానదీతీరమున అంబికాగ్రహారంబునఁ గాఁపురంబుసేయుచుండి కడుపేదఱికము పీడించుటంజేసి యయ్యగ్రహారంబునఁ గాఁపురంబుండక యందందుంగలపట్టణంబులును గొప్పయగ్రహారంబులును దిరిగిదిరిగి యెందుంగాని తమకు జీవనాధారంబు లభింపక కట్టకడఁ గాంచీనగరంబునకువచ్చి యొకసత్రంబున మనవలెఁజేరిరి. అంతనావిప్రుండానగరంబునం బ్రతిదినంబు బ్రాహ్మణులిండ్లకుం జని బిచ్చమెత్తుకొనివచ్చి యొకవిధంబున జీవనముసేయుచుండె. ఇవ్విధంబుండ నానగరాధిపతియగు ధర్మసేనమహారాజు వేఁటకుంజని గుఱ్ఱంబుపైఁగూర్చుని వచ్చుచుండఁగా సుధాకరమాళిశర్మయుండుసత్రముముందట గుఱ్ఱంబుపై నుండి క్రిందపడినవాఁడయ్యె. అరాజభటులందఱు వెనువెంటరాక యిఁకనూరునడుమ రాజుకు భయమేమనితలంచి

కొంతదూరమున మెల్లఁగవచ్చుచుండిరి. అపుడు మట్టమధ్యాహ్నకాలంబగుటంజేసి మెండుగ నెండగాయుచుండ నావిప్రుండు బిచ్చంబెత్తుకుని వచ్చుచుండె. రాజేంద్రుఁడు నేలం బడి మోకాళ్ళురెండును మిక్కిలి గాయంబులయి జోటజోటయని నెత్తురుగాఱుచుండ నాయెండ వేఁడిమికి నానేలనుండి లేవఁజాలక తడఁబడుచుండె. గుఱ్ఱముమాత్రము తన శాలకేగినదయ్యె. అప్పు డధికముగ నెండగాయుటచే నందందుఁగల వారెవరుగాని యీవలికిరాక నీడపట్టున నుండిరి. అట్టిసమయాన నావీథినివచ్చుచుండినవాఁ డాసుధాకరమాళిశర్మతక్క మఱియెవ్వారునులేరు. "ఆహా! ఎట్టివాఁడైనను దేవునియేర్పాటుకుఁబట్టుపడి తట్టుపడవలసినదే గదా! విధికిమించిన తంత్రముగానరాదు. అనంతర మాసత్రంబుననుండి యావిప్రునిభార్యయగు హైమవతి రాజుకుఁగల్గిన యాపదంజూచి కడువడిగవచ్చి యాతనిచేతులంబట్టి యొకవిధంబుగ నాసత్రములోనికి మెల్లఁగఁదోడ్కొనిపోయి యొక్కయెడఁబరుండఁజేసి యాగాయంబులకు నేమేమోచికిత్సచేయుచు నొత్తుటకు నిమ్మకాయలకును నూనెకును జేతనొకకాసు లేకుండుటంజేసి చింతపడుచు "భగవంతుఁడా! నీవు మఱుఁగున నెల్ల వారిహృదయంబులందుండి రక్షించువాఁడవు. అట్టిరాజు నొకబాధలేకుండ రక్షించుము. జగంబున రాజనువాఁడు విష్ణువనిచెప్పెదరు. అట్టి విష్ణునామంబీరాజుకు సార్థకంబు సేయుము" అని వీథిగుమ్మమునకును రాజును బరుండఁబెట్టిన తావునకును దిరుగుచు భర్తరాకకు నెదురుచూచుచుండె. అంత నాహైమవతీ భర్త యెండకు నేలనడుగు విడలేక యుందందుఁగల నీడపట్టులకుఁజనుచు నొకవిధంబుగ వచ్చుచుండి రాజుకుఁగల్గిన యాపదకుఁ దనభార్యరాజుందోడ్కొని సత్రములోని కేగినదియు దూరమునందుండిచూచి యెండసరకుఁగొనక వడిగఁబరుగిడివచ్చెచేరె. పిదప హైమవతి భర్తంజూచి "స్వామీ! ఈపూఁట మనకన్నములేకపోయినను బోనిండు. తెచ్చిన బియ్యము విక్రయించి నిమ్మకాయలు, నూనె, ఆవుపాలు, చక్కెర, నివి తీసుకుని యతిశీఘ్రముగరండు. అనిచెప్ప నావిప్రుండు కడువడి నొకవర్తకునింటికేగి బిచ్చమెత్తుకునివచ్చిన బియ్యమమ్మి వలసిన వస్తువులన్నియుంగొనివచ్చి భార్యచేనొసంగె. అంత నామె నూనెకాఁచి నిమ్మకాయలతోఁ దనభర్తను రాజేంద్రునిగాయంబులకు నొత్తమనిచెప్పి ముందుదినము భర్త తెచ్చిన బియ్యమొక్కింతయుండుటంజేసి యాతండులంబులను బాగుగఁబిండిచేసి పాలుతోడఁగాఁచి చక్కెరవేసి రాజుకాహారమిచ్చి యొడవడికిని, గాయంబులబాధకును రాజుదేహంబునకుఁ జెమ్మటలు పట్టుటంజూచి యదంతయుఁదుడిచి తాళవృంతముచేత విసరుచుండె.

అనంతరము రాజభటులు మెల్లఁగ రాజగృహంబుచేరి రాజురాకుండుట యెఱింగి గుఱ్ఱపు శాలకేగిచూడ గుఱ్ఱముమాత్రము వచ్చియుండుటంజూచి యాశ్చర్యపడి యందందు వెదుకఁజొచ్చిరి. ఈసంగతి రాజుభార్యకుఁదెలిసి పరితపించుచు నడవిలోనెందేని మృగంబునకు నాహారమైయుండునోయని సంశయపడుచు భటులనురావించి యడుగుచునుండుసమయంబున నొకభటుండువచ్చి రాణిగారితో "అమ్మా! రాజేంద్రులువారు గుఱ్ఱముపైఁ

గూర్చునివచ్చుచు నీపురసమీప సత్రముముందట నేలఁబడిగాయంబులుదగిలి నడువలేకుండఁగా గుఱ్ఱముమాత్రము తనశాలకువచ్చి చేరినది. అంత నాసత్రములో నెవరో బ్రాహ్మణులు రాజుగారిని మెల్లఁగసత్రములోనికిఁ గొంపోయి గాయంబులకుఁ జికిత్సలుచేయుచున్నారు." అనినవిని రాణిగారు వెంటనే యొకయందలంబునఁ బరిజనులతోడ నాసత్రమునకువచ్చి రాజుం జూచి తానొకప్రక్కనఁగూర్చుండి పయంటవలునచేఁ జెమ్మటఁదుడుచుచు నచ్చటనుండిన యావిప్రదంపతులతో "మీరీయాపదకుఁదోడ్పడి రక్షించినవారగుటంజేసి మీరే మాకుఁ దలిదండ్రు"లనిచెప్పి రాజును వెన్నడింగొని నగరికింగొంపోయినదై గాయంబులకుందగిన మందులువేయించి యాహారమీఁబోవ నారాజుభార్యతో నిట్లనియె:

"కాంతాలలామా! అత్యంతప్రియంబున నన్ను విపత్తునుండి క్రస్సనఁగొంపోయి రక్షించిన యావిప్రాంగనగుణంబునకు నాపెభర్త దయారసంబునకు నేమనివర్ణింతు? మఱియు నావిపత్సమయంబున వెనువెంట వచ్చుచుండినభటులలో నొక్కండును లేఁడయ్యె. ఎండకుఁ గాలిన వేఁడినేలంబడినప్పుడు గాయంబులనుండి నెత్తురుకాలువలుగట్టి గాఱుచుండుటకును లేచి యందుండి మఱొకను చల్లనీడకేగుటకును లేక ముహూర్తకాలము మైమఱచి యమలోకంబునకేగి యందుండివచ్చితి. అత్తఱి నెందుండివచ్చెనో యయ్యుత్తమభూసురనారీశిరోమణి యుత్తలంబునంజని నన్నెత్తి యసువులు తడంబడుచుండినను మెల్లఁగఁదోడ్కొనిపోయి యాపెకు నొకకాసు చేతలేకపోయినను బిచ్చమునకుఁబోయినమగని కెదురుచూచిచూచి యాతండు వచ్చినపిదప బిచ్చపుఁదండులంబుల నమ్మించి వలసినవస్తువులందెప్పించి నాకాహారమిచ్చి యిద్దఱాలుమగలు నాకునెంతయుం బ్రియంబునఁ జికిత్సలుసేయుచుండినది నీవుం జూచితివిగదా! మఱియు నాయమ్మ నాకుఁబ్రాణమ్మునకపాయమ్ము రాకుండునట్లు భగవంతుని నిమ్మగుపల్కులం బ్రార్థించునపు డాలించినాఁడను. అహా! దారిద్రులయ్యు భూరియశోధనంబునకు ధీరులై కారుణ్యార్ద్రహృదయులై పరోపకారంబుసేయుట కుద్యమించుఁ బుణ్యాత్ములు జగంబుననుండుటంబట్టియగదా చంద్రసూర్యులకు మాఱుత్రోవలు లేక నిజమార్గంబులం బోవుచుందురు? అట్టివారి మహితమహిమవలనఁగదా జగంబంతయు సువృష్టి వర్షించి సస్యాభివృద్ధియగుచుండును? వారి ప్రియాశీర్వచనంబులవలనఁగదా రాజులెల్లరు సుఖాసీనులై రాజ్యములేలువారు? తొల్లి ప్రతిష్ఠానగరంబునందుఁ గౌశికుండను విప్రుండు కుష్ఠురోగముగలవాఁడయ్యు నతనిభార్య యాతని యభీష్టంబుపరిపూర్తిసేయుటకు వేశ్యాగృహంబునకుఁ గొంపోవుచుండ నడిరాత్రిసమయంబగుటంజేసి రాజువలన శిక్షింపఁబడిన మాండవ్యునిశాపంబొంద గల్గుటంజూచి యాకౌశికునిభార్య కోపించి యాశాపంబునకుఁ బ్రతిశాపంబు సూర్యోదయంబుగాకుండునట్లిడుటంజేసి దేవతలు భయపడి యెట్టకేలకు నమ్మహాపతివ్రతకడకేగి తచ్ఛాపవిముక్తి చేసికొనిరని విబుధులవలనఁ బురాణంబున విని యున్నవాఁడ. కాఁబట్టి పతివ్రతామణులులేకుండినచో జగంబంతయు నడఁగును.—కొదువ.

# చదువరుల సమాధానములు

౧

వివాహమై నాలుగేండ్లయినను అల్లుడు తనయింటికి వచ్చుటలేదన్న విచార మత్తగారిహృదయమును బాధించుచుండెను. ఎన్నోసార్లు మగనిచే వర్తమానమంపియు లాభములేకపోయెను. ఇరుగుపొరుగుమూఢస్త్రీలమాటలనమ్మి యల్లునివశపరచుకొనుటకై యేదో మందు సంగ్రహించెను. భర్తచే నెట్లో బలవంతముగ నల్లునిరప్పింపజేసి కాఫీలోకలిపి యతనికి మందుపెట్టెంచెను. ఇందు అవిద్యవలన కొందరు స్త్రీ లెంతటి దురంతములజేయ సమకట్టుదురో వ్యక్తపరుపబడినది. శ్రీమతి అద్దంపూడి అన్నపూర్ణమ్మగారి పెండ్లిచూపులు అనుకథయందు ముఖ్యపాత్ర 'లిల్లీ'. ప్రప్రథమమునుండియు నీపాత్ర యతినైపుణ్యముగ ప్రదర్శింపబడినది. కథాభంగమునకు ఎక్కువగతోడ్పడినది కూడ 'లిల్లీ' పాత్రయే. జానకమ్మ పాశ్చాత్యనాగరికతావ్యామోహమున దగుల్కొన్నది. ఆమెకు మధ్యవయస్సునందే—కారణమేమో తెలియదు—పళ్ళన్నియు నూడిపోయెను. అప్పటినుండి యామె కట్టుడుపళ్ళతో కాలముగడుపసాగెను. తనకు కట్టుడుపళ్ళని యెవరికిని తెలియకుండ ఆమె దాటుకొని వచ్చుచుండెను. ఇట్టిస్థితిలోనే పెండ్లిచూపులకు రామలక్ష్మమ్మగారింటికివచ్చుట తటస్థించెను. వచ్చీవచ్చుటతో యామె పాలిటి యమునివలె 'లిల్లీ' ప్రత్యక్షమయ్యెను. లిల్లీని దాసీవచ్చి కట్టివేసినగాని యామెప్రాణములు కుదుటబడలేదు. గృహములోనివారందరకు లిల్లీపైన అమితప్రేమయున్నట్లు కన్పించుట—తన భర్తకు వారికి కుక్కనుగూర్చియే సంభాషణజరుగుట—యివన్నియు నామెకు మరింతకలవరము పుట్టించుచుండెను. త్వరగా నచ్చటినుండి తప్పించుకొనిపోజూచుచుండ భర్త నారాత్రి కక్కడనుండుట కేర్పాటుచేసెను. దీనితో ఆమెకుమతిపోయెను. ఇంటిలోనివారందరు నిద్రపోయినను నామెకు నిద్రపట్టలేదు. మెల్లిగా గంగాళము దగ్గరకేగినోటినుండి పళ్ళుకట్టలనూడదీసి వాటిని శుభ్రపరచెను. తరువాత నతిజాగ్రతతో వాటి నొకచోట భద్రపరచి పండుకొనబోయెను. కాని ఆమెకు నిద్రపట్టునా? కొద్దిపాటి సద్దునకే యామె మేల్కొని తనప్రాణప్రదములగు పళ్లకట్టలను చూచుకొనగా లిల్లీ యచ్చట ప్రత్యక్షమయ్యెను. దానినోటి క్రిందబడి తన ప్రియమైనపండ్లు కటకటలాడుచుండెను. దానితో నామెప్రాణము లెగిరిపోయెను. పాశ్చాత్యనాగరికతావ్యామోహమునబడి కొట్టుకొను హైందవనారీమణుల హైన్యస్థితి ఈకథయందు చూపబడినది. శ్రీయుత చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాద్ గారి కథలోని మూడుపాత్రలలోను వకుళాపాత్ర యెంతయు మెచ్చుకొనదగియున్నది. ప్రథమమునుండియు శ్రీలతా గోపాలరావు లన్యోన్యము గాఢముగ ప్రేమించుకొనిరి. ఈవివాహమువలనకూడ వారిలో నెన్నతగినంత మార్పేమియు కలుగలేదు. ఇద్దరి తల్లిదండ్రులును వారిమనోప్రవృత్తుల ననుసరించియే పోనిచ్చుచుండిరి. వకుళాగమనమువలన శ్రీలతాగోపాలురలోని యీషత్ స్వార్థప్రవృత్తి ప్రస్ఫుటమయ్యెను. వకుళ తమసౌఖ్యజీవనమున కంతరాయభూతమగునని వారవసరముగ భయమందిరి. లోకమమాత్రము వారిని కొంత బెదిరించుట వాస్తవము. కాని యదంతపరిగణనీయము కాదు. ఇద్దరకు జననీజనకుల సానుభూతి కావలసినంతయుండ లోకాపవాదమునకు వెఱవనగత్యము కన్పించదు. జననీజనకులు శ్రీలతకు వివాహవిషయమున సర్వాధికారముల నొసంగిరి. గోపాలరావునకుకూడ తల్లిదండ్రులవలన నెట్టియొత్తిడిగాని నిరుత్సాహముగాని కలుగలేదు. వారిజీవనమున పరీక్షాసమయమని చెప్పుటకు తగిన ముఖ్యఘటన లేనే లేదు. హిందూధర్మశాస్త్రప్రకారము గోపాలరావు ప్రేమపై వకుళకొక్కతెకే సర్వాధికారము కలదు. లాతిసొత్తని తెలిసికూడ దానిని కోరుటచూడ శ్రీలతకు

గల స్వార్థము వ్యక్తమగుచున్నది. ఒకనియందే తన మనోభావనిల్పి, త్రికరణశుద్ధిగ నాతని సేవించుట మహత్తరవిషయమే కాని పరులనుభవించు నర్థమును తాను వశపరచుకొనజూచుట స్వార్థమనిపించుకొనును. ప్రేమకొఱకు ఆత్మబలిదానమొసంగుట యిటు కన్పింపదు. ప్రాణములత్యజించుట గొప్పవిషయముకాదు. తన సౌఖ్యమయభావనలు - ఉన్నతాకాంక్షలు - సర్వము త్యజించి పరోపకారముకొఱకు జీవించుటయే ఆత్మబలి. ఇట్టి త్యాగమువలన శ్రీలతపాత్ర యుజ్వలతరమై ప్రకాశించుచుండును. గోపాలరావుమాత్రము సర్వస్వముత్యజించి యుద్ధమున సేవచేయ సంకల్పించెను. అతనికున్న తాదర్శ్యమున్నను లేకున్నను దారుణమగు తనమనోయంత్రణముపశమిల్లజేమోయన్న యూహమాత్ర మతనిలో ప్రకటితమగుచున్నది. ఇక వకుళ పాత్రౌచిత్యమెంతయు మెచ్చుకొనదగియున్నది. వకుళ శాస్త్రవిధిగ వివాహితయగు సతీతిలకము. గోపాలరావుతప్ప నితరశరణ్యము లేనిది. తనధనమానప్రాణములను ఆత్మనుకూడ ఆతనివశమొనర్చినది. బాల్యమునుండియు తన సరళహృదయమున ముద్రితమైన ప్రేమమూర్తి నారాధించుచు నెట్టకేలకు పతిసాన్నిధ్యమున జేరగలిగినది. కాని యాతని మన మన్యకాంతాసక్తమని వెంటనే తెలుసుకొన్నది. ఈమాత్రమున కామె మానసమేమియు చలించలేదు. పైగా తనభర్తను ప్రేమించుచున్న యాయన్యకాంతను మిగుల నాదరముతో చూడసాగెను. స్వార్థపరురాలై శ్రీలత నెంతమాత్రము ద్వేషించలేదు. ఆమెకు తనభర్తపై గల యత్యంతాదరమును ప్రేమను మించిన కొలదియు వకుళకు శ్రీలతపై భక్తి యెక్కువకాసాగెను. తుచ్ఛ విషయిక భోగములనే కోరునదైనచో శ్రీలతనుచూచి యీమెయోర్వగల్గునా? పతికూడ శ్రీలతను ప్రేమించుచుండుటచే నామెనే యాదర్శస్త్రీగనెంచి యామెచేసినట్లుగనే తానును చేయుచుండెను. గోపాలరావు శ్రీలతలకు సౌఖ్యముకలుగజేయుటకై తనహృదయమునందలి దారుణమనోవ్యథను దిగమ్రింగి యేవిధమగు కలవరములేకుండ శాంతిమయమగు జీవనమును జరుపుకొని తుదకు స్వర్గమున కలుసుకొనుటకై పతిదేవనితో సహగమన మొనర్చెను. వకుళ జీవనము నిజముగ ధన్యమైనది. కల్యాణసింగ్ గారి 'విధి'యను వ్యాసము భాగవతమున జెప్పబడిన యొక పద్యభావమును ధ్వనించుచున్నది:

"ధనము వీధినున్న దైవవశంబు
నందు బోవు మూలనున్నదైన
నడవి రక్షలేనియబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమునజచ్చు."

—ముడుంబ నరసింహాచార్య.

౨

నా పెద్దకూతురు కమలకి పదినెలలపిల్లప్పుడు విషజ్వరమొచ్చింది. చాల తబ్బిబ్బులైంది. డాక్టరుగారొచ్చి క్లోర్ ఫారంఇచ్చేరు. అంతా ఆశవదలుకున్నారు. 12 రో. మంచుగడ్డ తలకికట్టేరు. కమలకి జ్వరంతగ్గింది. కళ్లు తెరచి చూచింది. క్లోరుఫారం దెబ్బ మూడుయేళ్లవరకి మాటలురాలేదు, హృదయం ఎండిపోయింది, పండ్లుమొలవలేదు, నడవటంలేదు. ఇట్లా మూడువత్సరములుజరిగింది. బల్లి ఎలావుండునో పిల్ల అలాగే తయారయింది. అప్పుడు పక్షిదోషమంటారుకదా? అట్లుండునేమోనని ఆయాకు తెచ్చి నీటిలో వేసికాచి అభ్యంగనము చేయించిరి. తరువాత నవగ్రహజపములు చేయించిరి. ఆటుపిమ్మట డాక్టర్ గారివద్దకు పంపిరి. వారేంచెప్పిరి? కమలాపండ్లరసంపిండి, చక్కెరవేసి రోజొకటింటికి ఒకఔన్సు రసం త్రాగుటకుఇవ్వమనిరి. ఇట్లు మూడువత్సరములు ఇచ్చిరి. 6 మాసములకు నిల్చినది, ఒకవత్సరమునకు నడచినది, రెండోవత్సరమునకు పిల్ల బాగతేరినది, పండ్లుమొల్చినవి. కమల తనంతటతానే పండువొలిచిన తొక్కలన్ని కాళ్లుజాపుకొని కూర్చుని కాళ్లకేసి రుద్దుకునేది. మరి నాకు కాస్త త్వరగా రానద్దూ అనేది. కమలాపండ్లవలననే కమలఅను నామధేయము స్థిరపడినది. కమలకి భాద్రపద బహుళనవమికి 20 వత్సరములు నిండుతవి. ఇప్పుడు గట్టిపదార్థములు ఏమైన

నవిలితే పండ్లు జలజలమంటూ ఏదికోరక నివ్వదు. ఏది తిననివ్వదు. కారణ మేమిటా ఇంతచిన్నవయసులో అని ఆశ్చర్యముగానున్నది. రెండవది గర్భంలో ఉండగా తొమ్మిదిమాసములురాగానే, మోకాలిదగ్గర నుండి కాళ్లు చల్లగాచలవలఅయి నీరసమవడం. దీనిని బట్టి పోతూరి రామరాజయోగీంద్రులు వ్రాసినదానికి తామే నిర్ధారణ చేయవలసివుండును.

—కంకిపాటి రుక్మిణమ్మ.

౩

"ఎవరిని మెచ్చుకొందురు?" అనుకథలో వకుళది చాల గౌరవనీయమైనపాత్ర. శ్రీలతాగోపాలరావులు చిన్నతనమునుండియు స్నేహితముగానున్నవారు. అందువల్లనే శ్రీలత తనప్రాణములు వదలిపెట్టగల్గెను. ఇక గోపాలరావన్ననో శ్రీలతాప్రేమను తిరస్కరించలేక లోకులమాటలు పడజాలక దేశము త్యజించి పోయెను. ఇక వకుళయో బుద్ధితెలియనినాడుననే వివాహముజరిగినది. తనను ప్రేమించనిపతిని తనను గౌరవించనినాథుని తనఇంటిలోవుండుటకు ఆజ్ఞనొసగినభర్త యుద్ధమునకువెళ్లినాడని తెలియగనే స్మృతివిహీనఅయ్యెను. శ్రీలతయొక్క ప్రేమ యొకరికి బాగుగా తెలియును. తెలిసికూడ ప్రాణము పోగొట్టుకొనలేకపోయినది. వకుళ తనభర్తకొరకుగా మూడేండ్లనుండి శరీరపోషణలేకుండగానున్నది. జడలు అంటలు కట్టుకొనిపోయినవి. గోపాలరావు తిరిగి వచ్చినతర్వాత ముందు శ్రీలతవెళ్లినది. తర్వాత వకుళ వెళ్లినది. మొదట నొకరినొకరు చూచుకొనలేదు. గోపాలరావు మొదట శ్రీలతనుచూచినాడు. తరువాత వకుళనుచూచినాడు. శ్రీలతను ప్రేమించిన వకుళ ఏమనుకొనునోయని దేహత్యాగము చేసినాడు. తరువాత వకుళాశ్రీలతలు ఒకరినొకరుచూచుకొనినారు. శ్రీలత వకుళ చేతులుమాత్రమే పట్టుకొనినది. వకుళయో శ్రీలత తనపతిని ప్రేమించినదని తెలిసికూడ గౌరవముతో కాళ్ళకునమస్కరించి కండ్లకద్దుకొనినది. కృష్ణలోపడిన శ్రీలతనుచూచి తనకంటె ముందు దేహత్యాగము చేయుచున్నదని తనకూడా దూకినది. ఈ లోకసౌఖ్యములకొరకు ఆశించలేదు. పరలోకమందైనను భర్తను కలసికొనుటకు ప్రయత్నించినది. తన ప్రేమకు ప్రతిఫలములేకయే పతిని ప్రేమించి, పతి ప్రేమించిన శ్రీలతను గౌరవించిన వకుళపాత్ర గొప్పది కాదా?

—దుర్భా భానుమతీదేవి.

౪

శ్రీ కొడవగంటి కృష్ణమూర్తిగారి "కమల" అను కథలో నరసింహారావు అత్తగారు అల్లునకు మందు ప్రయోగించుటలో దురుద్దేశమేమియు లేదని తలంచెద. "ఎవరిని మెచ్చుకొందురు?"లో లోకులుపలుగాకులను మాట ఎఱిగియుండియు తన సౌఖ్యమును సర్వమును త్యజించిన గోపాలరావునా? కాదు. కాదు. భర్తయే దైవమనినమ్మి పరలోకమందాతనితో సౌఖ్యము ననుభవింప జనినవకుళనా? కాదు. ఫలాపేక్ష లేక సేవలను చిన్ననాటి ప్రేమ నభివృద్ధి చేసికొని మనోవాక్కాయ కర్మల గోపాలరావుని దక్క తదితరుల పరిణయమాడ నిచ్చగించని శ్రీలతనే మెచ్చుదును. గోపాలరావు సంఘమునకు, లోకులకు కట్టుబడి తన జీవితమును బలియిచ్చినాడు. వకుళయో తన సతీధర్మము నెరపినది. సతి పతికొరకెంతటి సాహసకార్యమునైన చేయగలదు. శ్రీలతనుచూచి చేసినపని యది. కనుక నేను శ్రీలతనెక్కుడు మెచ్చుకొందును. శ్రీలత వకుళలలో శ్రీలతయోగికి నమస్కరించి కుడిప్రక్కనిలచి వినయము వెల్లివిరియ "హృదయేశ్వరా! చిన్ననాటినుండి తమ్మే దైవముగా నమ్మియుండి నేటివరకు అన్యునిబడయనొల్లక తమకై వేచియున్న దాసి శ్రీలత తమ దర్శనార్థము వచ్చినది" అనుమాట లామెనోటినుండి వెడలినవి. కుడిప్రక్క నిలచుటలో తానాతనికమ్మడు వోయి నట్లర్థమిచ్చుచున్నది. అహో! ఎంతటి పవిత్రప్రేమ? తల ఊచినంతమాత్రమున తన కరగ్రహణ మొసర్చు నందరాంగు లెందఱులేరు. కాని శ్రీలత తన హృదయ సామ్రాజ్యమున గోపాలరావునధిష్ఠింపజేసి పూజించి

నది. మరల నాతనితోడనే మరణమాసించినది. అహో! శ్రీలతా! నీవేధన్యవు.

—తాయి రత్నమాల.

౫

గోపాలరావుహృదయములో వకుళకు తావులేదు. చిన్ననాటినుండి ప్రేమించిన శ్రీలతే అతనిమనోవీథి యందు తిరుగాడుచుండెను. కాని అగ్నిసాక్షిగా వివాహమాడిన వకుళను విడచిపెట్టుట కిచ్ఛగింపలేదు. గోపాలరావు వేరొకపురుషునొల్లక తనపరిశుద్ధప్రేమ కంతరాయము కల్పింపక తనకొరకై బ్రహ్మచారిణిగా నున్న శ్రీలతనుకూడా వివాహమాడవలెనను కొన్నాడు. కాని పాపిష్ఠిలోకము నాలుగుమాటలూ అన్నది. లోకానికివెఱచి తన ఇహలోకసౌఖ్యమును త్యజించి తుదకు విసిగి ఆత్మహత్యచేసికొనినాడు గోపాలరావు. కాన గోపాలరావు పిరికిస్వభావము కలవాడనియు, ధైర్యముతో ముందుకంజవేయజాల డనియు తెలియుచున్నది. ఇక శ్రీలతో—గోపాల రావు వేరొకయువతిని పెండ్లియాడినను తన నిష్కల్మష ప్రేమను త్రిప్పికొనజాలకపోయినది. కాని గోపాలరావు తనను చేకొనునేమోయని తుట్టతుద వరకు నిరీక్షించినది. కాని లాభములేక పోయినది. తుదకు ప్రాణములు కృష్ణానదిలోవిడచినది. ఆమె ప్రేమ పరిశుద్ధమైనది. పవిత్రప్రణయమే కాని ఈమె యందొకగొప్పలోపమున్నది. ఆమెకు ప్రేమఅంటే ఏమిటో తెలిసినవెంటనే ఆత్మహత్యచేసికొని ప్రాణ ములు బాసినగాని రోగినియైనగాని బాగుండెడిది. అట్లుచేసినయెడల గోపాలరావు తనమనస్సుత్రిప్పి కొని వకుళను ప్రేమించెడివాడు. పతియేదైవమని నమ్మి తల్లిదండ్రులను ఆప్తబంధువర్గమును విడచి వచ్చిన వకుళ సుఖమున కడ్డుతగిలినది. వకుళా గోపాల రావుల ఆత్మహత్యలకు శ్రీలతేకారణము. ఇక వకుళనుగూర్చి ముచ్చటింతుము—తనభర్తకు శ్రీలతయందే ప్రేమగలదని తెలిసినప్పటికి ఎన్నటికైనా భర్త యను గ్రహము బడయవచ్చునని భర్తయేదైవమనినమ్మి ఎల్ల వేళల అతనినే స్మరించుచు తనకాలము గడపినది. వకుళ పతివ్రతాధర్మము చక్కగా నిర్వహించినది. పరస్త్రీయైన శ్రీలత తనభర్తను ప్రేమించుచుండినను ఆమెయం దేమాత్ర మసూయ చూపలేదు, సరిగదా ఆమెను భక్తిభావముతో ఆదరించినది. పైవిషయము లనుబట్టి శ్రీలత గోపాలరావులయందు లోపములైనను కాన్పించుచున్నవి. కాని వకుళయందెట్టి లోపమును లేదు. కాన అగ్రస్థానము వకుళకే సమర్పించవలెను.

—తాయి రోజాకృష్ణవేణి.

౬

నరసింహారావునకు అత్తమందుప్రయోగించు టలో తనకుమార్తెపై ప్రేమకలుగుననునదియే ఆమె యభిప్రాయము. 'పెండ్లిచూపుల'లో లేచి సంగ తులు మాట్లాడుకొనవచ్చునుగదాయని అందఱు నిదు రించుచుండగా కుక్క అడ్డుగావచ్చి జానకమ్మ గం గాళముయొద్దనుంచిన చక్కెకట్లు రెండు నెత్తుకుపోయి నది. జానకమ్మకు చప్పుడుకాగా లేచిచూచుకొను సరికి దుఃఖము, కోపము ధరింపలేక తనస్థితి తెలి యక యాబొక్కినోటితోనే యేమేమియో అనసాగి నది. ఈమెమాటలాలించి అందఱువచ్చి ఆశ్చర్య ముగా చూడసాగిరి. ఆమెకు సిగ్గుకలిగి వచ్చినపనిని యెత్తకుండగనే భర్తతో వెళ్ళిపోయినది. ఇందు కథాభంగమునకు కుక్క యెక్కువగా సాయపడినది. ఇంతచక్కదనము పళ్ళులేని బొక్కినోరని తెలియక రామలక్ష్మి మురిసినది. 'విధి' అను గద్యవ్యా సమునందలి అంతర్నాదము శ్రీరామదాసులవారు చెప్పిన 'రాకన్ మానవు హోనివృద్ధులు మహోరణ్యంబులో డాగినన్' అను పద్యమునగలదు. గోపాలరావు లోక మునకు వెఱచి ఇరువురి స్త్రీలను పరిగ్రహింపలేక పోయెను. ఎవతెనువిడచుటకును ఒకతె అగ్నిసాక్షిగా వివాహమాడినస్త్రీ, వేరొకతె చిన్ననాటనుండి తన మనోవీథినాటిన ప్రేమైక నిధానము. కాన కొన్నాళ్లు కొట్టుమిట్టాడి విసిగి యిరువురి నిర్మలప్రేమనుజూచి దేహముచాలించెను. వకుళయనిన లోకనిబంధనలకు

కట్టుబడిన స్త్రీ. పూర్వపుభారతనారీమణుల ననుసరించినది. అదియునుగాక భర్తలేనిబ్రతుకు వ్యర్థము. ఇక నీలోకమున తనకు సుఖమెక్కడిది. కాన నన్నియు యోజించి భర్తననుసరించినది. వీరిరువురిసంగతి సామాన్యము. శ్రీలతయనిన ఎట్టి లోకనిబంధనలకును కట్టుబడకయే ప్రేమస్వరూపుడగు గోపాలరావును స్మరించుకొనుచు దినములు పుచ్చినది. తలిదండ్రులు వివాహముకమ్మని యెంత చెప్పినను, దుర్లభుడగు మనోనాయకునే మనసార భజించినది. తరువాత గోపాలరావు చనిపోయినవెనుకనయినా వివాహమాడుదునని యెవరడ్డుపఱచుటకును వీలులేదు. ఈముగ్గురిలో ప్రేమనే మానసముననిల్పి ఎట్టినిబంధనలకు కట్టుబడకయే చిననాటి చెలికానిచేరి సేవించుచు, స్వర్గంబునసహిత మతనివీడకయేగిన శ్రీలతయే మిన్నయని మదభిప్రాయము. —సామినేని హనుమాయమ్మ.

౭

నరసింహారావు కమలతలంపేలేక అన్యథాయత్తచిత్తుఁడైయుండెనను భ్రమయు, పెట్టుమందులన్న నమ్మకమును, అల్లునిసుముఖునిగఁజేసికొన్నచో తన రెండులక్షల యాస్తితోవచ్చి తమ యింటియొద్దనే యుండునను నాశయుఁగల యత్తగారు తనయల్లునికి దగ్గరబంధువులు లేమింజేసి యించుక దురాశాపిశాచగ్రస్తయై యట్లు కాఫీలో మందుకలుప సాహసించెను. మానవుని జీవయాత్రలో నెదుట ననేకమార్గములు గోచరించుచుండును. తనకు భాగ్యమబ్బు విధివ్రాలు నుదుటలేని నిర్భాగ్యునిబుద్ధి తత్తదుచితమార్గంబులఁ జనదు. అప్పటిమట్టుకు తానున్నస్థితియే యుక్తమోత్తమమనియు, తదితరమార్గగమనము నష్టదాయకమనియు వానికిఁదోచును. తుదకు తాననుకొన్నదానికి వ్యతిరేకఫలితమే చేకూరును. తానొకటితలఁప దైవమొండు దలఁచుఁగదా! విధివిధానముఁ దప్పింప నేరికిఁ దరము? కథాభంగకారకురాలు "లిల్లీ". ఎక్కువభాగము లిల్లీదే. ఏలన, పెండ్లిచూపులకనివచ్చు వియ్యాలవారిని గౌరవించుటకు ప్రయత్నములు చేసినది మొదలు అందరివెంటను కూడకూడ తిరిగినది లిల్లీయే. వియ్యాలవారి కందరకంటె ముందు స్వాగతమిచ్చినది లిల్లీయే. ఫలహారములలో భాగముగొన్న యతిథి లిల్లీయే. తుదకు గంగాళమునొద్ద జానకమ్మ కడిగిమలచిన కృత్రిమంపు పండ్లకట్లు "వెనుకటిగుణము" చెప్పిన నోటకఱచుకొనిపోయి కోతికి కొన్నిపండ్లూడలాగినది లిల్లీయే. అందరొకచోటఁగూడి జానకమ్మ కోదన కారణ మారయుచుండ, సందేహనివృత్తిగావించినది లిల్లీయే. పాపం! జానకమ్మ బోసినోరుబయటఁబడ దుఃఖపడినది. ఆరాత్రి కాపినందులకు భర్త పైఁగోపించి వెంటనే బండికట్టించినది. అహో! కృత్రిమదంతములవల్లఁ గలిగిన ముప్పుగదాయిది! కాంతలారా! ప్రకృతికి సౌందర్యమును దిద్దజాలకుఁడు. నారింజపండ్లనేక తత్త్వములకమృతప్రాయముగఁబనిచేసిన దృష్టాంతములనేకములు నాయనుభవముననున్నవి. "శర్మానంద" గారి కషాయౌషధములలో చాలవరకు నారింజపండుపై చర్మమే కలియును. ఆయౌషధము లద్భుతముగఁబని చేయలేదా? సుమారొక దశాబ్దినుండి నారింజపండ్లు వ్యాప్తినొందినవి. అవి విషతుల్యమగుచో వైద్యలోకమున వాని కింతయాదరువుండి యుండునా? కావున యోగీంద్రులవారియభిప్రాయము నాబోంట్లకు వ్యతిరేకమే. మాత్రయజ్ఞము వ్యాసకర్తల యభిప్రాయముతో పూర్తిగ నేకీభవింతును.

—అయ్యగారి సూర్యనారాయణమూర్తి.

౮

శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తిగారి "కమల" అను కథలో నరసింహారావుకు అత్తగారు మందుపెట్టుటకు కారణ మాతనియొద్ద మిగుల డబ్బుండుటచే నాతడు జచ్చినచో నది యంతయు తమకే జెందుననియు, తమకుగల ఏకపుత్రిక నిచ్చుటచే యుంచుకొనవచ్చుననియు నామె యుద్దేశమైయుండును. పెండ్లిచూపులు అను కథాభంగమునకు లిల్లీయు, జానికమ్మయు ముఖ్యులు. ఎట్లన జానికమ్మ ఇంటికివచ్చుటయెతడవుగ లిల్లీ బిగ్గరగా మొరుగుటచే నామె భయపడియుండవచ్చును.

ఆరాత్రి జానకమ్మ అచ్చట పరుండకపోయినచో ఆకలవరింత లుండకపోవును. ఎక్కువపాళ్లు లిల్లీదె యున్నది. ఎవరిని మెచ్చుకొందురు? అను కథలో శ్రీలతనె మెచ్చుకొనవలయునని నాయుద్దేశము. కారణము గోపాలరావుకు పెండ్లిఅయినను, యుద్ధమున కేగినను, రోగియైననుగూడ అపవిత్రప్రేమంపు తడవు నూడ జేయక జాలక ఆయర్ధరాత్రమున నాతని చివర మాటలవిననతోడనే నాతనిపాదసన్నిధిని వకుళకంటె మున్ముందు తనువులబాసినది. నిర్మల ప్రేమకొరకింత ధైర్యవంతురాలైన వీరవనిత శ్రీలతయేనని చెప్పక తప్పదు. పుష్పచయములోని సూత్రయజ్ఞము: సైయుండియన్ లీగు వ్రాసిన శ్రీకొండిపర్తి పున్నయ్య గారిఅభిప్రాయముతోనే నేకీభవించుచున్నాను.

—అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మ.

౬

ఆగస్టుసంచికలోని 'కమల'అనుకథలో నరసింహారావు అచ్చమైన ఆధునికవిద్యార్థి వనిపించినాడు. 'చిచ్చునకుతోడు కరువలివచ్చినట్లు' విద్యకుతోడు విపులసంపదకలిగింది. ఇకనేమి? కథకులు నిర్ణయించినట్లు గర్విష్ఠికాకపోయినను బెట్టుసరిమాత్రము తగ్గలేదు. దానిలో నాలుగేండ్లయినను అత్తవారిగడప త్రొక్కలేదు. సహాధ్యాయుల యపహాసనముల కాస్పదమైనాడు. ఇట్టితత్త్వము మరి ఆధునికయుగమున అల్లుళ్ళనుచూచి ముళిసిపడు అత్తగార్లకు సరిపడునా? నరసింహారావు అత్తగారును ఆతరగతిలో చేరినదే. కాని పుత్రీప్రేమ యొకవంక యేమాత హృదయమునైనను ద్రవీభూతము చేయకమానదుగదా! కూతురు మేలుగోరి యల్లునకు మచ్చుమందుపెట్టినని భావించుటయే యిచ్చట సహేతుకమని నాకు తోచుచున్నది. అంతియేగాని బలవన్మరణము పాలుచేయ నత్తగారు సంకల్పించినదనుటకు వలసిన హేతుభూతములను కథకులు పొందుపరచియుండలేదని కథవలననే తేటతెల్లమగుచున్నది. 'పెండ్లిచూపులు' అను కథలో కథాభంగమునకు 'లిల్లీ'యే ముఖ్యకారణము. అమాయకురాలగు రామలక్ష్మి జానకమ్మ పగటివేషమునకు లొంగిపోయినది. జానకమ్మకు పూర్తిగా అవమానం జరిగింది. సౌందర్యాధిదేవతయని యొకప్పుడు రామలక్ష్మిచే ప్రశంసింపబడినావిడే, గుట్టుకాస్తా బయటపడేసరికి పోసినోటిపెద్దమ్మ అనిపించుకునే స్థితిలోకి వచ్చింది. దొంగతనం దాగుతుందామరి. కట్లుపండ్లు కాసినీ లిల్లీమూలానవూడి క్రిందపడేసరికి జానకమ్మకు దద్దుబిద్దులు తటస్థించినై. కథానంతరం రామలక్ష్మి మనోవేదన కథకురాలు పాఠకులకే విడిచిపెట్టింది. ఒకప్పుడు రామలక్ష్మి 'ఈవిడే యింతగా అందంగా వుంటే పిల్ల యింకా యెంతఅందంగావుందో' అని గాలిలో మేడలు కట్టింది. ఇక నటియాశల కవకాశమేది? ఈకథలో మూలసూత్రమంతయు లిల్లీగళమునకే బంధింపబడివుంది. సందేశము కృతకసౌందర్యము సహజసౌందర్యమును జయింపజాలదని, 'విధి'లో 'తానొకటితలచిన దైవమొకటితలచు'నను లోకోక్తి విస్పష్టముగ తెల్లమగుచున్నది. అల్లకల్లోలతరంగాభీలమైన సముద్రమునుండి, క్రూరమృగసంకులమగు యరణ్యమునుండి వచ్చునటువంటి యాపద, తీరికూర్చుని సురక్షితముగా కొండపైనున్న పాంథునే యలయించుట భగవద్విలాసముగాక మరేమి? ఇచ్చటి అంతర్నాదము భౌతికదేహసంబంధమైనదానినిగ భావించవచ్చును. జీవుడు నిరవధికానందానుభవమునుకొని, విషయలోలతయను కొండనెక్కును. జ్యోతిర్మయజ్ఞానమార్గమును మోక్షసాధనమనియెంచక, సాగరమనియు, కాంతారమనియు సంభావించును. తుదకు వ్యతిరిక్తభావనాఫలప్రాప్తుడై యధఃపతితుడగును. 'ఎవరిని మెచ్చుకొందురు?' అనుకథలో గోపాలుడు పిరికిబంటై లోకమునకు తెలిచినాడు. వకుళా శ్రీలతల కిచ్చటను పరస్పరసైమ్యభావములున్నట్లు కథలో కానరావు. అట్టిరొండప్రణయమును స్వర్గతుల్యముగ చేసికొనవలసిన దినములలో ఐరోపాసంగ్రామమను మిషపై దేశాంతరములకుజని, యుద్ధములోనైనను పేరుగాంచక భీరువువలె రోగియై, కడకు జలమరణమునందిన గోపాలు నెవరైన యెట్లు మెచ్చెదరో నా

కగోచరముగనున్నది. ఇక వకుళ చేసినపనియా? మెచ్చతగినదేకాని హిందూసుందరీమణులకు పత్యనుసరణము పరిపాటైపోయినది. ఆమాంగల్యసూత్రముపై నాధారపడియే నిజనాథునికొఱకు వకుళ తనప్రాణముల నర్పించినది. అట్లుచేయుటకు ముందుకూడ వకుళ, స్త్రీజనోచితమగు సపత్నీయీర్ష్యను కనుబఱచక చాలాలౌకికముగా ప్రవర్తించి శ్రీలతయన్నను పాత్రురాలై కడకామెమార్గమునే మరణించుటలోకూడ యనుగమించినది. ఏతన్మూలమున వకుళ గోపాలునికంటె వేయిమడుంగులు మెచ్చదగినది. ఇక శ్రీలత ఈమె స్వార్థత్యాగ మత్యద్భుతము. పెండ్లికాకపోయినను భర్తకన్నమిన్నగ ప్రేమపాత్రునిగభావించి, వివాహము పరపురుషునితో నొల్లక, త్రికరణశుద్ధిగ గోపాలుని హృదయమునకోరి, అతనిమేలుకొఱకు దేవీపూజలుసల్పి, తన వినయవిధేయతాసద్వర్తనములచే వకుళకుకూడ మార్గదర్శినియై చివరకు ప్రియుఁడు నిరాదరింప యసువులబాసిన పరమపావనమూర్తికాన శ్రీలతకే యీ మువ్వురిలో ప్రథమస్థానమీయఁదగును.

—గాలం రంగనాయకమ్మ.

౧౦

శ్రీకొడవటిగంటి కృష్ణమూర్తిగారి "కమల" అను కథలోని అత్తగారి పెట్టుమందువిషయమై విద్యావతికాక మందునమ్మకముగల, మూర్ఖపు నమ్మకములుగల యువతియగుటచే ఒక్కగానొక్కకూతురగుటచే, అల్లుఁడగు నరసింహారావు రాకపోకలులేక పెడసరపు స్వభావముగలవాఁడగుటచే ఈమందురీత్యా మమకారముకలవాఁడగునన్న నమ్మకముచే పెట్టియుండును. శ్రీకళ్యాణసింగుగారి "విధి" అను వ్యాసమందలి సారాంశము విధి మనకనుకూలముకానప్పుడు మనమెంత సురక్షితమపేక్షింతుమో అది అంత హానికరమై అపాయములనుకున్నవి సురక్షితములైయుండును. శ్రీచిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాదుగారి "ఎవరిని మెచ్చుకొందురు?" అనుకథలోని శ్రీలతయే మెప్పునకు ప్రథమస్థానమలంకరించును. ఏమన చిన్నతనమందు వివాహమైనను హిందూపత్నికి భర్తయే దైవమనియు అతనితోడిదె లోకమనియు చెప్పబడి నడుపబడియున్నందున పతిహృదయమున ధర్మపత్నియగు తనకు స్థానములేకపోయినను ధర్మమగు నడవడికగల వకుళ భర్తానురాగినియై పతివియోగభారహృదయంబు దహించ ఆత్మహత్యచేసికొనుట గౌరవనీయమేకాని అది ధర్మసహజము. శ్రీలతయో హృదయానురాగమే ప్రధానమనినమ్మి త్రికరణంబులలో ముఖ్యమగు మనస్సుచే వరించిన గోపాలరావుకొఱకు ఆజన్మమవివాహితయై ఒకవనితకు సగమర్పించిన ప్రియునికొఱకు నాయబూనక ప్రేమశీలముల కట్టువడి హృదయదేవతకొఱకాత్మార్పణ మొనరించుకొని పరలోకమున శాశ్వతబంధమొనరించుకొన్నది. నిజమైన పవిత్రప్రేమకొఱకు జీవితకుసుమము కాలవాహిని కర్పించుకొన్న శ్రీలతయే తొలిపువ్వును. లోకనిందకువెఱచి గోపాలరా వాత్మహత్యచేసికొనుటలో వింతలేదు.

నారింజపండు చేదుచమురులోగూడిన చర్మయుతఫలమగుటచే విషఫలమను శ్రీపొత్తూరి రామరాజయోగీంద్రులవారి అభిప్రాయ మాశ్చర్యకరము. పరీక్షించి విలువ తెలిసికొని చెప్పిన అనేక డాక్టర్ల సలహాలవల్లను తినినవారి స్వానుభవమువలనను అది అమృతతుల్యఫలమని నిర్ధారణచేయబడి వాడుకచేయబడుచున్నది. పైగా ఈపండుమంచి సంగతి తెలిసిన యీకొద్దివత్సరములనుండియు సర్వజనులచే వాడుకచేయబడి ఖరీదు హెచ్చినదికాని మాచిన్నతనమాది ఈపండ్లుచౌకగాకొని సమృద్ధిగాతినియున్నవారము. పాతికసంవత్సరములుగా మాకుటుంబములలోను మా బంధుమిత్రకుటుంబములలోను వాడుకచేయుచున్న నాయెరుకలో నాస్వానుభవములో మాకేమీవిషమించలేదు. యోగిగారనే సంభవమెక్కడిదీ లేదు. నిమ్మ, దబ్బకూడా ఈచేదుచమురుగల చర్మజాతిలోనివేకదా? అవి అనాదిసిద్ధముగా మనపూర్వీకులనాటినుండి ఊరుగాయక్రిందను వంటపదార్థములలోను పానీయములక్రిందను ఉపయోగించబడుచున్నవి. మాఅనుభవముచే అట్టిపదార్థములు పథ్యరూపకములని నిర్ణయించి రోగు

లచే భుజింపబడుచున్నది. ఆయుర్వేదవైద్యరీతికూడ ఈఫలములు విషఫలములుకావని మా అభిప్రాయము. "సూత్రయజ్ఞము" శ్రీకొండిపర్తి పున్నయ్యగారి అభిప్రాయముతో మేముపూర్తిగా ఏకీభవింతుము. ఏమన బీదసాదలకు వృత్తికరమై "గృహలక్ష్మి"చేతి బంగారమై సర్వజనులకు సమానలాభముల పొందజేయు రాట్నపరిశ్రమమూలబడి గొప్పవారుమాత్రమే మిల్లు వర్తకముచే ఇంకను గొప్పవారగు అవకాశముకల్పించే మిల్లుబట్టలుమానుటయే ముఖ్యాశయము. ఇట్టి మిల్లు బట్టలు చౌకగాఅమ్ముటకు లాభకరముగ చాలినంత ఖద్దరుబట్టదొరకక చరకాబట్టఖరీదు హెచ్చుగుటచే సామాన్యులు బీదలుకొనలేకను సన్నమని మోజు బడియు (ఇదివరకల్లా విదేశవస్త్రధారణ అందచందములలవాటయుంటబట్టి) ముతకయన్న నిరసనభావముచేతను ఖద్దరు వ్యాప్తినందకపోవుటకు కారణము. దేశాభిమానము స్వాతంత్ర్యకోరువారి కీపన్నెచిన్నె లనవసరము.

—ఆచంట సత్యవతమ్మ.

౧౧

శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తిగారి "కమల" అనేవ్యాసములో నరసింహారావుకు పెండ్లయి నాలుగేండ్లయింది. ఎన్నిమార్లుపిలచినా అత్తవారింటికి వచ్చుటలేదు. అత్తకు అల్లుడంటే ప్రేమగదా? అల్లుడు రావాలని, తానుపిండివంటలతోటి బాగా అల్లుడికి మనుగుడుపుచేద్దామని అత్తకుంటుందిగదా? ఇది లోకసహజమే. అయితేనేం? నరసింహారావు అందరి అల్లుళ్ళాంటివాడుకాడు ఈఅత్తగారికోర్కె నెరవేర్చడానికి. ఎంతయెక్కువమర్యాద తనకుచేస్తే అంతఅసహ్యం. తనకు ఒకరు మర్యాదచెయ్యకూడదు. ఒకరికి తానూ మర్యాదచెయ్యడు. ఎవరన్నా తనను భోజనానికి పిలుస్తే పైగా యెందుకురా రావటం? నేను రాకపోతే మీకు చుట్టాన్ని కాకపోతానా? అంటాడు. అల్లుడు రాకపోవటంచూచి ఉపాయంగా అత్తగారుపెట్టుమందు పెట్టబోయింది. కమల చాటునుండి ఇదంతాచూచింది. కాని ఈఅర్థంచేసుకోక వేరేఅర్థంచేసుకొని భయపడి భర్తతోచెప్పివేసింది.

శ్రీమతి అద్దంపూడి అన్నపూర్ణమ్మగారి "పెండ్లిచూపులు" చాలాబాగుంది. ఇందలి ఎక్కువపాత్ర "లిల్లీ"దే. రావడమే లిల్లీనిచూచి బెదిరింది జానకి. పైపైమెరుగులుచూచి మోసపోయింది రామలక్ష్మి. పడుకోబోయేముందు బావగార్ల ప్రసంగంలో "దాని గుణం యెక్కడపోతుందండీ? పద్యంచదవలేదూ? యేదో కాకులుతెచ్చి పడవేసిన యెముకలు కొరుక్కుంటుంది?" అన్నట్లు అదిక్షుద్రజాతిది. జానకమ్మతగిలించుకున్న పళ్ళుతీసి దగ్గరపెట్టుకున్నట్లు పసికట్టింది లిల్లీ. అవి యెముక లనుకొని కొరకడం మొదలెట్టింది. అది కొరకడంవల్ల సగంపళ్ళురాలాయి. జానకమ్మ ఈచప్పుడువిని లేచింది. జానకమ్మకేకలకు లిల్లీ పళ్ళు నోట్లోపెట్టుకొని గుర్రుమనడం ప్రారంభించింది. ఇట్లు కథాభంగానికి సాయపడ్డది "లిల్లీ."

"ఎవరిని మెచ్చుకొందురు?" అనేకథలోని గోపాలరావుపాత్ర, సర్వముత్యజించి తన సౌఖ్యమును లక్ష్యపెట్టక లోకమునకు వెరచి ప్రాణత్యాగము చేయవలసినవిధి గోపాలరావునందున్నది. ఇకవకుళపాత్ర, పతియే పరమదైవమనినమ్మి, భర్తలేనిజీవనము లడవినిగాసిన వెన్నెలవంటిదనియు, ప్రాణత్యాగమే తన పరమావధియనియు దలచి ప్రాణత్యాగము చేయవలసినవిధి గోపాలరావునకు ధర్మపత్నియైన వకుళయందున్నది. ఇక శ్రీలతయో! చిన్ననాటిప్రేమచేనమ్మి గోపాలరావునే తన దైవమనినమ్మి, అతడు వైరాగ్యమును పూనుటతోడనే తానును వైరాగ్యమంది, అతడు "నేటితో ఈదీపము చల్లారును" అనెడి మాటలువిని, ఇంక తనకీఇహలోకమున సౌఖ్యము లేదని నమ్మి పరలోకమందైన నతనితో సౌఖ్యమంద నిశ్చయించి వకుళకన్న ముందే దారితీసినది శ్రీలత.

—పాకల చంద్రకాంతామణి.

౧౨

"కమల"అనుకథలో అత్తగారు పెట్టుమందు అల్లునికి ప్రయోగించినదనుటకు కమలచెప్పినవాక్యముతప్ప

వేరొక నిదర్శనము కనుపించదు. పెట్టుమందు ప్రయోగించబడినదను నెపమున నిరసించబడిన కాఫీని మామగారైన ప్రసాదరావుగారు త్రాగినారు. పానీయమును సేవించినయనంతరము ప్రసాదునియెడ ఎట్టిమార్పును కలిగినట్లు కథలో వ్రాయబడలేదు. కాకున్నా కాదని కమలవల్కులే వేదవాక్యములగా విశ్వసించి అత్తగారు మందు కాఫీలో కలుపుట యదార్థమని నిర్ధారణచేసి యామె యుద్దేశమేమైయుండునని ప్రశ్నింతురా? ఆమె భావము తేటతెల్లమే. పెండ్లియైన వెనుక యెన్నిసార్లు ఆహ్వానించినను అల్లుడు వారింటికి రాలేదు. పిల్లయెదిగినది, వచ్చి కార్యము చేసుకొనవలసినదని కబురుపంపినను వచ్చికనుపించలేదు. అందుచేత అల్లునికి తనకూతురుపై మక్కువలేదనియు, తమయొక్క లక్ష్యములేదనియు అత్తగారనుకొనుట యసంభవముకాదు. ఇట్టిస్థితిలో ఏనాడును రాని అల్లుడు ఆనాడు వచ్చినాడు. సమయము వ్యర్థపుచ్చుకొన్నపిదప విచారించుట గతజలసేతుబంధనము వంటిదని గుర్తించి అల్లునికి తనకుమార్తెపై ప్రేమకలుగుటకును తమయందు లక్ష్యముంచుటకును మందు ప్రయోగించియుండునని నాఅభిప్రాయము. పెండ్లిచూపులు-అనుకథయందలి సకలకార్యదక్షత్వమునకును సహాయ మొనరించినది "లిల్లీ". కథలో దానిదే యెక్కువపాత్ర అని నాయూహ. "ఎవరిని మెచ్చుకొందురు" అను కథా కాలము 1914 సంవత్సరమునకు ముందైనట్లు కాన్పించుచున్నది. అప్పటికి శారదాచట్టము అమలులోనికి రాలేదు. కావున కొన్నిజాతులయందు బాల్యవివాహములు మరికొన్నిజాతులయందు రజస్వలానంతర వివాహములును చేయుట ఆచారమైయుండెడిది. ఇందు వకుళది బాల్యవివాహము. తల్లిదండ్రులయిష్టప్రకారము జరిగినది. శ్రీలతది రజస్వలానంతరవివాహము. స్వయంవరసూత్రము ననుసరించినది. కాలమునుబట్టి ఇందెవరి వివాహము ధర్మానుసారమో యెరుగుటకు వీరేజాతి వారో తెలియవలయును. ఇక గోపాలరావు విషయము నిర్వివాదాంశము. ఇతనిని యెవ్వరును మెచ్చుకొనరని నాయూహ. గోపాలరావు లోకమునకు వెరచి తన్నునమ్మిన తన్వంగుల నర్ధాన్న మొనరించి యాత్మహత్య గావించుకొన్న షండ. వీని యూహను అనవసరము. ఇక శ్రీలతవకుళలలో నెవరు మెప్పొంద తగినవారనుదానిని నిర్ధారణచేయుటకు వారేజాతి వారో తెలియవలయును. —కె. నాగమణి.

## ౧౩

"ఎవరిని మెచ్చుకొందురు" అను వ్యాసములో వకుళపాత్రము ప్రశంసార్హము. వకుళ గోపాలరావును అగ్నిసాక్షిగా పెండ్లియాడినభార్య. శ్రీలత చిన్నతనమునుండి గోపాలరావును ప్రేమించి గోపాలరావు ప్రేమనాకర్షించిన యొకస్త్రీ. శ్రీలత గోపాలరావును ప్రేమించినస్త్రీయని వకుళకు పెండ్లినాటికి తెలియదు. అప్పటికే గోపాలరావుకు శ్రీలతపై ప్రేమ ఆవేశమైనది. ఆస్థితిలో వకుళ శ్రీలతపై ఎట్టి భావము ఉంచుటకు తావులేదు. కాలము గడచిన తరువాత గోపాలరావు మనస్సు-ఛాయ-శ్రీలత అని గ్రహించియు వకుళ ఎట్టిసాహసమునూనలేదు. దీనిని బట్టి శ్రీలతని ఏమంటే ఏమికోపవస్తుందో భర్తకి అని వకుళ పతిమనస్సు విరుగకుండ శ్రీలతవంటి సతితో అజన్మాంతము సఖ్యతగా మెలగింది. ఇక్కడ వకుళను కౌశికుని కోరికదీర్చ కాశికునిభోగపుస్త్రీయింట సేవచేసిన సుమతీదేవితో పాతివ్రత్యమున సరిపోల్చనగును. శ్రీలత తానుపతిఅనుకొన్న గోపాలరావునుదప్ప మరి యితరులను పెండ్లాడనని కచ్చితముగా స్పష్టపరచినపుడు వకుళ సౌజన్యము వర్ణనాతీతము. గోపాలరావే శ్రీలత, శ్రీలతే గోపాలరావు అని గ్రహించినపుడుకూడ తాను నడచినతీరు అనన్యోపేతము. స్తుతిపాత్రము. గోపాలరావు ఐరోపాసంగ్రామమునకు ఇల్లువిడచి పోయినతరువాత కవి చిత్రించిన శ్రీలతకును వకుళకును చాలతారతమ్యము గలదు. ఆవర్ణననుబట్టిచూడ శ్రీలత కేవలము విరహిణివలెను వకుళ పతివిదేశములందుండ పతివ్రత

యాదర్శచిహ్నములు స్ఫుటముగా గోచరించుచున్నవి. ఏలయన "శ్రీలత పాండుర దేహమును తెలిపట్టు చీరయు, ఎఱ్ఱబడిన కన్నులు-వకుళ పతి యిల్లువెడలిన నాటి శిరోజబంధము-మూడేళ్ళక్రిందట ముడివైచిన కేశములు-శల్యావశిష్టమైన దేహము" అని కవి వర్ణించుటయే. దేవాలయములో శ్రీలత హారము తెగ నామెమనస్సు చివుక్కుమనెనని కవివర్ణించుటయు వకుళ హారతిపళ్ళెము చేజార కనులనీరు ప్రవహించుటయు వారిరువుర ప్రేమలోని తారతమ్యమును వ్యక్తీకరించుచున్నవి. గోపాలరావు తిరిగి యోగిగా శ్మశానమున రావిచెట్టుక్రిందనుండగా నొండొరులకు తెలియకుండ శ్రీలతయు, వకుళయు అతని దర్శించి తిరిగిపోయి మరల మర్నాడు దర్శించునపుడు శ్రీలత వకుళను గుర్తించి నవ్వినది. వకుళయో అట్లుగాక శ్రీలతను గుర్తించి కనులతో నమస్కరించినదని కవి చిత్రించినాడు. దీనిలోని భావమేమి? వకుళ సౌహార్ద్రబుద్ధి చిన్నతనములో—తనకు పెండ్లినాటి ఔదార్యము, సౌజన్యము నేటికిని రవంతయైన కాను గీటుకు తగ్గలేదు. తరగలేదు. యోగి అంతవరకు కనులు తెరువక తన యిరువేల (నిద్రావస్థలోని కృష్ణుని కడ దుర్యోధనార్జునులట్లు) వకుళా శ్రీలత లున్నట్లు తెలిసి యెట్టకేలకు కనులుతెరచి ముందు శ్రీలతను చూచి తరువాత వకుళవైపునకు దృష్టినిమరల్చెను. ఈదృశ్యమున వకుళ ఆతురతతో "నాథా! నాథా! నేను నేను" అనక తన ఆత్మబలముచే నిగ్రహించుకొని పతి చూపకపోనువాయని ధైర్యమును చూపినది. యోగి కడమాటలువిని శ్రీలత వకుళను పిలిచి బాగుమని హృదయదౌర్బల్యమున నేలవ్రాలినది. వకుళ ఆత్మనిగ్రహముచే తన...యగు శ్రీలతపాదములపై బడి నమస్కరించినది. వకుళ ధైర్యముగలదియగుటచే చావునిశ్చయించుకొన్నను దైవప్రార్థన సాగించినది. శ్రీలత భగ్నహృదయముతో గుళ్ళిల్లున కృష్ణానదిలో మునిగినది. వకుళ తన యంత్యప్రార్థనమున "తన భర్త తానుముందే పోవుదునని చెప్పుటచే భర్త చని పోయిన సంగతి చెవులబడకుండగనే యాతనినే దైవముగానమ్మి పరలోకమునందైనను అతనితో సౌఖ్యమునొందు భాగ్యము ప్రసాదింపుమని గోపాల రావును ధ్యానించి ఆత్మార్పణంబును గావించి ధన్య యయ్యెను.

—పాముర్తి వేంకటరమణ.

౧౪

కమలకథలో నరసింహారావుఅత్తగారు అల్లునికి మందుపెట్టుట వశీకరించుకొనుటకై యుండనోపు. అల్లుని యెన్నిసార్లుపిలచినను రాకపోవడము చేత విసిగి యీపని చేసినది. కొందఱి కది విషమేమోఅని సందేహాస్పదమగును కాని మేమావిషయ మంగీకరించము. అల్లునిచంపి అత్తయేమి యొడిగట్టుకొనును? కన్నకూతురికి వైధవ్యప్రాప్తియు, తనకు నిందాసంప్రాప్తియునని తెలియదా? కల్యాణసింగుగారి 'విధి' యను గద్యకావ్యము జగచ్చక్రవర్తి మాయావిలాసమును సూచించుచున్నది. 'ఎవరిని మెచ్చుకొందు'రనుకథ కూతపట్టు గోపాలరావు కథానాయకుడు. అతనికి ఒకప్రక్క ప్రేమసూత్రముచేతబంధింపబడ్డ శ్రీలత, మంగళసూత్రముచే బంధింపబడ్డ వకుళ—ఎవరిని చేరదీయుటను? లోకులు వలుగాకులై నోటికివచ్చినట్లుకూసిరి. గోపాలరావు సన్యాసియై తిరిగివచ్చినప్పుడుగూడ అతనిని ప్రేమమూర్తులు వెంబడించిరి. చివఱకు ముగ్గురును జలదేవతకు బలియైరి. ప్రేమమహత్తును సూచించుచున్న దీకథ. కొండిపర్తి పున్నయ్యగారిసూత్రయజ్ఞము: వైఇండియన్ లీగు అనువ్యాసమునందు ప్రజలు ఖరీదు ఎక్కువైనప్పటికిని ఖద్దరునే ధరించవలెగాని మిల్లుబట్టల కట్టరాదని చవుకయనియు పటాటోపమును జూచి మోసపోయి మిల్లుబట్టల నేకొనుచున్నారనియు, అట్లు పొరబడవలదనియూ యుద్బోధించుచున్నారు. వైయిండియన్ లీగు పుట్టుపూర్వోత్తరములగుఱించి కూడ ఇంచుక చర్చించిరి. వీరిఅభిప్రాయముతో నేకీభవింతుముకాని నిజముపేదలు ఖద్దరుకొనగలరా అని సంశయముకల్గుచున్నది. బాగుగా ఖద్దరుత్పన్నమై చవుకఅయిన అందఱికి ఖద్దరుధారణ చేయుటకు వీలగును.

—మరకాని పరాత్పరరావు.

౧౫

"నారింజపండు విషతుల్యము" అను విషయమును గూర్చి పులిచేర్వులు-అకీర్తి నారింజపండ్లు తినుట వల్లను, నిమ్మకాయపచ్చడి తినుటవలనను వచ్చుట నాకనుభవములే. అరుచి-దంతస్పర్శలో అనేకవిధమైన మార్పు గూడ కలుగుచుండును. శ్రీ కొండిపర్తి పున్నయ్యగారి అభిప్రాయముతో నేకీభవించుచున్నాడను.

—చదలవాడ ధర్మరాజు.

౧౬

శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తిగారి "కమల" అను కథలో నరసింహారావుఅత్తగారు పెట్టుమందు పెట్టినట్లులేదు. తనను పిలుచుకొనివెళ్లుటకై కమలయే ఇట్టి యుక్తి పన్నియుండును. అన్నపూర్ణమ్మగారి "పెండ్లిచూపులు" అనుకథలో ఎక్కువపాత్ర జానకమ్మదే. ఆమె చేతిపండ్లు కట్టించుకొన్నట్లు ఆరాత్రి గంగాళము వద్దకువెళ్ళి పండ్లుకడుగుకొన్నట్లు, నిద్రపోవునప్పుడు వాటిని తీయకపోవుటచే నిద్రలో పండ్లురాలిపోయినట్లు, ఈరహస్యము రామలక్ష్మి వారలకు తెలియునేమోననియూ ఆమె అట్లు గడబిడచేసెను. కథాభంగమునకు చేతిపండ్లు కారణము.

—నాయిని హనుమాయమ్మ.

౧౭

"కమల" అను కథలో నరసింహారావు అత్తగారు అల్లునకు పెట్టుమందు ప్రయోగించుటలో దురుద్దేశము లేదు. నాలుగు సంవత్సరములనుండి అత్తవారి యింటివైపు పెడమొగము పెట్టుకొని వారియందు నిర్లక్ష్యభావము చూపినందున, ముందు తనయేకపుత్రిపై కూడ నట్లే నిరాదరణ చూపునేమోయని భయపడి, అల్లునికి సంపూర్ణప్రేమ యొడ తెగక నిలుచునని భ్రాంతిపడి, పిచ్చినమ్మకముగల కమలతల్లి, మరులుమందులు యనుభ్రమతో యేదోయొక మందుకలిపి యుండనోపు. ఎవరిని మెచ్చుకొందురు అనుకథలో గోపాలరావు లోకమునకువెఱచెను. వకుళ తన విద్యుక్త ధర్మమునెఱవేర్చెను. శ్రీలత తన నిర్మలప్రేమవాహినులచే, గోపాలరావును బ్రతిమాలి, బ్రతిమాలి, కడకు తన ప్రాణమునుసహితము గడ్డిపోచగత్యజించి, తన మనోనాథుని పాదములకడ సమర్పించుట ప్రశంసనీయము. వకుళప్రేమ వివాహబంధములతో కట్టుబడినది. శ్రీలతదన్ననో, అంతకంటె మిన్నయగు పవిత్రపాశములతో కట్టబడినది.

—జంపాల జగన్నాథరావు.

౧౮

నరసింహారావు అత్తగారు అల్లునికి ఎన్నిసార్లు పిలచినా రాకపోవుటచూచి, అత్తగారి ఇంటివైపు మనస్సుతిరుగ పెట్టుమందు ప్రయోగించింది. దానిని మరియొక విధముగా అర్థంచేసుకొని కమల ఆవిషయం భర్తతో చెప్పివేసింది. విధి అను గద్యవ్యాసంలో ఆదినమాతనికి మరణము వ్రాసియున్నది. అపాయమనుకొని, మృత్యువునకు జంకిన సముద్రయానము, వేటపయనము నిరపాయమైనవి. కాని వీని విధివ్రాతవలన అపాయము లేదనుకొనిన స్థలమే బోరగిల్లినది. తానొకటితలచిన దైవమొకటితలచునను శ్రుతివాక్యమిందు సార్థకమైనది. పెండ్లిచూపులకువెళ్ళిన జానకమ్మ కృత్రిమపుపండ్లు ధరించినది. అవి లీల్లనోటబడినవి. కథాభంగమునకు లీల్లిపాత్ర సాయపడ్డది. ఎక్కువపాత్ర లీల్లిది. శ్రీలత, వకుళ, గోపాలరావు ఈముగ్గురిలో శ్రీలతనే అభినందింపవలయు. చిన్నతనమునుండి గోపాలరావునే ప్రేమించుచూ, అతడు వేరొకవనితకు భర్తగా మారిపోవుటచూచియు, అతడే తనహృదయాధినాథుడని, వేరొకనివరింపక, ఐహికసుఖేచ్ఛలన్నియు వాతని మూలమునత్యజించి, అతనికొరకు, ఆత్మార్పణమొనరించి శ్రీలత పవిత్రహృదయము నభినందింపవలయు.

—పాకనాటి శ్రీకామేశ్వరి.

౧౯

'కమల'లో అత్తగారు అల్లునికి మందు ప్రయోగించుటయందుమాత్రము దురుద్దేశములేదు. కూతు

రుకు వివాహమయిన తోడనే, మల్లి తన ముద్దు కూతురును, అల్లుణ్ణి గారాబముగా చూచుటయు, యింటియందు ఏపండుగ జరుగనున్నను, కొద్దిరోజులకు ముందుగనే అల్లుణ్ణి ఆపండుగకురమ్మని చెప్పంపుటయు, అల్లుడు నిరాదరణచే ఆహ్వానమును తిరస్కరించినప్పుడు ఖేదమొందుటయు సహజము. అల్లుణ్ణి మీద అత్తగారి ప్రేమ ముఖ్యముగా కూతురునుంచియే యని చెప్పవచ్చును. కమల తల్లికూడా నరసింహారావును పెక్కుమార్లు పిలుపించ ప్రయత్నపడి నిష్ఫలమనోరథురాలైనది. నాల్గేండ్లకు సెలవుగా నరసింహారావు అత్తవారింటికి వచ్చుట తటస్థించినందున, తరుణము మించిపోయిన తిరుగ దొరకదను కారణము చేతను, తన కూతురుపై అతనికి నిండుప్రేమ యుండదను యూహచేతను, అత్త అల్లుణ్ణి తన తనయకు ఇష్టుడుగానుండునట్లు చేయనెంచి, మర్లుమందు ప్రయోగించను ప్రయత్నపడియుండును. ఇందు కమల మేలుకే అయినప్పుడు, కమలలేనిసమయమునే చూచి ఆమె ఏల మందును కాఫీలో కలిపియుండునని కొందరు ప్రశ్నించవచ్చు. కమల కప్పటికంత లోకానుభవము లేదనియు, తాను చేసినది యొకవేళ కమలకు తెలిసిన కమల యిరుగుపొరుగు యమ్మలక్కలలో నోరుజారి చెప్పునను సందేహముండియుండును. "ఎవరిని మెచ్చుకొందురు" అనుకథలో అగ్నిసాక్షిగా వివాహమాడిన సతిని విడనాడి, చిన్ననాటి నెచ్చెలిపై తన ప్రేమనుంచి, లోకమునకు వెరచి, ప్రాణత్యాగుడైన గోపాలరావు ఎక్కుడుగాడు.—పతియే దైవమనునది సతికి పుట్టుకతోడవచ్చునది. విధియైయున్నది. ఇహమున సుఖముకోరక, పతిని పరలోకముననైనను కలియనెంచినందుకు వకుళ మృతినొందతగినదే. ఇందు విశేషమునున్న—నిశ్చలమైన ప్రేమకనుగొని, పురుషుని నిజసతిని విడనాడమనియైన చెప్పక—మనస్సువందైనను తలచక—ఇతరవిషయములయందు తన మనస్సును జారనీక, మార్గదర్శినియై ప్రాణముకోల్పోయిన శ్రీలతకదా శ్లాఘనీయమైనది?"

—పి లక్ష్మీదేవమ్మ.

౨౦

"కమల"లోని నరసింహారావు అత్తగారు విద్యావతికాదు. ఆమె మందుల ప్రయోగించి మనస్సును మార్చవచ్చునను విశ్వాసముగలవారిలోనిది. అట్టి ప్రయోగమువలన అల్లునికిహానికలుగునని ఆమెకు తెలియదు. అల్లుని తమ యింటనే యుంచుకొనినచో తమకు పుత్రుడులేనిలోపము చాలవరకు తీరునని ఆమెయాశ. అతనికి అత్తవారింటనే యుండు బుద్ధి పుట్టుటకే ఆమె యామందును ప్రయోగించియుండునని తోచుచున్నది. "పెండ్లిచూపు"లో జానకమ్మ ప్రవేశించగనే "లిల్లీ" మొరిగింది. ఆమె భయపడింది. ఆమె తనపళ్ళకట్లను గంగాళముదగ్గర పెట్టివరుండగా వాటిని లిల్లీ ఏవోయెముకలనుకొని తీసుకుపోయింది. పాపము పళ్ళకట్లు పెట్టుకొనకుండ స్పష్టముగా మాట్లాడజాలని జానకమ్మకు అందువలన అవమానముకలిగింది. కట్టుబడియున్న లిల్లీని నారాయణరావు విప్పించని యెడల కథకంతరాయము కలిగియుండదు. కథాభంగమునకు సాయపడినపాత్రలలో లిల్లీకి అగ్రస్థానమునీయవచ్చును. "విధి"లోని అంతర్నాదము "సాహసమునందే జయమున్నది. పిరికితనమే పాడుచేయునది"అని నాకు తోచుచున్నది. "ఎవరిని మెచ్చుకొందురు?"అనుకథలోని గోపాలరావు శ్రీలతను ప్రేమించుచుండెనని తెలుసుకొనియు వకుళ కేవలము వివాహబంధమువలన అతనిని భర్తగా నంగీకరించినది. శ్రీలత అట్లుగాక పవిత్రమగు ప్రేమబంధమువలన అతనిని భర్తగా నెంచుకొన్నది. గోపాలరావు తన్నంతగా ప్రేమించిన శ్రీలతను ప్రపంచమునకు వెరచి పరిగ్రహించలేకపోయెను. అతడు తనను పరిగ్రహించజాలడని తెలుసుకొనియు శ్రీలత మనస్సుమార్చుకొనక చివరవరకు అతనియెడ నిశ్చలప్రేమతోనున్నది. ఆమె ప్రేమ సహజమైనది. ఆమెత్యాగము గొప్పది. ఆమెయే మెచ్చుకొనతగినది. "మాత్రయజ్ఞము: బైయిండియన్ లీగ్"నందలి పున్నయ్యగారి అభిప్రాయములతో నే నేకీభవించకుండనుండజాలను.

—గ. సీతామహాలక్ష్మమ్మ.

# సమస్యాపూరణము

## సమస్య: రాటమువలదనుచు గాంధి రయమునబలికెన్.

[స్థలాభావమునను, సకాలమున చేరకుండుటచేతను పెక్కులు విడనాడబడినవి. మిగిలిన ఈయవి యథామాతృకములుగ ప్రచురితములు.]

క. మాటల నూరకలుచ్చక
పాటవముగ శ్రద్ధతోడ, పాటుపడంగన్
ఓటమిగలుగదు, మీ కా
రాటమువదలనుచు గాంధి రయమునబలికెన్.

—బొ. సీతాబాయి.

క. కోటానకోట్ల ధన మా
రాటమ్ములవలన రాని రాదనియంచున్
పాటించి ముదముగా నా
రా.

—అబ్బూరి రాజ్యలక్ష్మి.

క. చాటుగశత్రులుబన్నిన
మాటునచిక్కబడకండి మాస్లిములారా!
తోటిహిందువులతో పో
రా.

క. కేటివరకు రాటములే
మేటగువస్త్రములే దేశమోక్షకరములై
కాటకము బాపవే ఆ
రా.

—బసవరాజు వేంకటలక్ష్మమ్మ.

క. కూటికిఁ గుడ్డకుఁ గలవై
నాటికి, తొంబదుగురుండ్రి నూలువడకుటే
వాటము యిక దీనికి పో
రా.

—సమయమంత్రి రాజ్యలక్ష్మి.

క. కాటకదినములయందున
రాటమె మనమాటయందు రంజలుడయ్యా
మేటని పల్కెడి డిక పో
రా.

—ద్విభాష్యం సత్యవతి.

క. పోటరులమంచు తా మా
ర్భాటంబులుసల్పు యువకమండలితోడన్
పాటించిశాంతమును, పో
రా.

—గాలం రంగనాయకమ్మ.

క. తేటని మాటలచేతనె
కోటలుగట్టంగవలదయ, క్రోధంబిక మన
కేటికి? అన్యులతో పో
రా.

క. కూటికి దృగ్గోషంబన
నేటికి? అస్పృశ్యతాదుశేలన్! తలవన్
చేటునుమీ! మనకీ పో
రా.

—పులిజాల కమలాబాయి.

క. నాటకకూటంబగు ధర
కేటికి కయ్యంబు? యూడనోపదు, నీవా
మేటిపనకాదలచిన పో
రా.

—బొడ్డుపల్లి యశోదాబాయి.

క. కాటకము మాన్చి మన యా
రాటము బోకార్చుతల్లి రాటమెగాదే
బోటీ! నెత్తురుకడిపో
రా.

—కోనేరు వేంకటరామమ్మ.

క. ఏటికి ఫలించనిశ్రమ; యే
నాటికి తుదముట్టదనకు డాహరిచిత్తం
బౌటప్రసిద్ధము ఫల; మా
రా.

—బెల్లంకొండ కనకమ్మ.

క. రాటము మనసౌభాగ్య క
రాటము, సకలమ్ముదానఁ బ్రబలును, మదిసా
రాటము దొలఁగెడి నిఁక పో
రా.

—బొడ్డు సీతామహాలక్ష్మి.

క. బూటకపు రొండుటేబిలు
నాటకమున కాలవిడచి నమ్ముండిక చే
రాటమె వాంఛితమిదు పో
రా.

—రావుల రాజ్యలక్ష్మి.

క. ఘాటములకు లాఠీలతో
పోటులనోసరించునట్టి పోలీసులు మీ
పాటుకుకతమగు మీ కా  రా.
—కల్వాల పార్వతమ్మ.

క. కూటికిగుడ్డకు నోరుపై
చేటికి భరపడగరాట్నె, మిది చేకొనుడీ
పాటుపడి బ్రతుకుడీ యా  రా.
—జ్ఞానాంబ.

క. రాటమువదలక, చెప్పుడు
గాటముగా కృషులనెల్లఁ గావింపుడు, ము
మ్మాటికి జయదములివి, పో  రా.
—ఎస్. హెచ్. అలిమేలుమంగతాయార్.

క. నాటిపబీజఫలంబా
నాటికి రాదెప్పు డెదుగ నగును స్వరాజ్యం
బేటికి రాదు, వృథా యా  రా.
—చెన్నూరు అన్నపూర్ణమ్మ.

క. ఏకోటి నారుపదులుం
గోటులద్రవ్య ప్రవాహి గుంటుపడుటకు
న్నాటఁడె "సత్యాగ్రహి" పో  రా.
—నరహరిసెట్టి నాగరత్నాంబ.

క. చేటుల్ మాన్పఁగ వైరము
వాటిల్లఁగనీయకుండఁ బ్రస్ఫుటసఖ్యా
ర్భాటము దేశముగనఁ బో  రా.
—చదలవాడ ధర్మరాజుసతి.

క. కూటికి చాలని దేశము
నాటికినాటికిఁ గృశింప నానామతజం
జాటముతో నేమని పో  రా.
—బి. ఆదిలక్ష్మాంబ.

క. రాటము సర్వశ్రేయము
రాటము జీవంబునమ్మి, రమణులకెల్లన్;
రాటము వలయు సదా; పో  రా.

క. రాటమె తెచ్చుస్వరాజ్యము,
రాటమె శాంతింపఁజేయు రాజుం బ్రజలన్;
రాటమె లేమి నడఁపు; నా  రా.
—నందిగామ సౌభాగ్యవతి.

క. కూటికి లేదని హిందువు
లేటికి వగచెంద; సుఖమ్ములిమ్ముగబడయన్
రాటము మనగనియని పో
—అయలసోమయాజుల శేషమ్మ.

క. ఏటికి మతకలహంబులు
వాటమ్ముగ హైందవ ప్రవరులు దురకలుం
గాటముగ గలియమేల్ పో  రా.
—వడ్లమన్నాటి సూరమ్మ.

క. గాటపు సత్యాగ్రహ మెద
నాటి స్వదేశీయులార! నడుపవలయు నె
ప్పాటను శాంతములోఁ; బో  రా.
—యన్. యలివేణి.

క. వాటముగా స్వారాజ్యపు
కోటనుగట్టంగ బ్రజలకూటమి వలయున్
రాటము వలయునుడీ పో  రా.
—యస్. హైమవతి.

క. లాఠీలు విసరుచుండిన
నోటికి నవరానిమాట నుడివిన మీరా
పాటులకు నిలువవలెఁ బో  రా.
—చదలవాడ రాఘవమ్మ.

క. రాటముఁదీయుచు నిరతము
బోటులు, గృహలక్ష్మి చదువఁబో, తెలివమ్మన్
మాటలు వలదిఁక చేయా  రా.
—తురగా సూర్యకాంతమ్మ.

క. కూటికి గుడ్డకు నెలియయి
పేటలఁ బల్లెలఁ గృశించు పేదలు మీరల్
రాటము బూనుఁడు మీ కా  రా.
—యశోదబాయి.

క. కాటకము కలుపు బాపును
ధాటిగ స్వేచ్ఛయునుగలుగు దాస్యము వదలున్
రాటమెగతి వినుడీ పో  రా.

క. గాటమగు భక్తిత్యాగము
వాటముగా నెరిగి దేశదాస్యముఁబాపన్
నూటిగ అహింసయే పో  రా.
—ఆచంట సత్యవతమ్మ.

క. కూటమి, యోరిమి, నిలుకడ,
మాటలయొప్పిదము, శాంతి మనకు జయంబే
నాఁటికయిన నొసఁగును భో
రా.
—పంతుల సీతాలక్ష్మి

క. పాటలుపాడుదు లలనలు
రాటముదీయంగవెస స్వరాజ్యమువచ్చున్
గాటకముండదు మన కా
రా.
—తటవర్తి సత్యరామమ్మ.

క. గాటపులేమిడి దైన్యము
పాటితస్వచ్ఛందవృత్తి బడసెదుతల్లీ!
మేటిశుభ మొదవు త్వర నా
రా.
—అమలగంటి లలితాదేవి.

క. మాటలకు, కైలుకు, లాటీ
పోటులకున్ వెఱవకున్న పూర్ణస్వరాజ్యం
జేటికిరాదు? వృథా పో
రా.
—కంభంమెట్టు లక్ష్మీకాంతమ్మ.

క. కటకట కారాగృహమున
పటుతరమగు ధైర్యమూని పణతులెయుండన్
బటుతరమగు పురుషుల కా
రా.
—పాకనాటి శ్రీలక్ష్మీకామేశ్వరి.

క. స్ఫుటముగ సమరమునందున్
దిటవుగ వసువులనిడుటకు మహిళలెయుండన్
పటుతరముగ పురుషుల కా
రా.
—పాకల చంద్రకాంతామణి.

# ప్రాతఫక్కీ పాటలు

శ్రీమతి యస్. వి. సరళాదేవిగారు

౧

చేసికొన్నవారికి చేసికొన్నంత;
యజ్ఞదత్తునాన్ని తండ్రినెడబాపి,
పాపమంతెయుకొనె వడ్డితోకూడ
పుత్రవియోగాన దశరథుండెలమి.

౨

జనకుడెంతటి మహాధన్యాత్ముడొక్కొ
ఆదిలక్ష్మీశ్వరుని అమలపాదంబు
పన్నీటితో కడిగి, పడతినిచ్చేను;
శాశ్వతకీర్తిని పుడికిపుచ్చుకొనె.

౩

గర్వంబదెంతటివారికిగాదు;
గర్వంబు చెఱచును సర్వకార్యములు;
భార్గవరాముండు శ్రీరాముచెనకి,
దివ్యపదవీప్రాప్తి బోగొట్టుకొనియె.

౪

దైవబలమునకన్న బలమింకలేదు
శ్రీవసిష్ఠుని లగ్నమెట్లు మార్పడియె?
పురుషకారమంచు పొంగిపడియేరు
పురుషుడు తానెంత? తానేమి సేయు?

౫

కైకదేవిదియెంత కఠినమౌగుండె?
ఎండనెఱుగనిసీత నడవులకుతోలె
దశరథమహారాజు మంచివాడగును
చేసికొన్నదాని కెదురెట్టులాడు?

౬

కైకమ్మ తానెంత కరుణార్ద్రమతియొ!
రాముని అడవికి పంపనేకోరె?
లేకున్న లోకాన కలుగుకష్టాలు
ఋషులకు, జనులకు నెట్లుతీరేని?




## గగనమునుండి గడ్డిమోపులు:—

ఇంగ్లండుదేశమున హెర్టుఫోర్డుషైరునందలి హిచ్చిన్ నగరమున ఈనడుమ గడ్డిమోపులవర్షము కురిసినది. ఆకాశమున అప్పుడు ఎట్టిమేఘములేక అతినిర్మలముగనుండెను. సూర్యుడు బాగుగ ప్రకాశించుచుండెను. ఆకుఅల్లాడు గాలియైనను లేదు. సమీపమున ఎట్టిగాలివిమానమును ఎగురుటలేదు. ఉన్నట్లుండి ఆనిర్మలనీలాకాశమునుండి ఏవోపదార్థశకలములు భూమికి దిగుచున్నట్లుండెను. సమీపమునకువచ్చినకొలదిని అవి గడ్డిమోపులగుట తెలియవచ్చెను. ఒకఅడుగునిడివిగల ఆమోపులు క్రొత్తగ చేనినుండికోసినవానివలెనుండెను. ఈవార్త జలతైలబిందువై ఇంతలో పట్టణముః ప్రాకెను. ప్రపంచమునకిది ప్రళయకాలమని పలువురు భావించిరి. వ్యవసాయదారులు తలపంకించిరి. వర్తకులు ఈవింత జరుగకపూర్వమునుండియు తమవ్యవహారము నిరుత్సాహకరముగనేయున్నదనియు, ఇప్పటి ఈఅరిష్టసూచనకు క్రొత్త అవసరములేదనియు చెప్పిరి. కాని విమానచోదనశాఖోద్యోగియొకడు అక్కడకువచ్చి వానినిపరీక్షించి "ఇవి విశ్వప్రళయమునుసూచింపవు. ఇట్లు గగనమునుండి గడ్డిమోపులుపడిన ఉదంతములు పెక్కులు నేనెఱుగుదును. పొలమున కోసియుంచినగడ్డిని తీవ్రమగు సుడిగాలి పైకి లేవదీసుకొని కొంతదూరముగొనిపోయి క్రిందికివిడుచును. హెర్టుఫోర్డుషైరులో ఒకానొకపొలముకాపు ఇప్పుడు క్రొత్తగాకోయబడినగడ్డికై వెదుకులాడుచున్నాడనుట మనము భావింపవచ్చును" అనిచెప్పెను.

## ఒకేకాన్పున ముగ్గురుబిడ్డలు:—

కురిక్కాలై రైల్వేస్టేషనుసమీపమునయున్న పెరుంలెలకూడిగ్రామమున నొకవిశ్వబ్రాహ్మణయువతి ముగ్గురు మగశిశువులనుకనెను. అందులో ఒకశిశువు పుట్టినఅరగంటకే చనిపోయెను. మిగిలిన ఇరువురు సజీవులైయున్నారు.

## సముద్రతరంగములు:—

సముద్రతరంగములు తీవ్రముగ బయలుదేఱుటకును, విఱుగుటకును చాలవఱకు చంద్రుడే కారణమనియు, అట్లే భూకంపములకుగూడ చాలవఱకు శీతాంశుని భూమ్యాకర్షణశక్తియేగతంబనియు జాన్సహాప్కిన్సు విశ్వవిద్యాలయమందలి ప్రొఫెసరగు హెచ్. యఫ్. రీడ్డుగారు తెలుపుచున్నారు.

**దీపముగల మంగలికత్తి:—**

క్షౌరము వెలుగులేనిది చేసికొనుటకష్టము. ఇక ఆకష్టముండజాలదు. కత్తికి ఎలక్ట్రిక్ దీపము అమర్చబడినది. ఆదీపపుబేటరీ కత్తియొక్క దంతపుకర్రపిడిలో ఏర్పరుపబడినది. మంగలికత్తిపోవుమార్గమును ఈదీపము కాంతివంతము చేయగలదు. పిడియందు మీటుగలదు. ఆమీటు బొటనవ్రేలిఅందుబాటున నుండును. పగలు వేళపాళలేక క్షౌరములుచేసికొనుట ఇపుడు ఆచారమైయున్నది. దీపముగల ఈమంగలికత్తివలన రాత్రిళ్లుకూడ క్షౌరముచేసికొనుట ఆచారముకాగలదు.

**బిచ్చగానివద్ద నోట్లు:—**

ప్యారిసు ఫలహారపుటంగడిలో భిక్షమెత్తుకొనుచుండెనని పోలీసువారు లూయీలాటోరు అనువానిని అరెస్టుచేసి పరిశీలించ చొక్కాలోను, పావరత్తులలోను, టోపీలోను వేలకొలది ఫ్రాంకునోట్లు కన్పడెను. ఇవన్ని యొక్కడవనిఅడుగ 30 సంవత్సరములు కాయకష్టములుపడి, చెమటయూడ్చి పొదుపుగ కాలముగడిపి సంపాదించితిననెను.

**పసిపాపకు భాషలువచ్చుట:—**

ఫ్రాంసుదేశమందలి యొకగ్రామమున రెండుసంవత్సరములబాలికకు నాలుగుభాషలు వచ్చునట.

**మంగలిషాపుతో ధనికుడగుట:—**

అమెరికాదేశములో అట్లాంటానగరమున 30 లక్షలరూపాయల ఆస్తినిసంపాదించిన నీగ్రోమంగలి చనిపోయెను. ఈయనషాపులలో ప్రతిదినము 700 మంది పనిచేయుచుండిరి. ఒకషాపులోనే 42 మంది క్షురకర్మకులుగలరు.

**వింత:—**

వియన్నాలో విద్యుచ్ఛక్తిచే జేపలనుబట్టుటజూచి బెర్లినులోగూడ మొదలుపెట్టిరి.

**భూరివిరాళము:—**

హోట్టనుఅనునామె ప్రభుత్వకోశాగారమునకు 15,00000 పౌనులను దానముచేసెను.

**విధవరాలికి అదృష్టము:—**

స్పెయినుదేశములో మనుజులు పరమపదమొందినప్పుడు యిష్టమైన బట్టలుకట్టబెట్టి పూడ్చిపెట్టుట మామూలు. ఒకమానవుడు మృతినొందగా వానిశవమునకు దుస్తులుతొడుగుచుండగా జేబునుండి ఒకలాటరీ టిక్కెట్టు వ్రేలాడుచుండెను. అదితీసిచూడగా దానికి క్రిస్టమస్‌లాటరీలో ఒకబహుమతి వచ్చియుండెను. ఆబహుమతికి టిక్కెట్టుభాగమునకు చాలధనమువచ్చునట. భర్త మరణించినను ఆవిధవరాలికి ధనలాభము చేకూరినది.

**గోవు:—**

15 సంవత్సరములలో 14000 పౌనుల పాలిచ్చినగోవు బెంగుళూరులోనున్నది.

**తలలుగలిసిపుట్టిన కవలపిల్లలు:—**

డెన్నీలో కవలపిల్ల లిద్దఱు తలలుగలిసిపుట్టి చనిపోయిరి. ఒకపిల్లఏడ్చిన యింకొకపిల్ల నిద్రపోయెడిదట. ఒకపిల్ల నిద్రించుచుండిన యింకొకపిల్ల ఏడ్చెడిదట. సృష్టివైచిత్ర్యము. తలలువిడదీయ వైద్యులు ప్రయత్నించిరట.

—మరకాని పరాత్పరరావు.

# పత్రికాపరిచయము

**భాగ్యనగరపత్రిక:—**

దక్షిణహైదరాబాదునుండి ప్రచురింపబడు పక్షపత్రిక. సంపాదకులు యమ్. వి. భాగ్యరెడ్డివర్మగారు. ఇందు ఆర్థిక, సాంఘిక, నైతిక, చారిత్రక, వ్యవసాయిక వ్యాసములును, వైజ్ఞానికవిషయములును, ప్రపంచ వార్తలును ప్రకటింపబడుచున్నవి. ప్రతిసంచికయందును నాలుగైదు చిత్రములుండుట విశేషము. క్రౌను క్వార్టొసైజున ముద్రింపబడుచున్నది. నిజాంరాష్ట్రాంధ్రుల క్షేమమునకై ఇది ఎక్కువగాపాటుపడుచుండుట లెస్స. ఈనెల 5-వ తేదీనుండి ఇది వారపత్రికగా మార్చబడునని వినుటకు ఆనందమగుచున్నది. నిజాం రాష్ట్రమునందలి ఆంధ్రప్రజాసంఘము ఈపత్రికను పోషింపవగును. సాలుచందా రు. 3-0-0, విడిపత్రిక 0-2-0. చిరునామా: భాగ్యనగరపత్రిక, రెసిడెన్సిరోడ్, హైదరాబాదు.

**కల్యాణి:—**

కల్యాణిపత్రిక మొదటిసంపుటము 4,5,6,7,8,9,10 సంచికలు మాకార్యాలయ మలంకరించినవి. పురాణము సూర్యనారాయణతీర్థులుగారివంటి పండితులు, ధమిడిపాటి రామసోమయాజులుగారివంటి విమర్శకులు, కాశీసోమయాజుల సుందరరామమూర్తిగారివంటి నాటకకర్తలు, సెట్టి లక్ష్మీనరసింహముగారివంటి బహువేత్తలు ఆదరింపగా కల్యాణి పరిపుష్టమునొంది వెలువడుచున్నది. కొలదికాలములో కల్యాణి కూము కూలమునువదలి అసలైన తెలుగుసీమకు విజయనగరమునకుపోయి ఆంధ్రలోకమును సేవింపగలదని వినుటకు ఆనందించుచున్నాము. కల్పలతాధిపతులు, మహామహోపాధ్యాయులు ఆచంట సాంఖ్యాయనశర్మగారి దిద్దుబాటున ఇక వెలువడు కల్యాణి విలక్షణతేజమున విలసిల్లునని విశ్వసించుచున్నాము. చందా ఏడాదికి రు. 2-0-0. క్రౌనుక్వార్టొసైజు. కల్యాణీకార్యస్థానము, 13 లింబుచెట్టి వీథి, మదరాసు.

**వైశాఖ:—**

కవితాసమితివారి రెండవవార్షికసంచిక. క్రౌను క్వార్టొసైజున అంటిక్ కాగితములమీద సచిత్రముగ అతిసుందరముగ అచ్చొత్తింపబడి ఈసంచిక సామిత్యుల సౌందర్యార్చనకు నిదర్శనముగనున్నది. పద్యవ్యాసములలో ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారి వింధ్యమునకు గౌరవస్థానము. అధికార్ల సూర్యనారాయణరావుగారి 'వియోగము' హృద్యము. కవికొండల వేంకటరావుగారి 'ఒకనర్మము' భావప్రధానమైనది. అబ్బూరి రామకృష్ణారావుగారి 'ప్రయాణవార్త' పాఠకులమనెని రసవివశ మొనర్పచాలియున్నది. కథావ్యాసములలో కొన్ని సుప్రసిద్ధాంధ్రకథారచయితలగు చింతా దీక్షితులుగారు, గుడిపాటి వేంకటాచలంగారు వ్రాసినవి. 'స్మృతివాఙ్మయసంక్షేపము' అను శ్రీపరవస్తు లక్ష్మీనరసింహస్వామిఅయ్యవారలుగారి వ్యాసము స్మృతివాఙ్మయనిరీక్షను గావించుచున్నది. శే. వేం. రాఘవఅయ్యంగారి 'నవ్యమతము: ధ్వనిమతస్థాపనము' చదువదగినది. పూడిపెద్ది వేంకటరమణయ్యగారి 'సెలయేరు' గద్యకవిత్వమనిపించుకొనజాలును. గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారి 'నక్షత్రములు' అనువ్యాసము ఈసంచికకు విలువతెచ్చు వ్యాసరాజము. కొంపెల్ల జనార్దనరావుగారు కృష్ణశాస్త్రిగారి 'ప్రవాసము; ఊర్వశి' అనువానిపై విమర్శకవ్యాసమును రచించి సంచికకు పుష్టినిచ్చినారు. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి 'తెనుగు-తోబుట్టువులు' అనునది భాషావిషయకమగు ప్రతిభగలవ్యాసము. కవితాసమితివారు ఈపద్ధతిని ఒకమాసపత్రిక నడపయత్నింతురేని ఆంధ్రమునకు అనంతమగు సేవ చేయువారగుదురు. ఈశ్వరు డనుగ్రహించును గాక! ఈసంచిక 116పుటలు. వెల

రు. 1-0-0. ఆంధ్రులు దీనిని విరివిగా వెలకుతీసి కవితాసమితివారికి పోషణప్రోత్సాహములు కల్గింపవలసి యున్నది. చిరునామా: కవితాసమితి; విశాఖపట్టణము.

## దేవదత్తము :—

దమ్మిడీ వేరమునకు పేరుమోసిన అరవలు తొలుత కాలణాపత్రికలను లేవదీసిరి. తెలుగువారు ఆపద్ధతిని అందుకోలేదు. అగుట తెనుగువారికొరకు అరవవాడే ఒకడు కాలణాపత్రికను పెట్టినాడు. దానిపేరే 'జన్మభూమి'. ఆకాలణాపత్రికను ప్రభుత్వము కాటువేసినది. హితకారిణి, యుగంధరపత్రికలను సమర్థతతో నిర్వహించిన మున్నంగిశర్మగారు ఇపుడు ఏలూరునుండి 'దేవదత్తము' అను పేరుతో కాలణాపత్రికను నడుపుచున్నారు. 43-వ పత్రిక విమర్శనార్థము మాకార్యాలయమునకు పంపబడినది. ఇంతకుముందే ఈపత్రికను గూర్చి వినియుంటిమి. ఒకసంచిక చూచితిమికూడ. చూచుటతోడనే మాకాలేజీదినము లప్పటి 'స్వదేశీ ఉపమాపత్రిక' జ్ఞప్తికివచ్చినది. తమకంపెనీమందుల ప్రకటనతో ప్రతితెనుగుపత్రికను పోషించుచున్న ఒకానొకమిత్రునితో ఈనడుమ సంభాషించుచుండ వారీదేవదత్తమును ఎన్నడు తెనుగుపత్రిక చూడనొల్లని ఒక లక్షాధికారి చదువుచుండ చూచితిమని చెప్పిరి. దీనినిబట్టి దేవదత్తముయొక్క ప్రచారబాహుళ్యము నూహింపవచ్చును. ఈపత్రికయొక్క నిగ్గుఅంతయు 'విమర్శవినోదాలు' అను శీర్షికతోనున్నది. "స్వమతవిమతాదిపక్షపాతములంకోరక శ్రవణసుభగంబుగా సత్యసమ్మతముగ ప్రాజ్ఞపామరహృదయానురంజకముగ ధర్మువ ధ్వనించు నిది దేవదత్తమగుట" అని పత్రికమకుటము. తెనుగుపత్రికలలో నిదియొక క్రొత్తతీరు. ఈవారపత్రిక సాలుచందా ఏలూరువారికి రు 1-8-0, పొరుగూరివారికి రు 2-0-0. పత్రికాపఠనమెఱుగని తెలుగు వారికి ఇట్టిపత్రికలు పత్రికాపఠనాభిలాషను గలిగింపగలవు. అగుట నివి ముఖ్యముగ పఠనీయములు.

## కృషీవలుడు :—

ఈపత్రికను ఈవఱకు మాచదువరులకు పరిచయము చేసియున్నారము. అయినను అనుబంధములో వెలువడిన అగష్టు 15-వ తేదీనాటి (సంపుట 1 సంచిక 9) సంచికనుగూర్చి ఒకటిరెండు వాక్యములు వ్రాయ కుతూహలమగుచున్నది. దినదినాభివృద్ధిగాంచుచున్న నేటి తెనుగుపత్రికల పేర్లలో 'కృషీవలుడు' పత్రికకు మొదటిస్థాన మీయవచ్చును. వరిచేలను చీడలనుండి కాపాడుట, సహకారోద్యమము, రహితులకిచ్చే అప్పులు, గ్రామోద్ధరణము అను విషయములు కృషీవలులకు ఎంతయు నుపయోగించును. డాక్టర్ యస్. శేషగిరిరావు (యల్. ఐ. యమ్.) గారు వ్రాయుచున్న 'ఇంటిమందులు' ఈపత్రికకు ప్రత్యేకతప్రయోజనమును గలిగించుచున్నవి. బ్రహ్మంగారి 'రైతుపలుకులు' ఆవశ్యము పఠింపదగినవి. 'రైతుబిడ్డా!' అను కొసరాజు రాఘవయ్యచౌదరిగారిపాట చల్లబడినరక్తమును ఉడుకెత్తింపజాలియున్నది. రైతు జనులయందు ఆత్మవిశ్వాసమును రేపుట కిట్టిపాటలే వలయు. ఇన్నిరీతుల రైతులను సేవింపుచున్న 'కృషీవలుడు' చిరము వర్ధిలునని నిశ్చయము. పక్షపత్రిక. సాలుచందా రు 2-0-0. చిరునామా: 6, లాయర్ చిన్నతంబి మొదలివీధి, సాపుకార్పేట, మదరాసు.

## సంజీవి :—

ప్రతిమాసమున వెలువడు ఆరోగ్యపత్రిక. సంపాదకుడు గాదేపల్లి సుబ్బారావుగారు. 2-వ సంపుటము 12-వ సంచిక మాకార్యాలయ మలంకరించినది. ఇందు 'భోజనవిషయము' అనువ్యాసము పఠనీయము. డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారు నేటి విద్యాపద్ధతిలోనిలోపములను చక్కగచూపుచు ఒక ఆంగ్లవ్యాసమును వ్రాసియున్నారు. పత్రిక బాగుగ నభివృద్ధినందుగాకఅని కోరెదము. వలయువారు సంపాదకులపేర మచిలీపట్టణము వ్రాయునది.



కీ. శే. అడవి గంగమ్మగారు:—

"కీర్తిశేషులైన అడవి శ్రీరామపంతులుగారి ధర్మపత్నియు, దివాన్ బహద్దర్ మోచర్ల రామచంద్రరావు పంతులుగారి జ్యేష్ఠసోదరియు నగు అడవి గంగమ్మగారు ఆగష్టునెల 8-వ తేదీ సోమవారంరాత్రి రాజమహేంద్రవరంగ్రామములో ఆమెజ్యేష్ఠపుత్రుడు అడవి శంకరరావుగారిగృహములో స్వర్గస్థురాలాయెను. ఈమె చనిపోవునప్పటికి 69 సంవత్సరములు వయస్సుకలిగియుండెను. ఆంధ్రవనితాలోకమున గంగమ్మగారి నామము పూజనీయమైనది. ఈమె కీ. శే. మోచర్ల జానకిరామయ్యపంతులుగారి ప్రథమసంతానము. ఆయనపుత్రికలలో ఈమెయు పుత్రులలో రామచంద్రరావుగారును అగ్రజులు. జానకిరామయ్యపంతులుగారు కృష్ణాగోదావరీజిల్లాలో అనేకచోట్ల డెప్టీకలెక్టరుగా పనిచేసి చాలసంపత్తును పేరుప్రఖ్యాతులును గడించి 1893 సంవత్సరములో మరణించిరి. తమకుమార్తెయగు గంగమ్మగారిని అడవి శ్రీరామపంతులుగారికిచ్చి 1874 సంవత్సరములో వివాహముచేసిరి. శ్రీరామపంతులుగారు విజయనగరమున పాఠశాలలో చదువుచుండగా అప్పటి విజయనగరాధీశ్వరులైన శ్రీశ్రీవిజయరామగజపతిమహారాజులవారు పాఠశాలనుజూచుట తటస్థించి శ్రీరామపంతులుగారి బుద్ధికుశలతనుగుర్తించి వారిని సంభావనవేతనముతో చెన్నపురిరాజధానికళాశాలలో చదువునిమిత్తమైపంపిరి. శ్రీరామపంతులుగారు, తల్లాప్రగడ సుబ్బారావుగారు, న్యాయపతి సుబ్బారావుపంతులుగారు, సర్ శంకరనాయరుగారు, సుబ్బరాయనురెడ్డిమంత్రిగారు, సర్ పి. త్యాగరాయశ్రేష్ఠిగారు వీరందరు క్రిష్టియన్ కాలేజిలోను ప్రెసిడిన్సీకాలేజిలోను ఒకేకాలమునకలసి చదువుకొనిరి. ఆంధ్రులలో మొట్టమొదటిరోజులలో బి. ఏ. డిగ్రీ సంపాదించినవారిలో శ్రీరామపంతులుగారొకరు. శ్రీరామపంతులుగారును, గంగమ్మగారును చెన్నపురిలో ట్రిప్లికేనులో వీరరాఘవమొదలివీధిలో విశాలభవనము నొకదానిని సంపాదించి అక్కడనుమారు 30 సంవత్సరములు కాపురముండిరి. అప్పటిరోజులలో చెన్నపురిలో ఆంధ్రులు చాల అరుదుగానుండెడివారు. ఉత్తరసర్కారులనుండి ఆంధ్రులు ఏపనిమీద చెన్నపురివెళ్ళినను శ్రీరామపంతులుగారి గృహమునకేగి వారి సాహాయ్యమునుపొందెడివారు. అనేకబీదవిద్యార్థులు గంగమ్మగారివలన పోషింపబడుచుండెడివారు. అట్టివారు ఆంధ్రదేశములో ఇప్పుడు అనేకచోట్ల ముఖ్యవుద్యోగములలోనున్నారు. గంగమ్మగారి సోదరుడగు మోచర్ల రామచంద్రరావుగారు బాల్యమునుండియు అనగా 4 వ తరగతిమొదలు బి. ఎల్. పరీక్ష ప్యాసగువరకు బావగారైన శ్రీరామపంతులుగారి గృహములో నేయుండి వారియొక్కయు గంగమ్మగారియొక్కయు శిక్షలోనే పెరిగిరి. శ్రీరామపంతులుగారిపట్ల గంగమ్మగారిపట్ల రామచంద్రరావుగారికి ఎల్లప్పుడును భక్తిశ్రద్ధలును రామచంద్రరావుగారనిన వారిరువురకును అవ్యాజప్రేమయునుండెడిది.

శ్రీరామపంతులుగారు అనేకసంవత్సరములు చెన్నపురి రివిన్యూబోర్డులోను తరువాత తూర్పుగోదావరిజిల్లా శ్రీ అల్లూరివారి ఎస్టేటుకు రిసీవరుగాను పనిచేసి 1924-వ సంవత్సరములో రాజోలు గ్రామములో స్వర్గస్థులైరి. గంగమ్మగారు కొద్దిరోజులు రుగ్మతగానుండి 8-8-1932-వ తేదీని మరణించిరి. వీరికి ముగ్గురు కుమారులును ఇద్దరు కుమార్తెలునుగలరు. రాజమహేంద్రవరములో వీరేశలింగోన్నతపాఠశాలలో ఉపాధ్యాయులుగానున్న అడవి శంకరరావు బి. ఏ. యల్. టి. గారు వీరిజ్యేష్ఠపుత్రుడు. ఏలూరుగ్రామములో న్యాయవాదిగానున్న అడవి రామారావు బి. ఏ. బి. యల్. గారు కనిష్ఠపుత్రుడు. గంగమ్మగారిమరణము ఆమె బంధుకోటిచేతనే గాక ఆమెవలన ఉపకారములుపొందిన అనేకులచే పరితపింపబడును. ఈమె తన సౌజన్యముచేతను పరోపకారపారీణతచేతను చిరస్మరణీయురాలుగానుండును. గంగమ్మగారిఆత్మకు భగవంతుడు శాంతినొసంగుగాక!

—కో. శి. (ఆంధ్రపత్రిక.)

## ఫ్రెంచిబాలికలు: ఓటింగువిద్య:—

"మాకు ఓటింగుహక్కు కావలయును" అని ఫ్రెంచిబాలికలిప్పుడు ఎలుగెత్తి కేకలువేయుచున్నారు. స్త్రీలకు ఓటింగుహక్కు సంపాదించువిషయమున పురుషులుచేయుచున్న కార్యకలాపములతో వారిక తృప్తినొందజాలరు. స్త్రీలకు ఓటింగువిషయమున పరిజ్ఞానమును పెంపొందించుటకు ప్రత్యేకపాఠశాలలు ఏర్పాటుపబడినవి. స్త్రీబారిస్టరులెల్లరు ఇందు విద్యార్థినులుగాజేరియున్నారు. స్త్రీలఓటింగుహక్కు సంపాదించుటకేర్పడిన ఫ్రెంచి స్త్రీలసంఘపుఅధ్యక్షురాలగు మేడమ్ బ్రెస్చ్విను గారు ఈఓటింగు విద్యాపాఠశాలయందు చాలఅభిమానమును చూపుచున్నారు. ఇందలివిద్యార్థినులు నిర్భయముగను, నోట్సుచూచుకొనకుండగను మాటలాడుటను తరిబీతునొందుచున్నారు. సభలలో ఎట్టిప్రశ్నలువైచినను సరియగు త్వరప్రత్యుత్తరము నీయజాలియుండుటకు వారికి వివిధవార్తాపత్రికలపఠనము నిర్బంధముచేయబడినది. గలభాగందరగోళము జరుగుచుండగ మాటలాడుటకుగూడ వారు అలవాటుపడియుండుటకు అవకాశములు గల్పింపబడుచున్నవి."

*—The Bombay Chronicle weekly.*

## మిస్ మింగ్ లాక్ చరిత్రము:—

"ఈమధ్య చీనా జపానుకుజరిగిన సంగరమున తనదేశమగు చీనాతరపునపోరాడిన మిస్ మింగ్ లాక్ చరిత్రఎంతయు పవిత్రవంతమైనది. మిస్ మింగ్ లాక్ చీనాదేశమునందలి యొకనారీవతంసము. ఈయమ ప్యారిసునగరమునందును లండనునగరమునందును న్యాయశాస్త్రము నభ్యసించుటకై యరిగియుండెను. కాని అన్యాయముగ తనమాతృదేశమగుచీనాపై జపానుదండయాత్రవెడలినదని మిస్ మింగ్ లాక్ వినినంతనే న్యాయశాస్త్రమునుజదువుటకై తానరుదెంచిన వ్యయప్రయాసల లెక్కబెట్టక యాచదువునకు స్వస్తిజెప్పి యొకపరాసు విమానచోదకునికడ విమానయానమును విమానయుద్ధమును నేర్చుకొన్నది. ఇంతలోననే ఆమెకు మాతృదేశమునుండి తనమనోహరుడు జపానుసేనలచే చంపబడినట్లు వర్తమానమరుదెంచినది. తనప్రాణేశ్వరునిజంపిన జపానువారిపై పగదీర్చుకొన ప్రతినపట్టి యాకులకాంత చీనాదేశమునకరిగి ప్రభుత్వమువారి యనుమతిబడసి అత్యంతనిపుణతతో ఆరుజపానువిమానముల నేలబడవైచి వారు వైచుశతఘ్నికాగోళముల దప్పించుకొనుచు వారి మందుగుండుసామానులపైనను సైన్యములపైనను బాంబువిసరి దగ్ధపటలమొనరించుచు "అబ్బా! యిది ఆడుదిగాదురా బాబూ! మనపాలిపెనుభూతమో లేక కరాళమృత్యుదేవతయో యిట్టులరుదెంచినదిరయో" యని శత్రుసేనలగు జపానీయులు లబ్బురపడునట్లు వీరవిహార మొనరించినది. ప్రపంచమునందలి యుద్ధవిమానచోదకులలో మిస్ మింగ్ లాక్ యనునామెయే ప్రథమస్త్రీయుద్ధవిమానచోదకురాలని ప్రపంచమంతయు వినుతించియున్నది. జపానుసైన్యాధిపతు లీమెనుజూపియే తమ విమానచోదకులకు "అయ్యలారా! ఆమెను

జూచిరైన విమానములనడపుట నేర్చుకొనుడు. స్త్రీయయ్యును ఆమె విమానచోదనమున నెట్టిప్రావీణ్యత గన్పరచుచున్నదో పరికింపుడు." అని హెచ్చరింపుచుండిరి. యుద్ధరంగమున నింతటిసాయమొనరించినందులకు చీనాదేశమునందలి చరిత్రపుటలయం దీమెనామము సువర్ణాక్షరములతో లిఖింపబడగలదు."

—పులవర్తి కమలావతీ దేవి.

### అసహాయమహిళాగృహములు:—

"శ్రీమతి కమలరత్నము ఎం.ఏ. గారు జూలై మాసపు గృహలక్ష్మి ముఖమున వెలువరించిన అసహాయమహిళాగృహముల అవస్యకతఅను వ్యాసమునుజదివితిని. వారికీఆలోచనతట్టుటనునది స్త్రీలోకమున కొక వెలుగు కన్పడినట్లున్నది. వారు వ్రాసిన రెండుకథలకుతోడు అట్టిదీనచరిత్ర మఱియొకటి వ్రాయుచున్నాను. ఒకబాలికకు 6 వయేటనే పెండ్లిజరిగినది. వరుడుకోరి పాటోలువగైరా అట్టహాసమున జరిగినపెండ్లి. లాంఛనములు యధావిధిగా జరుపబడినవి. ఎఫ్. ఏ పరీక్షఅయినాడు. దుర్మార్గప్రవృత్తిలోదిగినాడు. తొందరపడి వధువును 12 వసంవత్సరముననే అత్తవారింటికిపంపిరి. 6 మాసములున్నది. వరునకిష్టములేదు. అతని క్షేమన్సుకుసరిగాలేదు. ఈమెనెట్లయిన వదల్చుకొనవలెనని తలంచెను. వెంటనే పుట్టినింటికిపంపెను. తానువలచినకన్యను వివాహమాడెను. పాప మాపసికూన ఏమిచేయును? తల్లియు ఒకసోదరుడుగలరు. 2 సంవత్సరములవరకు చూచిరి. ఏమియు లాభములేకపోయెను. వ్యాజ్యమునడిగిరి. అప్పటికే అతడు 300 రూ. వేతనము తెచ్చుకొనుచుండెను. కోర్టువారు నెలకు 10 రూ. తీర్పుచెప్పిరి. ఇదియు ప్రతి, సం॥ వారంటుపెట్టిననేగాని రాదు. ఉన్న ఒకసోదరుడు మరణించెను. ఇపుడామె అసహాయ, ఎచ్చటికిపోవుటకు వీలులేదు. 3 సంవత్సరములనుండి భర్త ఎచ్చటనున్నది తెలియదు. డబ్బులేదు. ఆమెనెచ్చటికైన పంపమని నన్నుకోరుచుండును. ఇంతమంది ఇన్నివిధముల దేశోపయోగకరములగు పనులుజేయుచుందురు. భర్తచనిపోయినచో, వితంతుశరణాలయములైననుండును. ఈజీవన్మృతవితంతువుల నెవరుతలంచుటగూడ దుస్తరము. ఏపేరంటమునకేగినను, అమ్మలక్కలందరు జాలిరైనబడక, సంఘాభిమానమైననుంచక ఈమెనేనో, మొగుడువిడచినదనియు, ఇంకానేమేమియో గొణుగుచుందురు. కాన మాబోటివారు బ్రతుకుటకంటె ఆత్మహత్యమేలని ఆమె ఎన్నోవిధములనో వాపోవుచు కాలముగడపుచున్నది. నేనెరిగినకొలది నిటువంటి వెన్నియోయున్నవి. కాన నోగృహలక్ష్మిపాఠకాంధ్ర సోదరీమణులారా! శ్రీమతి కమలరత్నము ఎం. ఏ. గారు కాశీలోనిర్మింపదలచిన అసహాయమహిళాగృహమునకు మనయోపినకొలది సహాయముచేసియు సలహాలనొసంగియు వారినుత్సాహపరచి కార్యసాఫల్యము చేయవలసియున్నది."

—అయ్యదేవర బాలాత్రిపుర సుందరమ్మ.

### స్త్రీల శరీరములో ఉష్ణమానము:—

కంగేలీలోని గురుకులమునందు అధ్యాపకులుగానున్న ప్రొఫెసర్ సత్యవ్రతగారిటీవల నొకక్రొత్తసంగతిని తెలియజేయుచున్నారు. మనుష్యునిదేహమునందలి ఉష్ణమానము ౯౮-౮ డిగ్రీలు అన్నవిషయము సామాన్యముగా చదువుకొన్నవారందరికిని విశదమే. అపరిమితినిదాటి యెవ్వరికైన ౯౯ డిగ్రీలవరకు ఉష్ణము హెచ్చినచో అతనికి కొద్దిగాజ్వరమువచ్చినట్లు భావింపబడును. ఈరీతిగా ప్రతిసాయంకాలము నెవ్వనికేని ఉష్ణము కనిపించినచో అతనికి క్షయవ్యాధి ప్రారంభించినట్లు తలంతురు. ప్రొఫెసర్ సత్యవ్రతగారు తన బంధువురాలొక్కతెకు ౯౯ డిగ్రీలఉష్ణము ప్రతిదినము వచ్చుచున్నదనిచెప్పగా ఆమెను అనేక డాక్టరులయొద్దకు తీసికొని వెళ్లి చూపించెను. ఆమెలో మఱెట్టిజాడ్యచిహ్నములను ఎవ్వరును కనిపెట్టజాలరైరి. కాని లోజ్వరముమాత్రమున్నదని అందరును చెప్పిరి. అప్పుడతడు పరీక్షించిచూతమని సమీపముననున్న స్త్రీలకు థర్మామీటరునిచ్చి ఉష్ణమును కనుగొనుడని చెప్పెను. వారికిగూడ ౯౯ డిగ్రీలుండెను. ఈరీతిగా ననేక స్త్రీల శరీరస్థితిని మాడ అందరికి నట్లేయుండెను. అందుమీదట వారు స్త్రీలకెల్లరికిని ౯౯ డిగ్రీలే సామాన్యఉష్ణమానమని వెల్లడించుచున్నారు. స్త్రీలు దీనిని గమనించి ఒళ్ళు వెచ్చగానున్నమాత్రముననే కంగారుపడకుండుట యుక్తము —ధర్మసాధని.

# డైరి

## జూలై

20:—గద్వాలుమహారాణి శ్రీమతి ఆదిలక్ష్మీదేవమ్మగారు తిరుపతి వేంకటేశ్వరస్వామిని సేవించిరి.

:—శ్రీమతి అంబుజమ్మ (శ్రీమాన్ ఎస్. శ్రీనివాసయ్యంగారికుమార్తె), శ్రీమతి కమలాబాయమ్మగార్లు వేలూరుచెరసాలనుండి విడుదలఅయిరి.

:—వాల్తేరుమెంటలుహాస్పిటలుకు శ్రీమతి వడ్డాది సుబ్బమ్మగారిని దొరతనమువారు మరల అధికారేతర ప్రేక్షకురాలినిగా (నానుఅఫిషియలు విజిటరు) నియమించిరి.

:—శ్రీమతులు మైనేని బసవమ్మదేవి, యలమంచిలి బసవపున్నమ్మదేవి, మైనేని సరళకుమారిగార్లు కన్ననూరు జయిలునుండి విడుదలఅయి బాపట్లచేరిరి.

:—రేపల్లితాలూకాకుచెందిన శ్రీమతి గట్టు సుందరమ్మగారు అనారోగ్యముచే కన్ననూరు జెయిలునుండి ఆసుపత్రికి మార్చబడిరి.

:—శ్రీమతి కొల్లా కనకవల్లితాయారమ్మగారి విడుదల. జైలులో జననమందిన వీరిపుత్రరత్నమును, వీరితో జైలుకువెళ్ళిన పుత్రికయును క్షేమముగావచ్చిరి.

21:—గుంతకల్లు. బాపట్లతాలూకా పర్లమూడిగ్రామపుసత్యాగ్రహులగు శ్రీమతులు గోళ్ళమూడి వేంకాయమ్మ, వాశిరెడ్డి వెంకాయమ్మగార్లు పికెటింగుచేయుచుండగా ఎరస్టుచేయబడిరి.

:—శ్రీమతి రామానుజమ్మ (గోవాడ) వేలూరు సెంట్రల్ జైలునందు బి. క్లాసులో తన 6 మాసములశిక్షను పూర్తిగ నిర్వర్తించి విడుదలఅయిరి.

23:—సర్ మంచేర్జీభువనగిరిగారి మనుమరాలగు శ్రీ చిబహదురిజీ అనునామె లండను న్యాయవాదివృత్తి పరీక్షలో విఖ్యాతిగ రెండవతరగతిలో ఉత్తీర్ణురాలాయెను. ఈపరీక్షలో నెగ్గుట ఇంతవఱకీమెయే ప్రథమభారతరమామణి.

:—నల్లూరు (రేపల్లెతాలూకా) చెంతగల నాగళ్ళవారిపాలెములో బహిష్కారప్రచారమొనర్చినందుకు శ్రీమతి కోగంటి వీరమ్మగారి అరెస్టు.

24:—భీమవరముతాలూకా గునుపూడిలో తాలూకా కాంగ్రెసుసభ జరిపిన సందర్భమున శ్రీమతులు ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, వారణాసి సీతమ్మగార్లను ఎరస్టుచేసి వదలివేసిరి.

25:—కలకత్తా. శ్రీమతి లీలావతికపూరుగారివద్ద నిషేధితకరపత్రములు దొరికినందున ఆమెకు 100 రూపాయిలజుల్మానా లేక మూడునెలల కఠినశిక్ష వేయబడెను.

26:—బొంబాయి కార్పొరేషను సభ్యురాలు, బొంబాయిపనివాండ్రసంఘముఖ్యసభ్యురాలు అయిన శ్రీమతి మనీబెన్ కారాగారిమీద రాజద్రోహనేరము ఆరోపించి కేసు కొంతవఱకు విచారించి ఆగస్టు రెండవ తేదీకి వాయిదావేసిరి. ఇం. పీ. కో. 124 ఎ, 153 ఎ సెక్షనులక్రింద వీరిమీద చార్జి.

:—కన్ననూరు. శ్రీమతి కుంచి రత్తమ్మగారికి 12 నెలల శిక్ష. సి. తరగతి.

27:—

28:—మాల్ ఖానగర్ యూనియన్ కోర్టును పికెటు చేసినందులకు అయిదుగురుస్త్రీలు అరెస్టుచేయబడిరి.

29:—లాహోరు. కంగ్రజిల్లాలోని పడాను గ్రామమునుండి ఒకహిందూయువతి నెల 15 రోజులక్రిందట గతించిన తనభర్తకొఱకు ఘోరతపస్సు చేయుచున్నది. మితిమించిన వియోగవేదనవలన ఆమెకు

జీవితముమీద ఆశలేదు. భర్త గతించినతర్వాత తాను జీవించియుండుట ఆమె కిష్టములేదు. ఊరి బయట నొకపొలములోనిలబడి నిద్రాహారములుమాని, ఎండవానయనక ఏదేకదీక్షతో తపస్సుచేయు చున్నది. ఎందరుచెప్పినను వినక, శరీరమును కృశింపచేయుచున్నది. కూర్చుండుటకైనను సమ్మతిం చుటలేదు. ఎండవేడిమిచేతను, దోమలకాటులచేతను తదితరములైన అనేకసహజవిరుద్ధమైన పనుల వలనను ఆమెశరీరము ఉబ్బినది.

30:—లాహోరు. దాదాభాయి నౌరోజీగారి మనుమరాలగు కన్యాకుమారిపదుచెనుగారు సత్యాగ్రహమున పాల్గొనినందులకు ఆమెకు శిక్షవేయబడెను. లాహోరుచెరసాలలో నామెకు చాల జబ్బుచేసినందున మేయోహాస్పిటలుకు మార్చిరి. ఆమె చాల నీరసస్థితిలోనుండుటచే త్వరగా సంపూర్ణారోగ్యము కలుగ జాలదు. ఆమెఆరోగ్యము పూర్తిగాచెడిపోయినది. కాన ఆమెను వదలివేయదగునని సూచింపబడెను.

31:—సిమ్లా. అఖిలభారతమహిళావిద్యావిధిసంఘమువారు తమ యాజమాన్యమున క్రొత్తఢిల్లీలో నెలకొల్ప నున్న లేడీ ఇర్విన్ కాలేజీకి హెన్నసేన్ సతిగారిని డైరక్ట్రెసుగా నియమించిరి.

## ఆగష్టు

1:—అలహాబాదు. శ్రీమతి స్వామి ధరనాథనేట్ సతిగారును, శ్రీమతి శ్యామలాలు సతిగారును, ఆమె భర్తయు ఆర్డినెన్సులక్రింద హర్తాలులో అరెస్టుచేయబడి 9 నెలలు కఠినశిక్ష, 40 రూపాయలు జరిమా నాయు విధింపబడిరి. వారు షాబార్ తహసీలుదారుని కోర్టుగదిలోనికి ప్రవేశించి వేదికపైనున్న కుర్చీలలోకూర్చుండి జాతీయగీతములనుపాడిరని నేరమారోపింపబడెను.

:—బొంబాయి. శ్రీమతి శాంతబెన్ భాస్కర్‌పటేల్ సతి స్పెషల్ పవర్సు ఆర్డినెన్సు ననుసరించి అరెస్టు చేయబడెను. శ్రీమతి శాంతాబెనుసతి కాంగ్రెసుఆసుపత్రిలో ప్రధానవైద్యుడుగానుండిన డాక్టరు భాస్కరపటేలుగారిభార్య. భాస్కర్‌పటేలుగారు వి. జె. పటేలుగారికి వైద్యుడుగాగూడ నుండెను. కాంగ్రెస్‌ఉద్యమములో నామె చేరియున్నదనుఅనుమానముపై ఆమె అరెస్టుచేయబడెను.

2:—ఎలమంచిలి. దిమిలకాపురస్తురాలున్నూ, కాంగ్రెసువాదినియుఅగు శ్రీమిన్నల వీరవెంకటసత్యనారా యణగారి భార్యఅగు శ్రీమతి లక్ష్మీనర్సమ్మగారు తమయిరువురి చంటిపిల్లలతోనూ శిక్షాకాలమగు 6 మాసములు సంపూర్తియగుటచే రాయవేలూరుచెఱసాలనుంచి విడుదలఅయి ఎలమంచిలిచేరిరి.

:—భట్లపెనుమఱ్ఱు. వల్లభనేని అన్నపూర్ణమ్మ, గుత్తికొండ సీతమ్మగార్లు మరి యిరువురు స్త్రీలు కాంగ్రెసు శిబిరముతాళము బ్రద్దలుకొట్టి శిబిరము స్వాధీనముచేసికొనిరి.

3:—లాహోరు. కీ. శే. దాదాభాయ్ నౌరోజీగారి మనుమరాలగు శ్రీమతి కుర్షిద్ బేనుకన్య ఎపెండిసిటిస్ వ్యాధికై లాహోరుఆసుపత్రిలో ఆపరేషనుచేయబడెను. ఆమెను స్త్రీలఖైదునుండి బొంబాయిరాజ ధానికి మార్చవలసినదని ఆమెబంధువులు కోరిరి. కాని పంజాబునందలి చెరసాలాధికారి ఈకోర్కెను నిరాకరించెను.

:—నెల్లూరు. ఓరుగంటి మహాలక్ష్మమ్మగారి అపీలు 10-8-1932 తేదీకి వాయిదావడెను.

4:—అంబాలాచెరసాలనుండి విడుదలయై శ్రీమతి అసఫ్ఆలీసతి మోటారుకారులో ఢిల్లీవచ్చెను.

5:—కలకత్తా. కుమారి సేవారాణి మజుందారుగారు బెంగాలిస్త్రీ త్రైలోక్యమజుందారుఅను మిద్నపూరు జిల్లాలో నందిగ్రామనివాసికుమార్తె విమానముపై ప్రపంచయాత్రజేయ నుద్దేశించినది.

:—కాశీ. శ్రీమతి కమలానెహ్రూగారికిపుడు స్వస్థతకలిగినది. లేచి తిరుగగలుగుచున్నారు.

:—భట్లపెనుమఱ్ఱు. కాంగ్రెసుశిబిరమును స్వాధీనముచేసికొనిన స్త్రీలను పామర్రు సబ్‌యిన్‌స్పెక్టరు ఎరస్టు చేసెను.

6:—నాగళ్ళవారిపాలెములో ఎరస్టుఅయిన శ్రీమతి కోగంటి వీరమ్మగారిని విడుదలచేసిరి.

7:—రాజమండ్రిలోని కీ. శే. రావుబహదరు కందుకూరి వీరేశలింగంపంతులుగారిచే స్థాపింపబడిన వితంతు శరణాలయమున ఇద్దరు బ్రాహ్మణబాలవితంతువులకు వివాహముజరిగెను. వరులుఇద్దరును అమలాపురం కాపురస్థులు. బ్రాహ్మణులు. అన్నదమ్ములు. వారిపేర్లు చెన్నుభట్ల రామమూర్తి, సౌమిత్రిగార్లు. వధువులు ఇరువురు అమలాపురంతాలూకాలోని వైదికకుటుంబమునకు చెందిన 18 సంవత్సరములలోపు వయసుగల బ్రాహ్మణవితంతువులు. వారిలో కనకసుందరమ్మ అనునామె రామమూర్తిగారిని, సూర్య కాంతమ్మ అనునామె సౌమిత్రిగారిని వివాహమాడిరి.

8:—కరాచి. పురపాలకసంఘపాఠశాలలబోర్డు చేర్మనుగారగు శ్రీమతి హతీంత్యాబ్జీ (సర్ అక్బరు హైదరి గారికుమార్తె) గారికి బెదిరింపు ఉత్తరమువచ్చెను.

9:—ఢిల్లీ. డాక్టరు సుఖదేవ్ గారికోడలగు శ్రీమతి సతీదేవిగారును, శ్రద్ధానంద్ మెమోరియల్ ట్రస్టు కార్యదర్శియగు శ్రీయుత ధరణవీరుగారిభార్య శ్రీమతి ప్రకాశవతి గారును గాంధిరోజు ఉత్సవములను చేసినందుకు 100 రూపాయలు జరిమానా లేక 1½ నెలలు ఖైదు విధించబడిరి. వారు జరిమానాలను కట్ట నిరాకరించిరి. చెరసాలకుపోవ నంగీకరించిరి.

:—బాగర్‌హాట్. కాంగ్రెసు కార్యక్రమమును సాగించినందులకు శ్రీమతి ఊర్మిళాదేవిగారును, మరి ముగ్గురును ఇండియన్ పోస్టాఫీసు ఆక్టు 4, 58 సెక్షనులక్రింద అరెస్టుచేయబడిరి.

:—బొంబాయి మునిసిపల్ సంఘసభ్యురాలును, కార్మికనాయకురాలునునగు శ్రీమతి మణిబెన్ కారాకన్య కకు చీఫ్ ప్రెసిడెన్సి మేజిస్ట్రేటుచే ఒకఏడాది కఠినశిక్ష, 300 రూపాయలు జరిమానా విధింపబడెను. జరిమానాకట్టనిచో ఆమె మరి 3 నెలలు కఠినశిక్ష ననుభవింపవలెను.

10:—కలకత్తా. గుండుదెబ్బతిని వైద్యశాలలో మృతినందిన టిప్పరాపోలీసుసూపరింటెండెంటు ఇ. బి. ఎల్లి సనుగారిభార్యయును, కుమార్తెయును ఇంగ్లాండు వెళ్ళుటకు నేడు ఇంపీరియలు మెయిలులో బొంబా యికి బయలుదేరిరి.

11:—అహమ్మదాబాదు. మిసు మణిబెనుపటేలుగారు (వల్లభాయిపటేలుగారి కుమార్తె) గత రెండునెలల నుండి యిచటనుండెను. గుజరాతుకాంగ్రెసు 23-వ డిక్టేటరుగ నియమింపబడెను. గుజరాతుకాం గ్రెసుసంఘముతో సంబంధము వదలుకొనవలెననియు, శాసనోల్లంఘనమునందు పాల్గొనరాదనియు, 24 గంటలలో అహమ్మదాబాదువిడచి ఆమె స్వగ్రామమగు కైరాజిల్లాలో కర్మసదునం దుండవలెనని జిల్లామేజిస్ట్రేటుగారు ఉత్తరువుచేసిరి.

:—మున్షీగంజ్. విక్రాంపూరు మహిళాసభ శాంతకాళీదేవిగారి యధ్యక్షతను జరుపబడెను. స్త్రీలు చాల మంది సభకువచ్చిరి. ప్రెసిడెంటును ఆహ్వానసంఘాధ్యక్షురాలును ఇంకొక 5 గురు స్త్రీలును నేరస్థు లనియెంచి వారిపై క్రిమినలు లాసవరణచట్టముప్రకారము నేరారోపణచేయబడెను. వీరిప్పుడు నిర్బం ధితులుగానున్నారు. మొత్తము 95 మందిస్త్రీలు మొట్టమొదట సభలో అరెస్టుచేయబడిరి.

12:—అహమదాబాదు. గుజరాతుకాంగ్రెసు 23-వ నియంత శ్రీమతి మణిబెన్ పటేలుగారు 7 గురు కాం గ్రెసు వలంటీర్లతో రటన్‌పోల్ వకువచ్చి పికెటింగునారంభింపగానే వారితోగూడ అరెస్టుచేయ బడెను. మణిబెన్ వల్లభాయిగారికూతురు. ఒకసారి శిక్ష ననుభవించినచ్చెను.

:—బొంబాయి. కార్పొరేషన్ సభ్యురాలు మణిబేన్ కారాగారు రాజద్రోహమునకును వర్గవిద్వేషప్రేరణకును ఒక సంవత్సరము కఠినఖైదు రు 300 జరిమానా విధింపబడిరి. ఈవిడతరఫున బారిష్టరు తల్యారుఖాన్ గారు హైకోర్టులో అపీలు దాఖలుచేసిరి. శిక్షవిధించిన మేజిస్ట్రేటు షాహుకార్లనుగూడ ఒక వర్గముగా పరిగణించి మణిబేన్ గారిపై 153 సెక్షన్ క్రింద నేరమునంగీకరించుట పొరపాటని తల్యారుఖాన్ గారు వాదించిరి.

13:—గుంటకల్లులో లోగడ అరెస్టుఅయిన శ్రీమతులు గొల్లమూడి వెంకాయమ్మ, వాసిరెడ్డి వెంకాయమ్మగార్లలో గొల్లమూడి వెంకాయమ్మగారికి నాలుగునెలల కఠినశిక్ష. వాసిరెడ్డి వెంకాయమ్మగారు క్షమాపణకోరుకొనుటచే విడుదలకాబడిరి.

:—తెనాలి. వితంతుశరణాలయప్రారంభోత్సవమును దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారు గావించిరి.

:—8-వ ఆంధ్రదేశకళావంతులమహాసభ తెనాలిలో శ్రీముత్తులక్ష్మిరెడ్డిగారి అధ్యక్షతనుజరిగెను.

14:—మున్షిగంజ్. విక్రమపూరు మహిళాసభకు హాజరైనందులకై శ్రీమతి మృణాళినీదేవి, సురబాలాదేవి, కమలాదేవి అనువారికి 6 నెలలు కఠినశిక్ష విధింపబడెను. సభాధ్యక్షతవహించిన విమల గంగూలీ యనునామెయొక్క తల్లియగు హేమంతకామినీదేవియనునామె చాలవృద్ధయగుటచే కోర్టుకచ్చేరి ముగియువరకుమాత్రమే ఖైదీగా నిర్బంధింపబడెను.

15:—బొంబాయి. శ్రీమతి మణిబెనుపటేలుగారికి 15 నెలలు కఠినశిక్ష. బి. తరగతి ఈయబడెను.

:—నెల్లూరు. ఓరుగంటి మహాలక్ష్మమ్మగారికేసు అపీలునంగీకరించి సెషన్సుజడ్జి రావుసాహెబు కృష్ణయ్యరుగారు శిక్షను రద్దుపరచిరి. చెల్లించియున్నచో జరిమానాను వాపసుచేయవలెనని ఆజ్ఞాపించిరి. మహాలక్ష్మమ్మగారికి ఒక్కసంవత్సరము కఠినఖైదు, రు. 1000 జరిమానావిధింపబడియుండెను. క్రిమినలు లాసవరణచట్టము 17 (1) క్రిందను పికెటింగు ఆర్డినెన్సు, పీ. కో. 127. సెక్షనులక్రిందనుగూడ కేసు రుజువుకాలేదని సెషన్సుజడ్జిగారు నిశ్చయించిరి.

:—కలకత్తా. టిప్పుసుల్తానుగారి మునిమనుమరాలు సాహెబుజాదీమహమూదీబేగంగారు మృతినొందిరి.

16:—తెనాలితాలూకా రాజకీయసభ కూచిపూడిలో తునివాస్తవ్యులును, శ్రీయుత కంభంపాటి సత్యనారాయణ ఎం. ఏ. గారి సతీమణియు, తుని దివాన్జీగారికోడలును విదుషీమణియునగు శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబగారి అధ్యక్షతనుజరిగెను. లాటీచార్జీలు, అరెస్టులు. అధ్యక్షురాలుకూడ అరెస్టుచేయబడెను.

:—లాహోరు. శాసనోల్లంఘనమునకు 2½ సంవత్సరముల కఠినఖైదు విధింపబడి 'సి' తరగతిలోనున్న విద్యావతీదేవిగారు హైకోర్టులో అపీలుచేసినారు.

17:—కలకత్తా. బెంగాల్ రాష్ట్రీయవిద్యార్థిదళ చిహ్నములనుధరించి కొలుటొలావీధిలో ఊరేగింపుచేసినందుకు శ్రీమతి గౌరిదేవి, రామదేవి, మాలినీదేవిగారలును మరియిద్దరు విద్యార్థులును 4 నెలలు కఠినశిక్షలు విధింపబడిరి.

:—సైలెట్. మహిళాసంఘమంత్రియగు శ్రీమతి శశిప్రభాదేవిగారికిని, శ్రీమతి బంతా కుమారీచౌదరీగారికిని 9 నెలలు కఠినశిక్ష, 50 రూపాయలు జరిమానా లేక అధికముగా 3 నెలలుశిక్షయు విధింపబడెను.

18:—వేలూరుజైలులోనున్న కృష్ణాజిల్లా గురజాడవారగు శ్రీమతి పొలదుగు వరలక్ష్మిగారు ప్రసవించిరి. ఆడశిశువు.

19:—బెజవాడకాపురస్తులు పొదుర్తి సుందరమ్మగారు వేలూరుజైలునుంచి విడుదలకాబడిరి.

:—వేలూరుజైలులోనున్న విశాఖపట్నంవారు శ్రీమతి దిగుమర్తి జానకీబాయిగారు ప్రసవించిరి. ఆడశిశువు.

20:—రాంచికాంగ్రెసు మూడవడిక్టేటరగు ఇందిరాసాహురుసతిగారికి క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టు 17 బి సెక్షనుక్రింద ఒకసంవత్సరము కఠినశిక్షయు, ఆర్డినెన్సుక్రింద 6 మాసములును విధించిరి.

:—బాలసోర్. నారీఆశ్రమముదాడిసందర్భమున సీతాదేవిగారిని అరెస్టుచేసి రు. 50 జరిమానాయును, లేనియెడల 6 వారముల కారాగృహవాసశిక్షను అనుభవించునట్లు శిక్షవేసిరి.

:—లాహోరు. గతించినభర్తకై తీవ్రమైనదీక్షవహించి ఐహికసుఖములమీద వాంఛవిడనాడి పొలములో ఆరుబైటనిలబడి ఎంతమంది వలదన్నను కూర్చొనుటకైనను సమ్మతించక నిద్రాహారములులేక, 4 వారములుగనున్న హిందూయువతి ఈరోజున స్పృహతప్పిపడిపోయినది. పురజనులు ఆశ్చర్యముతో ఈమెను వీక్షించుచుండిరి. వారు ఈమెను పరుపుమీదపరుండబెట్టిరి. అంతట ఆమె మరల నిలువబడినది. ఇప్పటికినిగూడ ఆమె ఆహారముతినుటకు నిష్టపడుటలేదు.

# గ్రంథపరిచయము

## సెట్టిబలిజశతకము:—

గ్రంథకర్త పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు. సెట్టిబలిజసంఘమును ప్రబోధించుటకు మామిత్రులు శ్రీసత్యనారాయణరాజుగారు ఆటవెలదులశతకమును రచియించిరి. 'కట్టుసేయవయ్య! సెట్టిబలిజ!' అనుమకుటము. పద్యములు వేమన్నగారిధోరణిలోనున్నవి. ఇందలినీతులు ప్రతిసంఘమువారును సమాదరింపవలసినవి. మఱియొకగ్రంథము సెట్టిబలిజలు పారాయణచేయతగినది. క్రౌనుసైజు. చక్కనిగ్లేజుకాగితములు, అందమైనఅచ్చు, 16 పుటలు. వెల రు. 0-2-0 అణాలు. ఈగ్రంథములు వలయువారు తణుకు గ్రంథకర్తపేర వ్రాసిన బడయగలరు.

## మనదేశచరిత్ర:—

హిందూదేశచరిత్రకథలు బాలురకుఅందుశైలిలో పెక్కుచిత్రములతో ఇందుగలవు. రెండుభాగములు, క్రౌనుసైజు, గ్లేజుకాగితములు, చక్కనిఅచ్చు, మొదటిభాగము 76 పుటలు వెల రు 0-4-0 అణాలు; రెండవభాగము 108 పుటలు వెల రు 0-6-0 అణాలు. ఎలిమెంటరీస్కూళ్ళకు తగియున్నవి. ప్రచురణకర్తలు: సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సు, మదరాసు.

## సంస్కృతాంధ్రసంఖ్యార్థబోధిని:—

సంస్కృతాంధ్రబోధినీగ్రంథమాలలో ప్రథమగ్రంథము. శ్రీభాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారిచే రచియింపబడినది. మహారాజశ్రీశ్రీ శ్రీభద్రాచలమురాజావారి ధనసాహాయ్యముచే ముద్రితము. శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు దీనికి పీఠికవ్రాసియున్నారు. సంస్కృతాంధ్రభాషలయందు సంఖ్యాసంబంధమగు సకలలక్షణలక్ష్యములఁ దెలుపుగ్రంథము. లక్షణయుక్తముగ భాష నభ్యసింపఁదలఁచుకొనువారికిని, సలక్షణముగ గ్రంథములు రచింపఁదలఁచుకొనువారికిని విశేషపరిశ్రమపడివ్రాసిన ఈగ్రంథమత్యంతోపయోగకరమని నిస్సంశయముగఁ జెప్పవచ్చును." డెమ్మిసైజున 80 పుటలు. వలయువారు: గ్రంథకర్తపేర తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురము వ్రాయునది.

## ఆనందాబాయి:—

చరిత్రాత్మకమగు వచనరూపకము. కృతికర్త బుఱ్ఱా సూర్యనారాయణగారు. పాలకొండ కందికుప్ప కొండలరావు బి. ఏ., యల్. టి. వారిచే పరిష్కృతము. హిందూమహమ్మదీయసామరస్యమును రేకెత్తించును,

శేతవరపు వేంకటశాస్త్రి గారు రచియించిన ఆనందబాయి అను నవలననుసరించి ఈదృశ్యకావ్యము వ్రాయబడినది. శైలి సులభము. నాటకము రక్తికట్టినది. డెమ్మిసైజున 140 పుటలు. గ్లేజుకాగితములు. వెల 0-12-0 అణాలు. చిరునామా: పి. సూర్యనారాయణగారు, టీచరు, బోర్డుహైస్కూలు, పాలకొండ, విశాఖపట్టణముజిల్లా.

**శరీర దేవాలయ రహస్యార్థ పారిజాతము:—**

కడపజిల్లా గడికోట ఆశ్రమవాసులగు శ్రీపరమహంస సచ్చిదానందయోగీశ్వరులవారిచే రచియింపబడినది. శరీరమునే దేవాలయముగాజూపెట్టి ఆశరీర దేవాలయముయొక్క రహస్యార్థములనంతయు వెల్లడించియున్నారు. ముముక్షుజనులు తప్పక చదువవలసినది. క్రౌనుసైజున 80 పుటలు. వెల 0-6-0. చిరునామా: శ్రీసచ్చిదానందర్ అండుకంపెనీ, పెరంబూరుబారక్సుపోస్టు, చెన్నపురి.

**భక్తచింతామణి:—**

'శ్రీమద్భానుసహస్రసమండలవిభాసీ!'...అనుపద్యము రాని అక్షరాస్యుడగు ఆంధ్రుడులేడు. ఆపద్యము 'భక్తచింతామణి'లోని తొలిపద్యము. ఈగ్రంథమింతవఱకు ఇరువదియొక్క ముద్రణములందినదనుటచే గ్రంథప్రచారమూహింపనగును. కవిశేఖర వడ్డాది సుబ్బారాయుడుగారి పేరు కలకాలముండుటకీగ్రంథముచాలును. ఈవిఖ్యాతగ్రంథమునుగూర్చి విశేషవిమర్శన మనవసరము. క్రౌనుసైజున 80 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు 0-5-0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేర రాజమండ్రి వ్రాయవలెను.

**శ్రీమదధ్యాత్మరామాయణము:—**

శ్రీరామహృదయసహిత బాలకాండము. స్త్రీలపాట. జోలవరుస. పుల్లెల సుబ్రహ్మణ్యకవిచే పదకవితగ విరచింపబడినది. డెమ్మిసైజున 20 పుటలు. వెల 0-2-0 అణాలు. ఆరుప్రతులుకొనువారికి ఒక ప్రతి ఉచితముగానీయబడును. వలయువారు ముత్తింటి సత్యనారాయణమూర్తిగారు, బారువ, గంజాంజిల్లా అను చిరునామాకువ్రాయునది. తపాలాఖర్చులు ప్రత్యేకము-స్త్రీలును, గ్రంథాలయమువారును తపాలాఖర్చులకుగాను 0-0-6 అర్ధణాబిళ్ళపంపిన ఈగ్రంథము ఉచితముగాపంపబడును.

**ప్రేమాంజలి:—**

రచయిత మద్దా విశ్వనాథముగారు. చక్కనిరచనము. ఉత్కృష్టాదర్శములను రేపు ఇతివృత్తము. గ్రంథముద్రణమును చాలబాగున్నది. చిన్నసైజున 84 పుటలు. మూల్యము నాలుగుఅణాలు. ప్రకాశకులు: వ్యాసకుటీరము, మేలుపాక, యలమంచిలిపోస్టు, విశాఖపట్టణముజిల్లా.

**అఘవినాశశతకము:—**

కృష్ణాజిల్లా చేతవోలుగ్రామకాపురస్తులగు శ్రీమాన్ శ్రీపతి సుదర్శనాచార్యులవారి ప్రియశిష్యుండగు దాసరి అంజదాసువిరచితము. ఈశతకము రెడ్డికవి సార్వభౌముని వేమనశతకమును దాదాపుపోలియున్నది. పామరకవిభక్తునిచే రచియింపబడినదగుట ఇందలి శబ్దసంస్కారమువగైరాలకు ప్రాకులాడకుడని శ్రీ అబ్బరాజు వేంకటరంగారావుగారు పరిచయవాక్యములలో తెలిపినారు. క్రౌనుసైజున 16 పుటలు. వెల 0-2-0 అణాలు. పుస్తకములు వలయువారు కొప్పోలు చలపతిరావుగారు, చీరాలఅని వ్రాయవలెను.

**మల్లెపువ్వులు:—**

శ్రీబాలభారతీగ్రంథనిలయమువారి అనుబంధగ్రంథమాల మూడవకుసుమము. గ్రంథకర్త కే. అన్నమరాజశర్మగారు. ఖండకావ్యముల సంపుటి. 'దుర్గావతి'నిగూర్చిన పద్యములు హృద్యములు. ప్రకృతికి సంబంధించి ఇందలి పెక్కుగీతములు పఠనీయములైయున్నవి. క్రౌనుసైజు. గ్లేజుకాగితములు. 42 పుటలు. వెల 0-4-0 అణాలు. ప్రకటనకర్త: యం. రామసుబ్బయ్యశ్రేష్టిగారు, ప్రెసిడెంటు, శ్రీబాలభారతీగ్రంథనిలయము, చాగలమఱ్ఱి, కర్నూలుజిల్లా.




**మదరాసు విశ్వవిద్యాలయము : స్త్రీ పట్టభద్రులు:—**

ఆగష్టు మొదటివారమున మదరాసువిశ్వకళాపరిషత్తు పట్టప్రదానోత్సవముజరిగినది. 1835 మంది పట్టభద్రులు తమపట్టములబడసిరి. ఇందు 110 మందిస్త్రీలు. బి. యల్. పట్టమును 143 ముగ్గురు పురుషులుపొందిరి. ఆపట్టమునుపొందిన స్త్రీఒక్కతియే. యం. బి. బి. యస్. పట్టమునుపొందిన 23 గ్గురిలో 6 గురుస్త్రీలగుట సంతోషింపదగినది. బి. యస్. సి. పట్టభద్రులు 42 రలో స్త్రీలు 4 గురు. యల్. టి పట్టభద్రులు 57 గురు. అందు స్త్రీలు 27 గురు. పురుషులతో ఇంచుమించుస్త్రీలు సమానసంఖ్యగానున్నశాఖ ఇదియొక్కటియే. యం. ఏ పట్టమునుపొందిన 78 గురలో స్త్రీలు 8 గురుఉండుట అభినందనీయము. బి. ఏ. ఆనర్సుపట్టభద్రులు 148 గురలో స్త్రీలు 9 గురు; బి. ఏ పట్టభద్రులు 640 గురలో స్త్రీలు 50 గురుఉండుట కొంతవఱకు ప్రోత్సాహకరముగనేఉన్నది. ప్రాచ్యవిజ్ఞానపరీక్షలలో పట్టములనందిన 41 మందియందు ఒక్కరుతయే స్త్రీయుండుట స్త్రీలకు ప్రాచ్యవిద్యాసౌకర్యములు బొత్తుగాలేవని తేటతెల్లమగుచున్నది. పై లెక్కలనుబట్టిచూడ స్త్రీలు వైద్యము, సాధారణవిద్యయెడ చాలఉత్సాహవతులై యున్నారని తెలియనగును. డాక్టరులు, ఉపాధ్యాయినులు అగుటకుమాత్రమేగాక ఇతరవృత్తులయందు చొఱబాఱుటకుకూడ స్త్రీలు ప్రయత్నింపనగును. వారికితగిన అవకాశములనుసమకూర్చుటవిశ్వవిద్యాలయముయొక్కవిధి.

**ప్రభుసతి మంగళసూత్రము:—**

ఇంకను ప్రభుత్వమువారి చెంతనేయున్నట్లు శాసనసభాప్రశ్నోత్తరములవలన తెలియవచ్చుచున్నది. మంగళసూత్రమును తెంపించి దగ్గరపెట్టుకొనుటలో ప్రభుత్వమువారి అర్థమేమో తెలియదు. ప్రభుసతికోరిన ఇత్తురట. చేసినదితప్పు. దానిని దిద్దుకొనుటకు ప్రయత్నింపక పరువుకొఱకు ఇట్లుప్రాకులాడుచుండుట భావ్యముకాదు. ఇకనైన ప్రభుత్వమువారు ఆమె మంగళసూత్రమును ఆమెకిచ్చి ప్రజామోదమును బడయుదురుగాక యని కోరుచున్నాము. ఇది రాజకీయముతో సంబంధములేని విషయము. రాజకీయము పొంతపోవని వారిమనములనుగూడ నిది కలతపెట్టుచున్నది. ప్రభుత్వమువారు గమనింతురుగాక!

**ఆడుఖైదీల అగచాట్లు :—**

దుర్భరముగనున్నవని విడుదలయైవచ్చిన వారుచెప్పుసంగతులవలన విస్పష్టమగుచున్నది. ప్రకాశముపంతులు, రుక్మిణీలక్ష్మీపతి, వేంకటరమణమ్మ మొదలగువారు పత్రికలకెక్కించినవిషయములు పరికింపగా సి క్లాసు స్త్రీఖైదీలకష్టములు అనంతములుగానున్నవి. మజ్జిగనీళ్ళులేవు. మజ్జిగనీళ్ళకు మొగమువాచి వారు నులిగడుపు, విరేచనములతో బాధపడుచున్నారు. మూడులక్షలు ప్రజాద్రవ్యమునువెచ్చించి స్త్రీలకొఱకు ప్రత్యేకకారాగారమును నిర్మించి ఇపుడు స్త్రీఖైదీలనెల్లర నందుంచక కొందఱిని కన్ననూరు, మధురజెయిళ్ళకుమార్చుచున్నారనివిందుము. ఆడుఖైదీలలో విస్తారముఆంధ్రులే. వీరిని భాషతెలియని అరవజెయిళ్ళకుమార్చుటలో అర్థములేదు. ఆజెయిళ్ళలో స్త్రీలకు ప్రత్యేకము లేడీడాక్టర్లులేరు. ఆడుఖైదీలనిట్లు ప్రత్యేకము అగచాట్లకుపాలుపఱచుట ఆందోళనకు కారణమగునని ప్రభుత్వము వారితో మనవిచేయుచున్నాము.

**శ్రీమతి పార్వతీబాయి విరాళము:—**

వార్ధాడిప్యూటీ కమీషనరు (విశ్రాంతివేతనమును గొన్నవారు) భార్య శ్రీమతి పార్వతీబాయిపిటోంబ్ గారు బీదమహారాష్ట్రబ్రాహ్మణబాలబాలికలకు విద్యాసౌకర్యములు సంపాదించుటకై ఇరువదివేల రూపాయిలనిధిని ఏర్పాటుచేసిరి. దేశహితముకొఱకు స్త్రీలీవిధమున సాయపడుచుండుట మెచ్చదగినది. ఈ ఆదర్శమును పలువురను ప్రబోధింపగలుగునుగాక!

**అన్నపూర్ణాదేవి లేఖలు :--**

సంఘమును, దేశమును సంస్తవనీయముగ సేవించి స్వర్గమలంకరించిన శ్రీమాగంటి అన్నపూర్ణాదేవిగారిలేఖలు గ్రంథరూపమున వెలువడనున్నవని వినుటకు ఆనందితులమగుచున్నాము. ప్రచురించును ద్దేశముతో వ్రాయకుండినవగుట ఈలేఖలు ఆంగ్లవాఙ్మయమున కౌవరు, లేడీ మాంటాగ్యూ మొదలగు వారిలేఖలవలె ఆంధ్రవాఙ్మయమున లేఖావాఙ్మయశాఖకు చక్కని ప్రారంభముకాగలవు. ఈలేఖలు శ్రీఉన్నవలక్ష్మీనారాయణగారిపీఠికతో దసరాఉత్సవములలో ప్రకటింపబడనున్నవి. వీనికి మాస్వాగతము. వివరములు తెలిసికొనగోరువారు విశాఖపట్టణమునందలి భాషాసేవకులు శ్రీపురిపండా అప్పలస్వామిగారికి వ్రాయవచ్చును.

**ఆంధ్రసరస్వతీగ్రంథమాల:--**

ఆంధ్రభాషను అనేకరీతులసేవింపుచున్న శ్రీ టేకుమళ్ళ రాజగోపాలరావుగారీగ్రంథమాలకు స్వామదారులగుట ఆంధ్రప్రపంచమెఱింగిన విషయమే. యుద్ధకారణముచేత కొన్నిసంవత్సరములుగా ఈగ్రంథమాలనిలుపబడినది. ఇపు డది ఆంధ్రులఅదృష్టవశమున పునరుద్ధరింపబడినది. ఇందు సంవత్సరమునకు ఒకటిరెండు ఆర్థికగ్రంథములు, ఒకటిరెండు కళారాధకగ్రంథములు ప్రచురింపబడుచుండును. విజ్ఞానచంద్రికామండలివారు విడిచిపెట్టిన

సారస్వతశాఖల నీఆంధ్రసరస్వతీగ్రంథమాలచేకొని పరిపుష్టమునొందింపగలదు. అగుట ఈగ్రంథమాలతావి ఆంధ్రవిశ్వమునంతను అల్లుకొనదగినది. ఆంధ్రమహాజనులు ఈవిషయమున శ్రీ ఓరుమళ్ళ రాజగోపాలరావుగారికితోడ్పడి చందాదారులుగ తాముచేరియు మిత్రులను చేర్పించియు భాషాభ్యుదయమునకు పాల్పడుదురుగాకయని హెచ్చరింతుము. మద్రాసు, వేపేరీపోస్టు, 124 వెల్లాళవీథియందున్న రాజగోపాలరావుగారితో ఈవిషయమై ఉత్తర ప్రత్యుత్తరములు జరుపనగును.

పుష్కరములరిటరన్ టికెట్లవిషయమై:--

మేము ఆగష్టుసంచికలో వ్రాసినవాక్యములు యమ్. యస్. యమ్. రైల్వేకంపెనీవారి సలహాసంఘమున ఆంధ్రపతినిధులగు వి. వియ్యన్నగారు వారినిగూర్చిన విమర్శగాగైకొనినారు. చదివినవారికి అది విమర్శకాదని తెలియగలదు. ఇండియన్ రైల్వేమేగజన్‌వారుకూడ మేముపొందిన అభిప్రాయముతోడనే ఉండిరని శ్రీ వియ్యన్నగారు ఈసరికి గ్రహించియుందురు. వియన్నగారు మాకువ్రాసినలేఖనుబట్టి వారీవిషయమై పూర్తిప్రయత్నమొనరించియున్నారనుటనిశ్చయము. కాని వారుచేసిన, చేయుచున్నపనినిమాత్రము తెలుగువారు పూర్తిగ తెలిసికొనుటకు అవకాశములేకున్నది. ఇకనైన వారీవిషయములను ఎప్పటికప్పుడు పూర్తివివరములతో పత్రికలయందు ప్రచురింపుచుండనగును.

శ్రీ పెనుమెచ్చ పిద్దిరాజుగారి విజయము:—

బ్రిడ్జిలరాజుగారని అన్వర్థనామమార్జించిన శ్రీపెద్దిరాజుగారు పశ్చిమగోదావరిమండలమున శాసనసభకు ప్రతినిధులుగాఎన్నుకొనబడుట వారిప్రజాసేవకు యోగ్యతాపత్రము. మండలమునకు వారుచేసినసేవనుబట్టి పోటీలేకనే వారెన్నుకొనబడవలసినది. కాని పోటీ ఉండకతప్పినదికాదు. ఆపోటీయు తీవ్రరూపముదాల్చినది. అయినను ప్రజాపక్షమునకే విజయముగలిగినది. ప్రభుత్వోద్యోగిని ప్రజాప్రతినిధిగఎన్నుకొన్నారను అపదూఱునుండి మండలవాసులురక్షింపబడిరి. స్థానికమహాసంఘమునకు అధ్యక్షులై, శాసనసభకు ప్రతినిధులై తమ్ముసేవింపుచున్న శ్రీపెద్దిరాజుగారి నిరంతరవిజయమునకు పశ్చిమగోదావరీమండలవాసులెల్ల పూటకాపులై యుండగలరు. శ్రీరాజుగారికి మాఅభివాదములు.

కీ. శే. కొండాలి సుబ్బారావు:--

రాజమండ్రిఆర్ట్సుకాలేజీలో బి. య్యే పరీక్షకువచ్చినప్పుడు ప్రథమపరిచయము. ఆంతర్యమిచ్చిన మిత్రునివలెమాటలాడెను. మొన్న ఎం. ఏ పరీక్షకువచ్చినప్పుడు తిరిగి మద్రాసులో రెండవసారిసమావేశము. ఆంతర్యముపుచ్చుకొను మిత్రునివలె మాటలాడెను. ఈసమావేశమే తుదిసమావేశమయ్యెను. ఆంధ్రవాఙ్మయవృక్షముయొక్క ఒకదోరకాయ రాలిపోయినది. ఈతనినామము సుస్థిరముగ వెలయుటకు ఈతని ఇప్పటిరచనములు చాలి

యున్నవి. కాని వేంకటరమణయ్య, రంగాచారి, రామారావుమొదలగు ఆంధ్రకళోపాసకులకీతిని ఈతడును చిన్నతనముననే పంచత్వమొందుట ఆంధ్రమాతపాపము. ఈతనిఆత్మకు శాంతినికోరి కవితో కంఠముకలిపి ఈమంత్రముల నుచ్చరింతము:

శిథిలహంపీక్షేత్రశిల్పచాతుర్యంబు చెవులుగింగురుకొన చెప్పి చెప్పి
"మాయమ్మ మాకిత్తువా" యన్నదీనోక్తి కడుపుచుమ్మలుబుట్ట నుడివినుడివి
ఝాన్సిలక్ష్మిబాయి శౌర్యాతిరేకంబు పౌరుషంబుడికింప పాడిపాడి
మధురకవిత్వసామ్రాజ్యాన రెుంపలేని స్వైరవిహారంబు సలిపిసలిపి
ఆత్మబంధులమిత్రుల బాదమరచి జనకు నీదరావి వియోగజలధిద్రోసి
ఆంధ్రమాత కహో! గుండెలవియ ఖరముచూరగొన్నావటే? కోడాలి సుబ్బరాయ!

—కోనరాజు రాఘవయ్యచౌదరి.

తెనాలివితంతుశరణాలయము: దేశోద్ధారకునివిరాళము:--

శ్రీయుత యం. వి. శేషగిరిరావుగారి కార్యదర్శిత్వమున తెనాలిలో నెలకొల్పబడిన వితంతుశరణాలయమునకు దేశోద్ధారక శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ప్రారంభోత్సవముజరిపిరి. ఇతరులుసల్పు ప్రారంభోత్సవములవలె దేశోద్ధారకుడుసల్పు ప్రారంభోత్సవము కేవలమువాక్కులతోడనే ముగియదు. ఆశీర్వచనములకుతోడు శ్రీపంతులుగారు నూరురూపాయిలు శరణాలయమునకు విరాళమిచ్చి దాని భావిఅభివృద్ధికి శుభారంభమును గావించిరి. దేశోద్ధారకునకు ఆంధ్రస్త్రీలోకముపక్షమున 'గృహలక్ష్మి' తన అభివాదములను తెలుపుకొనుచున్నది.

సాంఘికసమస్యాపరిష్కారము:—

మంత్రిమాణిక్యుడు మేక్డొనాల్డుగావించిన సాంఘికసమస్యాపరిష్కారము పలువుర అసంతృప్తికికారణమైనది. స్త్రీలవిషయమున ఇది ఘోరమైనఅన్యాయము గావించినదని చెప్పకతప్పదు. రౌండుటేబిలుసమావేశమునకు ప్రతినిధురాండ్రుగపోయి వచ్చిన శ్రీమతులు బేగముషానవాజు, సుబ్బారాయనుసతిగార్లు ఈపరిష్కారమును అస్పష్టవచనములతో నిరసించియున్నారు. శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారీపరిష్కారము నిరర్థకమనిరి. మద్రాసు భారతమహిళాసంఘమువారు ఆమోదించుటకు వీలులేనిపరిష్కారమిది యని అభిప్రాయపడిరి. దేశమును శాంతింపచేయుటకుబదులు నిద్రాణములై యున్న మఱికొన్నిశక్తులను రేకెత్తించుటకు సమర్థమైనదిగానున్న దీనిని పరిష్కారమనజాలమని రాజకీయవేత్తలెల్లరు ఒక్కకంఠమున నొక్కిపల్కియున్నారు. మేక్డొనాల్డు ఇప్పుడికఏరాకకువచ్చునో?

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.